అపరాధ పరిశోధన అనుబంధం—127

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

17/6/84

## పులితల మనిషి

రచన: ప్రతాపరవిశంకర్

## అత్తా - కోడలు

రచన: పి. అరుణ

## తూనీగ రెక్కలు

రచన: చంద్రశేఖర అజాద్

## సరైన అల్లుడు

రచన: టెంపోరావ్

కళ్యాణదుర్గం - ఎనిమిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—127
జూలై, 1984
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# పులి తల మనిషి

ప్రతాప రవిశంకర్

సనమ్ తేరీ కసమ్—

సినిమా మొదలయింది. దీపాలు పూర్తిగా ఆరిపోయాయి. బాల్కనీలో కూర్చుంది మనోరమ.

ఆమె నిమిష నిముషానికీ వెనక్కు తిరిగి చూస్తోంది. అంతా చీకటిగా వుంది. ఎవరెవరో వస్తున్నారు.

కాని—మనోరమకు కావలసిన మనిషి రావటంలేదు. ఆమె మనసు అందుకే ఆందోళనగా వుంది.

కుమార్ ఎందుకు రాలేదు? తప్పకుండా వస్తాననీ రెండు టిక్కెట్లు తీసుకొని లోపలకు వెళ్ళి కూర్చోమనీ గట్టిగానే చెప్పాడు.

అందుకే మనోరమ ముందుగానే వచ్చి రెండు బాల్కనీ టిక్కెట్లు తీసుకుంది. లోపలకు వచ్చి కూర్చుంది.

న్యూస్ రీల్స్ మొదలయ్యాయి. రెండు పూర్తిగా ఐపోయాయి. ఇంకేవో రకరకాల ఎడ్వర్టయిజ్మెంట్లు....

అవీ అయిపోతున్నా కుమార్ రాలేదు.

చివరకు సినిమా కూడా మొదలయ్యింది.

మనోరమకు ఏం చెయ్యటానికీ తోచలేదు. అతను రాలేదని తను కూడా బయటకు వెళ్ళిపోతే?

వెళ్ళొచ్చు. కాని తను వెళ్ళిన తర్వాత అతను వస్తే బాధపడతాడు. తన తొందరపాటును అతను క్షమించడు.

ఇప్పుడేమిటి చెయ్యటం?

ఇలా ఆలోచిస్తోంది మనోరమ.

అతను తప్పకుండా వస్తాడనే రెండో టిక్కెట్టును కూడా గేటు దగ్గరున్న మనిషికి ఇచ్చేసింది చెప్పి. అతను దాన్ని కూడా కట్ చేశాడు.

థియేటర్ పూర్తిగా నిండిపోయింది.

సినిమా జరుగుతోంది. అంతా ఎంతో ఆసక్తిగా స్క్రీన్ మీదకు చూస్తున్నారు — ఒక్క మనోరమ తప్ప.

ఆమె ఇంకా వెనక్కు తిరిగి చూస్తోంది.

డోర్ మూసి వుంది. ఇప్పుడెవ్వరూ రావటంలేదు. బుకింగ్ క్లోజ్ చేసి వుంటారు.

అప్పుడు మనోరమ — కుమార్ వస్తాడనే ఆశను పూర్తిగా వదులుకున్నది. లేచి బయటకు వెళ్ళిపోదామని అనుకున్నది.

కాని స్క్రీన్ మీదకు చూడగానే, ఓ ఐదు నిముషాలయినా సినిమా చూసి వెళ్ళాలని అనుకున్నది. సినిమా బావుందని తప్పకుండా చూడాలనీ అనుకున్నది. అందుకే కుమార్‌తో కలసి ఆ రోజు చూడటానికి ప్రోగ్రాం వేసుకొన్నది.

ఐతే — ఇలా జరిగింది.

ఆలోచనల్లో మునిగిపోయిన మనోరమ తన పక్కనే

ఖాళీగా వున్న ఛైయిర్లోకి ఓ మనిషి వచ్చి పిల్లిలా దూర్చోవటాన్ని గమనించలేకపోయింది.

ఒకే ఒక్క నిమిషం గడిచిన తర్వాత—ఆమె చేతికి అతడి చెయ్యి తగలగానే వులిక్కిపడి తలతిప్పి అతడ్ని చూసింది.

అతను—సన్నగా వున్నాడు. పొడుగ్గా వున్న మొహం ముందుకు పొడుచుకువచ్చిన కళ్ళు.... సన్నని మీసాలతో అదోలా వున్నాడు.. అతడి పెదవులు అదోలా నవ్వుతున్నాయి.

చటుక్కున తన చేతిని లాక్కుంది.

అతను నవ్వాడు.

నవ్వి "కంగారు పడకు .... నా పేరు జాన్సన్" అన్నాడు.

మనోరమ వెంటనే మాట్లాడలేకపోయింది.

ఎవరితను?

తను అడక్కుండానే తన పేరు జాన్సన్ అని ఎందుకు చెబుతున్నాడు? అనుకుంది.

జాన్సన్ మరింతగా మనోరమ పక్కకు వొంగి "ఈ సినిమాను జంటగానే చూడాలి .... ఒంటిగా చూడకూడదు. అందుకే నేను వచ్చాను" అన్నాడు.

మనోరమకు కోపం ఆగలేదు.

"యూ ఫూల్ ....అరిచి గొడవచేస్తాను. ఈ థియేటర్ వాళ్ళు నిన్ను పిండిచేస్తారు" అన్నది.

అతను మళ్ళీ నవ్వాడు.

నవ్వి "అలా చేస్తే నీకే ప్రమాదం....నీకే కాదు .. ఇప్పటివరకూ నువ్వు ఇక్కడకు వస్తాడని ఎదురుచూసిన కుమార్ కు కూడా ప్రమాదమే" అన్నాడు.

ఉలిక్కిపడింది మనోరమ.

భయంగా అతడి కళ్ళలోకి చూసింది.

"ఇప్పుడు నువ్వు సస్పెన్స్‌లో పడిపోయావ్ మనోరమా. నేనెవరో నీకు తెలీదు. కాని నీ గురించి నాకు అంతా తెలుసు. కుమార్ నిన్ను కలుసుకోలేదు."

"ఏమయ్యింది? నా కుమార్‌కు యేం జరిగింది?" ఆత్రంగా అడిగింది.

"అంతా సస్పెన్స్....ఇప్పుడు ఇక్కడ నీకు నేనేమీ చెప్పను. ముందు నువ్వు నాతో బయల్దేరాలి."

"ఎక్కడికి?"

"అదీ కూడా సస్పెన్స్....నువ్వు పిచ్చి ప్రశ్నలు అడక్కూడదు. నీ ప్రశ్నలకు నేను జవాబులు చెప్పను... ఒక్క విషయం చెప్పగలను. ఇప్పుడు నీ కుమార్ మా బందీగా వున్నాడు. అతడి ప్రాణాలు నిలవాలంటే నువ్వు నోర్మూసుకొని నాతో బయల్దేరక తప్పదు" అన్నాడు జాన్సన్.

అతనంత గట్టిగా చెప్పిన తర్వాత మనోరమ ఇంకె లాంటి ప్రశ్నలూ అడగలేకపోయింది.

ఆమెకి నిజంగానే అంతా సస్పెన్స్‌గా వున్నది.

అసలేమిటి ఇదంతా?

ఈ జాన్సన్ ఎవరు? కుమార్‌ను ఎందుకు బందీని చేశారు? ఇప్పుడు తనని తీసుకెళ్ళి ఏం చేస్తారు?

ఎవరు వీళ్ళంతా?

సినిమా జరుగుతూనే వుంది.

"ఇక వెళదామా?" చిన్నగా అన్నాడు జాన్సన్.

అప్పుడే ఓ ఆలోచన వచ్చింది మనోరమకి-అక్కడే ఎవరికయినా అతడి గురించి చెబితే? తన కుమార్‌ను

యెక్కడో బందీగా చేశాడనీ ఇప్పుడు తనని కూడా రమ్మంటున్నాడనీ ఎవరికయినా చెప్పి తమని రక్షించమని అడిగితే?

కాని త్వరలోనే ఆమె అలాంటి ఆలోచనను విరమించుకున్నది. తనలా చెప్పినా తనమాట యెవరూ నమ్మరు. అతను తనెవరో తెలియదనీ తనకీ అతనికీ ఎలాంటి సంబంధమూ లేదని అంటాడు. అంతేకాదు. బయటకు వెళ్ళిన తర్వాత తనని కూడా కుమార్‌ని బందీ చేసినట్టుగానే చేస్తాడు.

అందుకని మనోరమ ప్రతిఘటించదల్చుకోలేదు.

"ఏమిటీ ఆలోచిస్తున్నావ్?" అడిగాడు నవ్వుతూ.

"పద.... వెళదాం...." లేచి నిల్చుంది.

జాన్సన్ కూడా నిలుచున్నాడు.

నిమిషం తర్వాత బయటకొచ్చారు.

రోడ్డువారగా ఓ నల్లటి ఎంబాసిడర్ కారు ఆగివుంది. అతను డోర్ తెరిచాడు. ఆమె అతడికేసి ఒక్కసారి అనుమానంగా చూసి లోపల కూర్చుంది.

అతను డోర్ మూసి తనూ కూర్చుని స్టార్టు చేశాడు.

ముందుకు కదిలింది.

రోడ్డు దీపాలు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి.

షాపులనిండా జనం క్రిక్కిరిసి వున్నారు.

ఆమె మవునంగా ఆలోచిస్తోంది.

కారు నెమ్మదిగా వెళుతూనే ఓ చీకటి సందులోకి ప్రవేశించింది. ఆ రోడ్డులో జనసంచారం లేదు.

కారు ఆగిపోయింది.

జాన్సన్ నల్లటి రిబ్బనులాంటి గుడ్డనుతీసి ఆమె కళ్ళకి కట్టాడు.

"భయపడకు. ఇదంతా ముందు జాగ్రత్తగా ఇలా చేస్తాము. నీకు డిటెక్టివ్ నవలలు చదివే అలవాటు వుందా? అలాంటి అలవాటు నీకు వుంటే ఇదంతా థ్రిల్లింగ్ గా వుంటుంది" అని ఈసారి పెద్దగా నవ్వాడు.

మనోరమకు నవ్వురాలేదు.

ఏడుపు వచ్చింది.

ఎవడీ జాన్సన్ ....ఎందుకు తననిలా ఏడిపిస్తున్నాడు? ఇంతకీ ఏం జరగబోతోంది? తను ఎక్కడికి వెళుతోంది?

నిజంగా కుమార్ బందీ ఐనాడా?

కారు మళ్ళీ ముందుకు కదిలింది.

## 2

కాంతారావు ఇంట్లోనించి బయటకు వచ్చాడు. బయటకు వస్తూనే చేతికున్న వాచీకేసి చూసుకున్నాడు.

తొమ్మిది గంటలు దాటుతోంది.

అతను సిగరెట్టు ముట్టించాడు.

రోడ్డుమీద నడుస్తున్నాడు. ఎక్కువగా జనసంచారం లేదు. అప్పుడప్పుడు ఒకరిద్దరు మనుషులు యెదురు వస్తున్నారు.

కాంతారావు బ్రహ్మచారి. అతను అందంగానే వుంటాడు. పొడుగ్గా — అందుకు తగిన లావుతో ఆడ వాళ్ళను ఇట్టే ఆకరిస్తాడు.

అతను ఓ చిన్న తరహా వ్యాపారం చేస్తున్నాడు. ప్రజలకు కావలసిన నిత్యావసర వస్తువులను కొన్నింటిని తక్కువ ధరకు కొని వాటిని ఎక్కువ ధరకు అమ్ముతూ వుంటాడు. నిజానికి ఆ వ్యాపారంలో అతను ఎక్కువగా కష్టపడుతున్నది ఏమీ లేదు. ఎందుకంటే అతని దగ్గర పనిచేసే ఇద్దరు యువకులే ఆ వ్యాపారాన్ని సమర్థ

శంతంగా నిర్వహిస్తున్నారు.

కేవలం డబ్బు అజమాయిషీ లాభాలు మాత్రం కాంతారావువి.

అందుకే అతను తీరిగ్గా—విలాసంగా తిరుగుతూ వుంటాడు. అలా తిరుగుతూనే కాంతారావు కొన్ని రోజుల క్రితం ఓ అమ్మాయి ప్రేమలో పడ్డాడు. ఆ అమ్మాయి పేరు కస్తూరి. యెక్కడో ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగం చేస్తోంది.

తరచుగా కాంతారావు తన ప్రియురాలిని కలుసుకుంటూనే వున్నాడు. యెప్పుడయినా బిజీగా వుండి కస్తూరిని కలుసుకోలేకపోతే అతనికి పిచ్చెక్కినట్టుగా వుంటుంది.

క్రితం రోజు అతనికి కస్తూరిని కలుసుకోటం కుదర లేదు. అందుకే కాంతారావు ఇప్పుడు ఆమెను కలుసు కోటానికి బయల్దేరాడు.

అతని చేతిలో సిగరెట్టు చివరివరకూ కాలిపోయింది. దాన్ని దూరంగా విసిరాడు.

కాంతారావు కళ్ళముందు కస్తూరి రూపం కదులు తోంది. త్వరగా వెళ్ళి ఆమెను కలుసుకోవాలని నడక వేగాన్ని పెంచాడు.

• • •

తలుపులు మూసి వున్నాయి.

బెడ్ మీద పడుకొని వుంది కస్తూరి. వెల్లకింతలా పడుకోవటంవల్ల పైన తిరుగుతున్న ఫ్యాను గాలికి ఆమె పమిట చెదిరిపోయింది.

ఐనా ఆమె ఆ విషయాన్ని తెలిసి కూడా అలాగే పడుకొని వుంది. కస్తూరి ఆలోచనలన్నీ కాంతారావు మీదే

వున్నాయి.

ఎందువల్లనో ఆమెకు ఆ సమయంలో భరించలేని విరహవేదనగా వుంది. కాంతారావు అందమైన రూపం కళ్ళముందు కదులుతోంది. ఆమె తలకింద వున్న దిండును తీసి గుండెలమీద వేసుకున్నది.

సరిగ్గా అప్పుడే తలుపులమీద గట్టిగా చప్పుడయింది.

ఉలిక్కిపడింది కస్తూరి.

ఎవరు?

ఎవరై వుంటారు? కాంతారావు కాదు. అతనైతే అలా చప్పుడు చెయ్యడు. చిన్నగా వేలితో కొడతాడు. అది అతడి అలవాటు.

లేచి నిల్చుంది.

తలుపులమీద చప్పుడు అవుతూనే వుంది.

"ఎవరు?" అన్నది.

"త్వరగా తలుపు తియ్యండి."

గబగబా వెళ్ళి తలుపులు తెరిచింది.

ఎదురుగా—ఎవరో ఓ మనిషి నిలుచుని వున్నాడు. ఓ మాదిరి లావుగా వున్నాడు.

"మీరు కస్తూరిగారేనా?" గౌరవంగా అడిగాడు.

"అవును. ఎందుకు?"

"కాంతారావుగారు మీకు తెలుసా?"

"తెలుసు....ఎందుకు?"

"సారీ....ఆయనకి ఓ అరగంట క్రితం చిన్న యాక్సిడెంటయ్యింది. హాస్పిటల్లో వున్నారు. ఇప్పుడే స్పృహ వచ్చింది. ఆయన మీ పేరు—ఎడ్రసు చెప్పి అక్కడికి తీసుకు రమ్మన్నారు."

భయపడింది కస్తూరి.

"ఇప్పుడెలా వుంది? దెబ్బలు తగిలాయా?"

"ఫర్వాలేదు. అన్నీ తర్వాత మాట్లాడుకోవచ్చు.... ముందు మీరు బయల్దేరండి " తొందర చేశాడు అతను.

ఇక ఆలస్యం చెయ్యదల్చుకోలేదు కస్తూరి.

ఆమె పడుతున్న విరహవేదనంతా కాంతారావుకు ప్రమాదం జరిగిందని తెలియగానే మాయమయిపోయింది.

తాళం పెట్టి గదిలోపలి లైటును తీయకుండానే అతడితో బయటకొచ్చింది. అక్కడ రోడ్డు పక్కనే కారు ఆగివుంది.

అతను డోర్ తెరిచాడు.

కస్తూరి లోపల కూర్చున్నది. వెంటనే ఎంబాసిడర్ కారు స్టార్టయి ముందుకు కదిలింది.

నిముషం గడిచింది.

మెయిన్ రోడ్డుమీదనించి వెళుతోంది కారు. ఐనా బ్యాక్ డోర్స్‌కు నల్లని అద్దాలు పైకి లేవటంవల్ల కస్తూరికి పక్కనించి ఏమీ కనపడటంలేదు.

"ఇంతకీ అతన్ని ఏ హాస్పిటల్లో ఎడ్మిట్ చేశారు? అసలు యాక్సిడెంట్ ఎలా జరిగింది?" అడిగింది కస్తూరి.

ఆ కారు నడుపుతున్న మనిషి కస్తూరి ప్రశ్నలకు జవాబు చెప్పలేదు. చెప్పకుండా ఆమె గమనించకుండా చిన్న బటన్ నొక్కాడు.

వెంటనే కస్తూరి పక్కనించి ఏదో ద్రవం జల్లులాగా వచ్చి ఆమె మొహంమీద పడింది.

ఉక్కిరి బిక్కిరయ్యింది కస్తూరి.

ఆ క్షణంలోనే ఆమెకు అర్థమయ్యింది తను యెంతో సులభంగా మోసపోయిందని.

మై గాడ్ .... యిప్పుడేమిటి చెయ్యటం? కాంతా

రావుకు ఈ విషయం ఎలా తెలుస్తుంది?

భయంతో వణికిపోయింది. ఆ భయంలోనే కస్తూరికి స్పృహపోయింది.

కారు నడుపుతున్న ఆ మనిషి చిన్నగా నవ్వుకొని కారు వేగాన్ని మరింతగా పెంచాడు.

# 3

ఆశ్చర్యపోయాడు కాంతారావు ఇంటికి వేల్లాడుతున్న తాళాన్ని చూడగానే.

కస్తూరి ఈ సమయంలో యెక్కడికి వెళ్ళింది?

కొంచెంసేపు అక్కడే నిలబడిపోయాడు. ఆ టైములో కస్తూరి యెక్కడికీ వెళ్ళదనీ, తనకోసమే ఎదురుమాస్తూ వుంటుందనీ అతనికి తెలుసు.

కాని—అతను అనుకున్న దానికి వ్యతిరేకంగా ఇప్పుడు కస్తూరి ఇంట్లో లేదు.

ఏదయినా అర్జంటు పనిమీద ఎక్కడికైనా బయటకు వెళ్ళి వుంటుందనీ, కొంచెంసేపటి తర్వాత తిరిగివస్తుందనీ అనుకొని అక్కడే వుండిపోయాడు—ఓ సిగరెట్టు వెలిగించి.

ఇరవై నిమిషాలు యెదురుచూసినా కస్తూరి జాడ తెలియలేదు.

అతనికి కస్తూరి మీద కోపం వచ్చింది.

తను ఎంతో ఆశతో—ఆత్రుతతో తనని కలుసుకోటానికి వస్తాడని తెలిసికూడా కస్తూరి యెక్కడికి వెళ్ళింది?

అంత అవసరం యేమొచ్చింది?

ఫ్రెండ్‌తో సినిమాకు వెళ్ళిందా?

వెళ్ళినా ఈ టైముకు తప్పకుండా తిరిగి రావాలి.

మరి ఎందుకు రాలేదు.

జుట్టు పీక్కున్నాడు కాంతారావు. అతను ఇంతకు ముందు యెప్పుడూ కస్తూరిని కలుసుకోవాలని వచ్చి అంత నిరుత్సాహాన్ని ఎదుర్కోలేదు.

ఇక అక్కడ ఆమెకోసం ఎదురుచూడదల్చుకోలేదు. మరో వారం రోజులవరకూ కస్తూరిని కలుసుకోగూడదనే ఓ నిర్ణయాన్ని అక్కడే తీసుకొని కదిలాడు కాంతారావు.

ఆ రోడ్డు చివరకు వచ్చేసరికి అక్కడి కిల్లీకొట్టు తెరిచే వున్నది. అప్పుడప్పుడు అతను అక్కడ సిగరెట్లు తీసుకొంటూ వుంటాడు.

కిల్లీకొట్టు దగ్గరకు నడిచాడు.

కొట్టువాడు కాంతారావును గుర్తించినట్టు చిన్నగా పలకరింపు నవ్వు నవ్వాడు.

ఒక ప్యాకెట్టు గోల్డుఫ్లేక్ సిగరెట్లు తీసుకున్నాడు కాంతారావు. అక్కడే లైటర్‌తో ఓ సిగరెట్టును వెలిగించుకుంటూ ఒక్క నిమిషం ఆలోచించాడు.

కస్తూరి గురించి ఈ కొట్టువాడికి తెలిసే అవకాశం వుంటుందా? ఆమె ఎన్ని గంటలకు ఇంట్లోనించి బయటకు వెళ్ళిందో ఇతను చెప్పగలడా? అని.

చిల్లర అందుకొంటూ "నీకు కస్తూరి తెలుసునా?" అనడిగాడు అతన్ని.

"పేరు తెలియదు సార్. మీరు అప్పుడప్పుడు మాట్లాడే ఆమె గురించేనా మీరు అడుగుతున్నారు" అన్నాడు.

"అవును. ఆమె ఇంట్లోనించి ఈ వైపుగా వెళ్ళటం నువ్వు చూశావా?"

అతను ఎక్కువసేపు ఆలోచించకుండానే· "కొంచెం

సేపటి క్రితం ఆ యువతి నల్లరంగు అంబాసిడర్ కారులో వెళ్ళటం చూశాను సార్ ...."

ఆశ్చర్యపోయాడు కాంతారావు.

"నువ్వు సరిగ్గా చూశావా? ఆమేనంటావా?"

"ఇక్కడ సరిగ్గా వెలుతురు లేదు సార్ .... నా కొట్లో ఈ గుడ్డి దీపం వెలుగుతోంది. ఒక్కసారి తలతిప్పి నా కొట్టువేపు చూసింది. అప్పుడే నేనుకూడా చూశాను."

"ఆ కారులో ఎంతమంది వున్నారు? ఇంకెవరైనా ఉన్నారా?"

"లేరు....ఇంకెవ్వరూ ఉన్నట్టుగా నాకు అనిపించ లేదు. డ్రయివర్ —ఆమె— యిద్దరే ఉన్నట్టున్నారు."

అతనికి థాంక్స్ చెప్పి కొంచెం సేపటి తర్వాత అక్కడినించి బయల్దేరాడు కాంతారావు.

ఇప్పుడు అతని ఆలోచనలు పూర్తిగా మారిపోయాయి. ఇప్పుడతనికి కస్తూరిమీద కోపం పోయి ఆ స్థానంలో సన్నని భయం చోటు చేసుకున్నది.

కస్తూరి ఒంటరిగా కార్లో యెక్కడికి వెళ్ళింది? తనంతట తనుగా వెళ్ళిందా? యెవరైనా బలవంతంగా తీసుకు వెళ్ళారా?

అలా అయివుండదు. బలవంతంగా తీసుకువెళుతుంటే కస్తూరి వూరుకోదు. కేకలు పెడుతుంది. గొడవచేస్తుంది. కాని కస్తూరి మామూలుగానే వెళ్ళిందని కిళ్ళీకొట్టు మనిషి చెప్పాడు.

అంటే కస్తూరి ఇష్టపడే కార్లో వెళ్ళి వుంటుంది.

ఎందుకు వెళ్ళింది?

అతను నడుస్తూనే తీవ్రంగా ఆలోచించాడు.

తల నొప్పికూడా వచ్చింది.

ఇంటి దగ్గరకు వచ్చారు.

ఇప్పుడు తనేం చేయ్యాలి?

తన గదిలో బెడ్ మీద పడుకొని చాలా సేపటివరకూ ఆలోచిస్తూ చివరకు ఎప్పటికో నిద్రలోకి జారుకున్నాడు కాంతారావు.

## 4

కారు ఆగింది చిన్న కుదుపుతో—ఒక్కసారి ముందుకీ వెనక్కీ వూగింది మనోరమ.

డోర్ తెరిచిన చప్పుడయ్యింది. మళ్ళీ చప్పుడుతో మూసుకుంది.

"దిగు" అన్నాడు జాన్సన్ డోర్ తెరుస్తూ.

కాల్లోనింంచి బయటకు వచ్చింది మనోరమ.

అక్కడంతా నిశ్శబ్దంగా వుంది. అది ఏ ప్రాంతమో ఆమెకు తెలీదు, కళ్ళకు ఆ నల్లటి రిబ్బన్ వుండటంతో—

చల్లని గాలి విసురుగా వీస్తోంది.

ఆమె చెయ్యి పట్టుకున్నాడు జాన్సన్. అతనితో అడుగులు వేస్తూ "ఇది యే ప్రాంతం? యిప్పుడు మనం యెక్కడికి వచ్చాము" అన్నది మనోరమ కొంచెం ధైర్యంచేసి.

జాన్సన్ నవ్వాడు.

నవ్వి "ఇది ఏ ప్రాంతమో-మనం ఎక్కడికి వచ్చామో తెలీకుండా వుండటానికే నీ కళ్ళకు గంతలు కట్టాను. నువ్వింత తెలివితక్కువగా అడుగుతావని అనుకోలేదు" అన్నాడు.

మనోరమ మాట్లాడలేదు.

బరబరమని చప్పుడయ్యింది. తర్వాత తలుపులు తెరుచుకుంటున్న చప్పుడు కూడా అయ్యింది.

జాన్సన్ ఆమెను నడిపిస్తున్నాడు. అతని చెయ్యి మనోరమ చేతిని గట్టిగా పట్టుకున్నది.

మెట్లు ఎక్కారు. యెందుకో అప్రయత్నంగానే ఆ మెట్లను లెక్కపెట్టింది మనోరమ. ఇరవై నాలుగు వున్నాయి. కొంచెం దూరం నడిచిన తర్వాత మళ్ళీ మెట్లు దిగారు. ఈసారికూడా లెక్కపెట్టింది. ఇరవై రెండే వున్నాయి.

తర్వాత ఓ గదిలో ప్రవేశించారు.

ఆ గది బాగా విశాలంగానే వుంది.

అక్కడి చిన్న వేదికలాంటి దానిమీద వున్న రివాల్వింగ్ ఛెయిర్‌లో ఓ వ్యక్తి కూర్చుని వున్నాడు.... అతని చేతిలో ఖరీదైన సిగరెట్టు పొగలు విడుస్తోంది. అతని మొహం తెలీకుండా పులి తలను కట్టుకున్నాడు.

"బాస్... మనోరమ" అన్నాడు జాన్సన్ ఆ వేదికకు కిందగా నిలబడి. దానికి ఒకవైపునే మెట్లు వున్నాయి.

"గుడ్. కళ్ళకు ఆ గంతలు తీసెయ్యి" అన్నాడు బాస్. అతని గొంతు మనోరమకు తమాషాగా అనిపించింది. ఎవరో కావాలని గొంతు మార్చి మాట్లాడుతున్నట్టుగా వుంది.

జాన్సన్ ఆమె కళ్ళకు వున్న నల్లటి రిబ్బన్‌ని వూడదీశాడు.

కళ్ళను చేతో నలుముకుంది మనోరమ.

నిమిషం తర్వాత ఆమెకు ఎదురుగా వేదికమీద వున్న బాస్ కనిపించాడు. కెవ్వున అరవబోయింది అతని పులి తల చూసి.

బాస్ నవ్వి "గుడ్....మంచిదానివి నువ్వు....జాన్సన్ పిలవగానే బుద్ధిగా వచ్చావు. ఇక ముందుకూడా నువ్వు నీ మంచితనాన్ని కాపాడుకుంటావనీ, మేము చెప్పినట్టు

విని బుద్ధిగా నడుచుకుంటావని అనుకుంటున్నాను...."
అన్నాడు.

అతని పళ్ళుకూడా పులికోరల్లాగానే కనిపించాయి మనోరమకు.

"బాస్....మనోరమ నిజంగా మంచి మనిషి. మనం చెప్పినట్టుగా నడుచుకుని సహకరిస్తుందనే నా నమ్మకం" అన్నాడు జాన్సన్.

"వెల్ జాన్సన్. మనోరమను హేపీగా వుంచండి. ఆమె అడిగినవన్నీ సప్లయి చెయ్యండి" అన్నాడు బాస్.

అప్పుడు మనోరమ "నాకేమీ అవసరంలేదు. నా కుమార్‌ను మీరు ఇక్కడ బంధించి వుంచారని జాన్సన్ చెప్పాడు. అతన్ని కలుసుకొని తీసుకువెళ్ళటం కోసమే నేను ఇక్కడికి వచ్చాను. ముందు నాకు కుమార్‌ను చూపించండి" అన్నది.

"అలాగే....నువ్వు తప్పకుండా నీ కుమార్‌ను కలుసుకుంటావు. జాన్సన్ మనోరమను కుమార్ దగ్గరకు తీసుకువెళ్ళు" అన్నాడు బాస్.

జాన్సన్ తల వూపి మనోరమతో ఆ గదిలోనించి బయటకు వచ్చాడు.

ఆమెకంతా ఆశ్చర్యంగా వుంది.

ఏదో సినిమాలో చూస్తున్నట్టుగా వుంది. పులి తల తగిలించుకున్న బాస్. ఆజ్ఞలను పాలిస్తున్న అనుచరులు.

వరండాలో కొంచెం దూరం నడిచారు.

ఒక గది ముందు ఆగిపోయాడు జాన్సన్.

డోర్ పక్కనే వున్న ఎర్రటి బటన్ నొక్కాడు. సరిగ్గా ఒక్క క్షణంలో డోర్ తెరుచుకుంది,

లోపలకు నడిచారు.

అక్కడ యెదురుగానే చిన్న మంచం, దానిమీద పరుపూ వున్నాయి. దానిమీద పడుకొని యేదో నవల చదువుకుంటున్నాడు కుమార్.

డోర్ తెరుచుకోగానే లేచి కూర్చున్నాడు. లోపలకు జాన్సన్తో కనిపిస్తున్న మనోరమను చూడగానే ఆశ్చర్యం-సంతోషం ఒక్కసారిగా కలిగాయి.

జాన్సన్ చేతిలో ప్రత్యక్షమయిన పిస్తోలును చూసి ఆశ్చర్యపడింది మనోరమ. జాన్సన్ అది గమనించి నవ్వి "నా జాగ్రత్తలో నేను ఎప్పుడూ వుంటాను. చిన్న పొరపాటును కూడా బాస్ సహించలేదు" అన్నాడు.

జాన్సన్ అక్కడే వున్నాడన్న విషయాన్ని మరచినట్టు కుమార్ గుండెలమీద వాలిపోయింది మనోరమ.

"సరిగ్గా ఐదునిమిషాల తర్వాత నేను మళ్ళీ ఇక్కడికి వస్తాను. వచ్చి నిన్ను మరో గదికి తీసుకువెళతాను" అని జాన్సన్ అక్కడినించి వెళ్ళిపోయాడు డోర్ మూసి.

జాన్సన్ తనని ఎలా బెదిరించి తీసుకువచ్చాడో చెప్పింది మనోరమ.

తననికూడా స్పృహ తప్పించి తీసుకురావటం గురించి ఆమెతో చెప్పాడు కుమార్.

"ఇంతకీ మనిద్దరినీ ఇక్కడకు ఎందుకు తీసుకువచ్చారో నీకేమైనా తెలిసిందా?" అడిగింది మనోరమ.

"తెలీదు. ఇక్కడ నాకు అన్ని సౌకర్యాలను కల్పించారు. బందీలకు ఇన్ని సౌకర్యాలు కలిగించటం ఇక్కడే చూస్తున్నాను. చాలా క్రయిమ్ నవలల్లో మనుషులను చీకటి గదుల్లో కటిక నేలమీద బందీలుగా వుంచుతారనే చదివాను."

అదోలా నవ్వింది మనోరమ.

"విచారంలో కూడా ఇదో సుఖం అంటావా? నాకేదో భయంగా అంతా సస్పెన్స్‌గా వుంది. ఆడదాన్ని నన్ను బంధించి తీసుకువచ్చారంటే కొంచెం అర్థం వుంది. ఏ దుబాయ్ షేకులకో అమ్ముతారని అనుకోవచ్చు.... కాని మగవాడివి నిన్ను కూడా ఎందుకు తీసుకువచ్చారో ఎంత ఆలోచించినా అర్థం కావటంలేదు. నువ్వా ఆలోచించు" అన్నది.

"ఆలోచిస్తూ బుర్ర పాడుచేసుకోవటం అనవసరం. మనల్ని ఎందుకు తీసుకువచ్చారో తెలిసినా మనం చెయ్యగలిగింది ఏదీలేదు."

కుమార్ ఇలా అంటున్నప్పుడు డోర్ తెరుచుకొని జాన్సన్ లోపలకు వచ్చాడు.

"ఐదు నిమిషాలయ్యింది. సారీ....మీ ఇద్దరినీ విడదీస్తున్నందుకు దిగులు పడకండి. బాస్ చాలా మంచి మనిషి. ప్రేమికులంటే ఆయనకు ఎంతో ఇష్టం. తాత్కాలికంగా విడదీసినా మళ్ళీ కొన్ని గంటల తరబడి కలుసుకునే అవకాశాన్ని ఆయన కలిగిస్తాడు" అని మనోరమను "చూస్తూ నాతో వచ్చెయ్యి....నీ గది వేరే వుంది" అన్నాడు.

అతని చేతిలో పిస్తోలు వున్నది.

బాధగానే కుమార్‌ను వదిలి జాన్సన్‌తో బయటకు వచ్చింది మనోరమ.

డోర్ మూసుకున్నది.

రెండునిముషాల తర్వాత జాన్సన్ ఆమెను ఓ గదిలోకి తీసుకు వెళ్ళాడు.

"ఇది నీ గది. పేరుకే నువ్వు బందీవి. ఇక్కడ నీకు

మీ ఇంట్లో వున్నట్టుగా అన్ని సౌకర్యాలూ వున్నాయి. ఒకవేళ నీకు ఏదైనా అవసరం ఐతే ఇదిగో.... ఈ బ్లూ కలర్ బటన్ నొక్కు....ఎవరో ఒకరు వస్తారు. నీక్కావలసినది తీసుకు వస్తారు" అన్నాడు.

మనోరమ మాట్లాడలేదు. గదినే చూస్తూ వుండిపోయింది.

జాన్సన్ డోర్ దగ్గరకు వెళ్ళిన తర్వాత "ఇక్కడ నువ్వు నిర్భయంగా నిద్రపోవచ్చు....నీ శీలానికి ఎలాంటి ప్రమాదమూ ఉండదు. ఇక్కడ అలాంటి ప్రయత్నం ఎవరు చేసినా బాస్ సహించడు" గుడ్ నైట్ అని వెళ్ళిపోయాడు.

ఆశ్చర్యంలో మునిగిపోయింది మనోరమ.

అప్పుడే చిన్న శబ్దం చేస్తూ డోరు మూసుకున్నది.

## 5

కళ్ళు తెరిచింది కస్తూరి.

పైన సీలింగ్ ఫ్యాను తిరుగుతున్న చప్పుడు వినపడుతోంది. గదిలో దీపం వెలుగుతోన్నది.

ఓ. మెత్తని బెడ్ మీద ఉన్నట్టుగా తెలుసుకున్నది.

ఆమెకు ఆశ్చర్యం కలిగింది.

కారులో తనని కాంతారావుకు యాక్సిడెంటు జరిగిందని మోసగించి స్పృహ పోగొట్టటం వరకు తనకు గుర్తు వున్నది.

ఇప్పుడు తను ఈ గదిలో వున్నది.

తనని ఎవరో తీసుకు వెళ్ళి బంధించబోతున్నారని అనుకున్నది స్పృహ పోయేముందు.

కాని—తను నిజంగా బంధించబడిందా?!

నమ్మకం కలగలేదు.

చీకటి గదిలో బంధిస్తారుగానీ ఇలా అన్ని సౌక ర్యాలూ — వెలుతురూ — మెత్తని పరుపుతో వున్న ఇలాంటి గదిలో బంధిస్తారా?

దాహంగా వున్నట్లనిపించింది.

అప్పుడు పైపైమెంతయ్యిందో కస్తూరికి తెలీలేదు. ఆమె చేతికి వాచీని పెట్టుకోకుండానే ఆ వచ్చిన మనిషితో బయల్దేరింది.

ఆ గదిలో గడియారంలేదు.

టేబుల్ మీద మంచినీళ్ళ కూజా—గాజు గ్లాసు కని పించాయి. లేచి వెళ్ళి రెండు గ్లాసులు చల్లని నీళ్ళు తాగింది.

ఆ తర్వాత డోర్ దగ్గరకు వెళ్ళి దాన్ని తెరిచే ప్రయత్నం చేసింది. కాని సాధ్యం కాలేదు. దాన్ని లోపల్నించి తెరవటం కుదరదని తెలుసుకున్నది.

మళ్ళీ వచ్చి బెడ్ మీద కూర్చుంది.

ఎదురుగా వున్న అద్దాల అల్మారాలో కొన్ని తెలుగు-ఇంగ్లీషు నవలలు కనపడుతున్నాయి.

తనని బంధించారని అనుకోంటే కస్తూరికి నమ్మకం కలగలేదు.

ఆమెకు హఠాత్తుగా కాంతారావు గుర్తుకు వచ్చాడు. అతను తనకోసం గదికి వచ్చి వుంటాడు.

ఇలా ఆలోచిస్తున్నప్పుడు చిన్న చప్పుడుతో ఆ గదికి వున్న తలుపు తెరుచుకున్నది.

ఆమెను తీసుకు వచ్చిన మనిషి లోపలకు వచ్చాడు చిరునవ్వుతో.

"మెలకువ వచ్చిందా? ... ఓసారి చూసిపోదామని వచ్చాను. ఈ గది నీకు అన్నివిధాలా సౌకర్యంగా వుం

టుంది. ఇందులో అన్ని సదుపాయాలూ వున్నాయి. నీకు ఏదయినా అవసరం వస్తే ఇదిగో ఈ బ్లూ కలర్ బటన్ నొక్కు" అని చెప్పాడు.

"నిన్ను చూస్తుంటే మంచివాడిలా వున్నావు. నన్ను మోసగించి ఇక్కడికి ఎందుకు తీసుకు వచ్చావో చెప్ప గలవా?" అన్నది కస్తూరి.

అతను నవ్వాడు.

"చెప్పను. చెబితే మా బాస్‌కు కోపం వస్తుంది. బాస్‌కు కోపం వచ్చిందంటే నాకు ఈ భూమ్మీద నూకలు చెల్లిపోయినట్లే....అందువల్ల నేనే కాదు ఈ సంస్థలో పనిచేసే ఎవ్వరూ అలాంటి పని చెయ్యరు. పదే పదే నువ్వు ఈ విషయం గురించి ఎవరినీ అడక్కు....అది నీ ప్రాణాలకే ప్రమాదం....ఆలోచనలు మానేసి అదిగో టి.వి. ఆన్ చేసి చూస్తూ విశ్రాంతి తీసుకో" అని ఆ గదిలోనించి వెళ్ళిపోయాడు అతను.

తలుపు మళ్ళీ మూసుకున్నది.

టి.వి ఆన్ చేసింది కస్తూరి.

ముందుగా ఏవో ప్రకృతి దృశ్యాలు స్క్రీన్ మీద కదిలాయి, బెడ్ మీద పడుకొని చూస్తోంది.

అలా చూస్తున్నదల్లా ఉలిక్కిపడింది.

స్క్రీన్ మీద ఓ యువతి ప్రత్యక్షమయ్యింది. ఆమె అర్ధ నగ్నంగా వుంది. రెండు నిమిషాల తర్వాత ఓ యువకుడు అక్కడ కనిపించాడు. అతడు ఆమె శరీరం మీద వున్న రెండు పీలికల్లాంటి దుస్తులను లాగేసి ఆమెను గాఢంగా కౌగలించుకున్నాడు.

కళ్ళు తిరిగాయి కస్తూరికి.

అలాంటి దృశ్యాలను ఎప్పుడూ చూళ్ళేదు.

టి.వి.లో ఇలాంటివి వస్తాయా?

అప్పుడు అర్ధమయ్యిందామెకు. వాళ్ళు ప్రత్యేకంగా అలాంటి దృశ్యాలను ప్రసారం చేస్తున్నారు.

టి.వి. ఆఫ్ చేద్దామని అనుకున్నది.

అలా అనుకుంటూనే ఆ నగ్న దృశ్యాలను చూస్తోంది ఆమె.

ఆ దృశ్యాలను చూస్తుంటే ఆమె నరాలు మెలితిరిగి పోయాయి. తన గదిలో పడుకొని కాంతారావు గురించి ఎదురుచూస్తూ తను అనుభవించిన విరహవేదన ఒక్కసారిగా కస్తూరికి గుర్తుకు వచ్చింది.

ఆమె కళ్ళముందు కాంతారావు కదిలాడు.

బోర్లా పడుకొని టి.వి. చూస్తోంది.

కస్తూరి పమిట జారిపోయింది. ఆ విషయాన్ని ఆమె గమనించలేదు. ఆ స్క్రీన్ మీద కాంతారావును తను ఊహించుకుంటూ తన్మయత్వంలో మునిగిపోయింది.

ఆ సమయంలోనే తలుపు తెరుచుకోవటాన్ని ఆమె గుర్తించలేదు. అక్కడ నల్లగా—దున్నపోతులా వున్న ఓ మనిషి ప్రత్యక్షమయ్యాడు.

అతనికి టి.వి. స్క్రీన్ మీది దృశ్యాలూ వాటిని పరవశంతో చూస్తున్న కస్తూరి కనిపించారు. ఆమె గుండెల కేసి చూసేసరికి అతని కళ్ళు మెరిశాయి.

గుటకలు మింగుతూ పిల్లిలా లోపలకు వచ్చాడు. దగ్గరకు వచ్చిన తర్వాతకూడా ఆమె అతడిని చూడలేదు.

అతను వున్నట్టుండి పులిలా ఆమెమీద విరుచుకు పడ్డాడు.

కెవ్వుమని అరిచింది కస్తూరి భయంతో.

అతడ్ని విదిలించింది. అయినా వాడి కబంధ హస్తాల

నించి బయటపడలేకపోయింది.

"రాక్షసుడా.... వదులు...." అన్నది గింజుకుంటూ.

పులినోటికి చిక్కిన లేడిలా పెనుగులాడుతోంది ఆమె.

అతను ఆవేశంతో విజృంభిస్తున్నాడు.

పెద్దగా అరుస్తోంది కస్తూరి.

ఉన్నట్టుండి ధామ్మని రివాల్వర్ పేలింది....మరో సారికూడా పేలింది.

అతను కట్టెలా విరుచుకొని వెనక్కి పడిపోయాడు— మొదలు నరికిన చెట్టులా....

ఆశ్చర్యంగా తలుపుకేసి చూసి కెవ్వుమని అరిచి భయంతో స్పృహ తప్పి పడిపోయింది కస్తూరి.

అక్కడ చేతిలో రివాల్వర్ పులి తలవున్న మనిషి నిలబడి వున్నాడు.

## 6

ఉలిక్కిపడ్డాడు కుమార్. యెక్కడో రెండుసార్లు రివాల్వర్ ధామ్మని పేలిన మోత వినిపించింది.

ఎవరు ఎవర్ని కాల్చారు?

రివాల్వర్ యెక్కడ పేలింది? అతడి గుండెలు దడ దడమని కొట్టుకున్నాయి. అంతా మిస్టరీగా అనిపించింది.

ఏమిటిదంతా? ఇంతవరకు తమని ఇలా బందీలుగా తీసుకువచ్చింది ఎందుకో కొంచెం కూడా అర్థంకావటేదు.

మనోరమని ఒంటరిగా ప్రత్యేకంగా మరో గదిలో వుంచారు. ఆమెకేమీ ప్రమాదం జరగలేదుకదా? మనోరమ ఎలా వున్నదో?

సస్పెన్స్..ఈ సస్పెన్స్‌ను భరించలేకుండా వున్నాను అనుకున్నాడతను.

ఇంతకీ తమని ఏంచేస్తారు? తననీ, మనోరమని తీసుకు

వచ్చినట్టుగా ఇంకెవర్నయినా తీసుకువచ్చారా?

అసలు తమని ప్రాణాలతో వుంచుతారో లేదో తెలీదు. బహుశ ప్రాణాలతో వదలకపోవచ్చు.

చంపుతారేమో....

ఎందుకు?

ఏమో....కారణం తెలీదు....చంపకుండా వదిలితే ఈ మనుషుల గురించి అందరికీ తెలిసిపోదూ? అందుకోసమైనా తమని చంపుతారు....

చావబోయేముందు ఒక్కసారి మనోరమను కలవాలి. మనోరమ ఒడిలోనే చచ్చిపోవాలి.

సరిగ్గా ఆ సమయంలో మనోరమ కూడా రివాల్వర్ ధామ్మంటూ రెండుసార్లు పేలిన చప్పుడును విన్నది. ఒకవేళ కుమార్‌ను కాల్చిపారేశారేమోనని భయపడింది. అతను తప్పించుకోవటానికి ప్రయత్నించాడేమో? ఆమె గుండెల్లో రైళ్ళు పరిగెత్తాయి.

నో....అలా జరగటానికి వీల్లేదు. ఎక్కడో ఎవరో కాల్చి వుంటారు. తన కుమార్‌కు ఏమీ జరిగివుండదు.

కుమార్‌ను కలుసుకోవాలి. అతని గుండెలమీద వాలి పోవాలి. అతనిలో కరిగిపోవాలి. తమని ఈ మర్యాద చూపుతున్న దుర్మార్గులు ప్రాణాలతో వదులుతారన్న నమ్మకం లేదు.

కుమార్‌ను కలుసుకునే అవకాశం కలుగుతుందా?

తన కోరిక తీరుతుందా??

## 7

రాత్రి ఎనిమిది గంటలయ్యింది.

పోలీసు స్టేషన్‌లోకి మరోసారి వెళ్ళి కస్తూరి జాడ ఏదయినా తెలిసిందేమోనని ఇన్‌స్పెక్టర్ ధనంజయ్‌ని

అడిగాడు కాంతారావు.

తెలియలేదని చెప్పాడు యిన్‌స్పెక్టర్ —

కాళ్ళీడ్చుకుంటూ నిస్పృహతో బయటకు వచ్చాడు కాంతారావు.

ఆ రోజు ఉదయమే కస్తూరి తిరిగి రాకపోయేసరికి అనుమానం వేసి పోలీసు స్టేషన్‌కు వచ్చి రిపోర్టు ఇచ్చాడు. ఆమె నల్లటి అంబాసిడర్ కారులో వెళ్ళిన విషయం కూడా చెప్పాడు.

ఎవరో ఆమెను మోసగించి తీసుకు వెళ్ళివుంటారని కూడా చెప్పాడు.

రోడ్డుమీద నడుస్తున్నాడు కాంతారావు-నీరసంగా.

కొంచెం దూరం వెళ్ళేసరికి రోడ్డువారగా నడుస్తున్న కాంతారావు పక్కనే ఓ నల్లరంగు ఎంబాసిడర్ కారు ఆగింది.

ఆ రోడ్డులో అంతగా రద్దీలేదు.

కారులో వున్న జాన్సన్ చిన్నగా కాంతారావును పిలిచాడు.

తల తిప్పి చూశాడు కాంతారావు.

"నీతో మాట్లాడాలి కాంతారావ్ .... కారెక్కు"

అన్నాడు జాన్సన్.

ఆశ్చర్యపోయాడు అతను. తనని పేరుపెట్టి పిలుస్తున్న ఆ మనిషెవరో కాంతారావుకు తెలీదు. అతిన్నెప్పుడూ చూసిన జ్ఞాపకం కూడా లేదు.

"మీరెవరు?" అడిగాడు.

"నేనెవరో నీకు తెలీదు....కాని నీకు కస్తూరి గురించిన ఆచూకీ ఇవ్వగలను."

ఉలిక్కిపడ్డాడు కాంతారావు....అతని మెదడులో

యేదో ఆలోచన కదిలింది ఆ నల్లరంగు ఎంబాసిడర్ కారును చూడగానే.

"నా కస్తూరిని తీసుకు వెళ్ళింది నువ్వేనా?" అడిగాడు.

"ముందు నువ్వు కారెక్కు.... కార్లో వెళుతూ అన్ని విషయాలూ మాట్లాడుకుందాం...." అన్నాడు జాన్సన్.

"నాకు తెలుసు.... నువ్వే కస్తూరిని మోసంతో యెక్కడికో తీసుకెళ్ళి వుంటావు .... చెప్పు .... కస్తూరి ఎక్కడ వుంది?"

"నిన్ను కస్తూరి దగ్గరకు తీసుకెళతాను. నువ్వు అనవసరంగా కంగారుపడకు. కస్తూరి క్షేమంగా వుంది. నిన్ను కూడా తీసుకురమ్మని నన్ను పంపించింది. నువ్వు ఆమెను కలుసుకోవాలంటే ముందు కారెక్కు" అన్నాడు జాన్సన్.

డోర్ తెరుచుకొని వెనుక సీట్లో ఎక్కాడు కాంతారావు.

కారు ముందుకు కదిలింది.

"ఎక్కడ వుంది కస్తూరి?"

"ఇక్కడికి ఆరు మైళ్ళ దూరంలో వున్న ఓ ఊళ్ళో వుంది. అక్కడ ఆమె దూరపు బంధువు ఒకామె వుంది. ఆమెకు రాత్రి హఠాత్తుగా ఏదో జబ్బు ముంచుకు వచ్చింది. అందుకని కస్తూరిని తీసుకురమ్మని కారు పంపిం పంపించింది. కస్తూరి వెళ్ళిపోయింది. తను ఇంకో నాలుగు రోజులు అక్కడే వుంటుందట. నిన్ను తీసుకురమ్మని పంపించింది. నిన్ను గుర్తుపట్టటానికి నీ ఫోటో ఒకటి చూపించింది అందుకే నిన్ను, గుర్తుపట్టగలిగాను" అంటూ జాన్సన్ సిగరెట్ బాక్స్ తీసి ముందువైపు వరుసలో వున్న ఓ సిగరెట్టునుతీసి లైటర్ తో వెలిగించుకున్నాడు.

కాంతారావు గుండె కుదుటపడింది జాన్సన్ చెప్పిన కథ విన్న తర్వాత.

బాక్స్‌లో వెనకవైపు వరుసలోనించి ఓ సిగరెట్టు తీసి డ్రయివ్ చేస్తూనే కాంతారావుకూడా ఇచ్చాడు.

జేబులోనించి తన గాస్ లైటర్ తీసి సిగరెట్టును వెలిగించుకొని గుండెలనిండా పొగపీల్చాడు కాంతారావు.

పొగను బయటకు వదులుతూ జాన్సన్‌తో యేదో మాట్లాడబోయాడు కాని సాధ్యంకాలేదు. అతని కళ్ళు యెవరో బలవంతంగా మూస్తున్నట్టుగా మూసుకు పోయాయి.

సన్నగా యేదో గొణుగుతూ సీటుమీదకు ఒరిగి పోయాడు మత్తుగా—

చిన్నగా నవ్వుకున్నాడు జాన్సన్. అప్పటివరకూ సిటీలోనే అక్కడక్కడే స్లోగా తిప్పుతున్న కారును వేగంగా ముందుకు దూకించాడు యాక్సిలేటర్‌ను గట్టిగా నొక్కుతూ—

నల్లటి ఎంబాసిడర్ కారు వూరి బయటకు దూసుకు పోతోంది.

# 8

డోర్ తెరుచుకుంది. బెడ్ మీద దిగులుగా కూర్చుని వున్న కుమార్ గురించే ఆలోచిస్తున్న మనోరమ వులిక్కిపడి తలెత్తి చూసింది.

లోపలకు వస్తున్న జాన్సన్ కనిపించాడు. అతను చిరునవ్వును చిందిస్తున్నాడు.

"బాస్ మిమ్మల్ని కరుణించాడు. ప్రేమికులిద్దరినీ ఈ రాత్రికి ఒకే గదిలో కలిసి వుండే ఆర్డరు జారీ చేశాడు. అదృష్టవంతులు" అన్నాడు.

"మా అదృష్టం మండినట్టే వుంది. మీకు బందీలుగా వుండి ప్రతి నిముషమూ ఏం జరుగుతుందోనని భయపడి ఛస్తుంటే నీకు జోక్‌గా వుందా?" అన్నది.

"జోక్ కాదు. నిజంగానే మీ అదృష్టాన్ని పొగుడుతున్నాను."

"ఇంతకీ మమ్మల్ని ఏం చెయ్యదల్చుకున్నట్టు మీ బాస్.... చంపుతారు కదూ" అన్నది అతడి కళ్ళలోకి చూస్తూ.

"ఏమో తెలీదు. అంతా బాస్ ఇష్టం. ఆయన మనసులో ఏముందో ఎవరికీ తెలీదు. ముందు నడు....నిన్ను కుమార్ గదికి తీసుకువెళ్ళాలి."

అక్కడినించి జాన్సన్‌తో కలిసి బయటకు వచ్చింది మనోరమ.

రెండు నిమిషాల తర్వాత జాన్సన్ డోరు తెరిచి మనోరమ—కుమార్ గదిలోకి వెళ్ళగానే మళ్ళీ డోర్ మూసి వెళ్ళిపోయాడు.

రివ్వున వెళ్ళి కుమార్ గుండెలమీద వాలిపోయింది మనోరమ. ఆమెకు ఏడుపు వచ్చింది. ప్రేమగా ఆమె వీపుమీద నిమిరాడు కుమార్.

"రాత్రి రివాల్వర్ పేలిన చప్పుడు వినిపించినప్పుడు నీకేదైనా అపాయం జరిగిందేమోనని భయపడిపోయాను" అన్నది ఆమె.

"నేనూ భయపడ్డాను....ఇంతకీ రాత్రి ఎవర్ని ఎవరు కాల్చి వుంటారు" అన్నాడతను.

"ఏమో....అంతా సస్పెన్స్‌గా వుంది. మనల్ని తీసుకొచ్చి బంధించి ఇన్ని గంటలయినా మనల్ని ఎందుకు తీసుకువచ్చిందీ కొంచెం కూడా అర్థంకావటంలేదు" అన్నది

కస్తూరి.

"బహుశ చంపుతారేమో."

"ఎందుకు?"

"ఎందుకైనా కావచ్చు....చంపిన తర్వాత మన అస్థి పంజరాలను విదేశాలకు ఎగుమతి చెయ్యవచ్చు. ఇలాంటి వ్యాపారాన్ని కొంతమంది మనుషులు చేస్తున్నారని— బతికున్న మనుషులను అస్థిపంజరాలకోసం చంపుతారని ఈ మధ్యనే కొన్ని పేపర్లలో చదివాను. బహుశా వీళ్ళు అదే ముఠా మనుషులయి వుంటారు" చెప్పాడు కుమార్.

"అవును....అంతే ఐవుంటుంది. అయితే మనకు చావు తప్పదు ...ఇద్దరం కలిసే చచ్చిపోదాం...." అన్నది మనోరమ దిగులుగా.

"నిజమే....మనకు చావు తప్పదు. చావబోయే ముందయినా మనం యెవ్వరూ విడదీయలేనంతగా కలిసి పోవాలి. ఆఖరి కోరిక తీర్చుకుందాం. మన చావు ముహూర్తం యెప్పుడో మనకు తెలీదు కదా" అంటూ ఆమెను బెడ్ మీదకు లాగి పెదవులమీద గాఢంగా చుంబించాడు.

"లైటు వెలుగుతోంది" అన్నది మనోరమ.

"నువ్వు గమనించలేదేమో ఈ గదిలో లైటు తియ్యటానికీ వెయ్యటానికీ స్విచ్‌లు ఇక్కడ లేవు. బయట ఎక్కడో ఉండివుంటాయి. ఐనా ఈ గదికి కిటికీలు లేవు. ఎవరో చూస్తారనే ప్రశ్న లేదు" అన్నాడతను ఆమె వంటిమీద బట్టలు వలుస్తూ....

కొన్ని క్షణాల్లో ఇద్దరూ నగ్నంగా తయారయ్యారు. ఒకరిలో ఒకరు కలిసిపోయారు.

ఈ లోకం గురించిన ధ్యాసనే మరిచిపోయి ఎక్కడో సుఖాల లోకాల్లో విహరిస్తున్నారు.

కాని—ఆ గదిలో ఒకచోట అమర్చబడిన మూవీ కెమెరా వారిద్దరి సహజ శృంగారాన్ని సజీవంగా చిత్రీకరిస్తోందని వాళ్ళకు తెలీదు.

## 9

కళ్ళు తెరిచేసరికి కాంతారావు — కస్తూరి ఒడిలో పడుకుని వున్నాడు.

ఆశ్చర్యంగా లేచి కూర్చుని "ఇప్పుడు మనం ఎక్కడ వున్నాం" అన్నాడు.

"తెలీదు....కొంతమంది మనుషులకు బందీలుగా వున్నాం" అన్నది కస్తూరి.

కాంతారావుకు ఏడుపు మొహంతో తనని యెలా మోసగించి అక్కడకు తీసుకు వచ్చారో చెప్పినది.

"నన్ను కూడా అలాగే తీసుకువచ్చారు. నువ్వే నన్ను పిలుచుకురమ్మన్నావని చెప్పారు. ఇంతకీ మనల్ని ఎందుకు ఇక్కడకు తీసుకువచ్చినట్లు?" అనడిగాడు.

"అదే తెలీటంలేదు" అంటూ రాత్రి ఓ దున్నపోతు లాంటి మనిషి తనని రేప్ చెయ్యయానికి ప్రయత్నించేస్తే పులి తల వున్న మనిషి వచ్చి వాడ్ని కాల్చి వెయ్యటం గురించి కూడా అతనితో చెప్పింది.

"ఇక్కడ టి.వి.కూడా వుంది. ఈ టి.వి.లో అన్నీ సెక్స్ చిత్రాలే వస్తాయి. బందీలను కూడా ఇంత మర్యాదగా చూడటం యెక్కడయినా వున్నట్టు మనం విన్నామా .... ఇక్కడే చూస్తున్నాం .... ఆశ్చర్యంగా వుంది కదూ" అంటూ వెళ్ళి టి.వి. ఆన్ చేసింది.

స్క్రీన్ మీద ఓ సన్నగా—పొడుగ్గా వున్న యువతి

తన నగ్న సౌందర్యాన్ని ఓ ఓల్డుమాన్ ఎదుట ప్రదర్శిస్తూ కవ్వింపుగా నవ్వుతోంది.

కాంతారావు కూడా ఆసక్తిగా స్క్రీన్ కేసి కొంచెం సేపు చూశాడు. కాని అతని మెదడు బాగానే పని చేస్తోంది.

కస్తూరిని ఎన్నో గంటల క్రితం మోసంతో తీసుకు వచ్చిన మనుషులు ఇప్పటివరకూ ఏమీ చెయ్యకుండా ఎందుకు వుంచారు?

ఆమెను రేప్ చెయ్యటానికి ప్రయత్నించిన మనిషిని ఆ పులి తల మనిషి ఎందుకు కాల్చి చంపాడు? అతనిలో అంతటి మానవత్వం వుందా? వుంటే తమని బంధించి వుంచటం ఎందుకు? ఇంతకీ అతనెవరు? ఈ మనుషు లందరికీ నాయకుడా??

బందీలకు ఇన్ని సౌకర్యాలు కలిగించటం ఎందుకు?

బంధించిన మనుషులనుండి వాళ్ళకు కావలసిన ప్రయోజనం ఏమిటి?

ప్రేమికులను తీసుకొచ్చి, ఒకే గదిలో సెక్స్ చిత్రాలు ప్రసారం చేస్తున్న టి.వి. వున్న గదిలోనే వుంచడం ఎందుకోసం??

కాంతారావు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.... అతని మెదడులో లీలగా ఏదో ఆలోచన కదులుతోంది.

ఆ సమయంలోనే కస్తూరి అన్నది. "వీళ్ళు నన్ను ఇక్కడకు తీసుకు రావటానికి ముందు నేను నిన్నే తల్చుకుంటూ విరహాన్ని అనుభవిస్తున్నాను. రాత్రి టి.వి. స్క్రీన్ మీద బ్లూ ఫిల్ము చూస్తూ కూడా నిన్నే పక్కన వూహించుకున్నాను. ఇక్కడనించి మనం బయటపడ తామో లేదో తెలీదు. ఇప్పుడు ఈ గదిలో మనిద్దరమే

వున్నాం....రా....మరో లోకంలో తేలిపోదాం" అన్నది కస్తూరి అతనిమీద వాలిపోతూ—

కాంతారావు ఆమె ప్రయత్నాన్ని వారిస్తూ—

"నీకు తెలీదు కస్తూరీ ఇదంతా చూస్తుంటే నాకు యేదో అనుమానంగా వుంది. టి.వి. స్క్రీన్ మీద వీళ్ళు ఇలాంటి చిత్రాలను ఎందుకు ప్రదర్శిస్తున్నారు? మనల్ని టెంప్టు చెయ్యటానికి. టెంప్టయినప్పుడు మనం కూడా కంట్రోలు చేసుకోలేక అలాగే చేస్తామనుకోవచ్చు.... మనమలా చేస్తే వాళ్ళకేమిటి ప్రయోజనం?? ఏదో వుంది. అంటే ఈ గదిలో యెక్కడో రహస్యంగా ఓ కెమెరాను ఫిక్స్ చేసి వుంటారు.

కావాలంటే ఈ గది రూఫింగ్ చూడు....చిల్లుల డిజైన్ వున్న అట్టముక్కలతో చేసి వున్నది. నా అనుమానమే నిజమయితే వీళ్ళు ఇంకా కొంతమంది ప్రేమికులను తీసుకువచ్చి ఒక్కో జంటను ఒక్కో గదిలో మనలాగే బందీలుగా వుంచి వుంటారు. వాళ్ళ శృంగారాన్ని సినిమాగా తీస్తూ వుంటారు" అన్నాడు కాంతారావు.

షాక్ కొట్టినట్లు అనిపించింది కస్తూరికి.

కస్తూరికే కాదు, ఆ గదిలో రహస్యంగా అమర్చిన స్పీకర్ల ద్వారా కాంతారావు మాటలు విన్న పులి తల బాస్ కూడా షాక్ కొట్టినట్లయిపోయాడు....

"వీడెవడో అసాధ్యుడిలా వున్నాడు....ఇంతమందిలో ఎవ్వరికీ రాని ఆలోచన వీడికి వచ్చింది. ఇక ఈ జంటతో సహజ శృంగారాన్ని చిత్రీకరించటం జరగని పని...." అని విసుక్కున్నాడు బాస్.

# 10

బల్ల మీది ఫోన్ మోగింది.

రిసీవర్ చేతికి తీసుకొన్నాడు యిన్‌స్పెక్టర్ ధనుంజయ్. "హల్లో.... ఇన్‌స్పెక్టర్ని" అన్నాడు.

అంతే .... క్షణంలో అవతల్నించి మాట్లాడుతున్న గొంతును వినగానే వణికిపోయాడు.

డి.ఐ.జి. ప్రళయ గర్జన చేస్తున్నాడు.

"ఇంతమంది యువతీ యువకులు మాయం అవుతుంటే మీరంతా ఏం చేస్తున్నట్టు? పోలీసు శాఖను ప్రజలు తిడుతున్నారు. నీ స్టేషన్‌లో కంప్లయింట్ ఇచ్చిన కేసు గురించి నువ్వు తీసుకొన్న చర్యలు ఏమిటి? నలభై ఎనిమిది గంటలు టైము ఇస్తున్నాను.... యువతీ యువకులు ఎలా మాయమవుతున్నారో వాళ్ళను ఎవరు ఎత్తుకెళుతున్నారో ఆ ముఠాను పట్టుకోవాలి" అని కొంచెంసేపు తిట్టి ఫోన్ పెట్టేశాడు.

ఇన్‌స్పెక్టర్ ధనుంజయ్ మొహం పాలిపోయింది. అతనికి ప్రేమికులను మాయంచేస్తున్న ముఠా మీద అంతులేని కోపం వచ్చింది. ఆ ముఠాలో ఒక్క మనిషి దొరికినా వాడిని తుపాకీలో వున్న తూటలన్నింటితోనూ కాల్చి చంపాలనుకున్నాడు.

అమ్మాయిలను మాయం చేస్తున్నారంటే అందులో అంతగా ఆశ్చర్యం ఉండేది కాదు. మగవాళ్ళను కూడా ఎందుకు ఎత్తుకు వెళుతున్నారు?

మగవాళ్ళతో యేమిటి ప్రయోజనం?

ప్రేమికులనే ఎందుకు మాయం చెయ్యాలి?

ఇలాంటి యెన్నో సందేహాలు ధనుంజయ్ మెదడులో గిర్రున తిరిగాయి.

కాని — వాటన్నింటికీ కనీసం ఒక్కదానిక్కూడా జవాబు దొరకలేదు.

అప్పటికే మాయమైన మనుషుల తల్లిదండ్రులు పోలీసుస్టేషన్ చుట్టూ ఆందోళనగా తిరిగిపోతున్నారు?

ఐనా ధనుంజయ్ ఏమీ చెయ్యలేకపోయాడు.

అతనూ ఆ ముఠా ఆచూకీ తెలుసుకోటానికి ఎన్నో ప్రయత్నాలు చేస్తున్నాడు.

కాని—అవి ఫలించటం లేదు.

ఎలాగైనాసరే ఆ ముఠాను డి.ఐ.జి. ఇచ్చిన గడువు లోపుగానే పట్టుకోవాలని గట్టిగా అనుకున్నాడు ఇన్‌స్పెక్టర్ ధనుంజయ్.

## 11

"వెల్‌కమ్.... వెల్‌కమ్" అంటూ ఆ వ్యక్తిని సాదరంగా ఆహ్వానించాడు పులి తల బాస్.

నవ్వుతూ వచ్చి బాస్‌తో కరచాలనం చేసి బాస్ చూపించిన కుర్చీలో కూర్చున్నాడు అతను.

అతను—సన్నగా, పొడుగ్గా వున్నాడు. తెల్లగా పాలిపోయినట్టున్న మొహం—డేగ కళ్ళు....పలుచగా వున్న పొట్టి జుట్టు వున్న క్రాపు....ఎక్కువగా సిగరెట్లు కాల్చినందువల్ల అతని పెదవులు నలుపు రంగుకు తిరుగుతున్నాయి.

"నిన్ననే మీరు వస్తారని ఎదురుచూశారు మిస్టర్ ముఖేష్....ఇవిగో....చూడండి" అంటూ పక్కనే వున్న చిన్న సూట్కేసు అందుకొని దాన్ని తెరిచి ముఖేష్‌కు చూపించాడు బాస్ నవ్వుతూ—

"చాలా వున్నాయి .... థాంక్యూ .... ఇందులో ఓ రేప్ సీను ఫిల్ము వున్నదా" అనడిగాడు....ఆ వెట్టె

నిండుగా బ్లూ ఫిల్ములు వున్న రీళ్ళ చుట్టలు వున్నాయి.

"సారీ ముఖేష్....అన్నీ సహజ శృంగారం వున్న ఫిల్ములే. యేమాత్రం బెదురులేకుండా అవకాశం దొరకగానే ప్రేమికులు విచ్చలవిడిగా జరిపిన శృంగారం ఫిల్మ్ చుట్టలే అవి. రేప్ దృశ్యం వున్న ఫిల్మ్ కావాలంటే నేను రేపు మీకు ఇవ్వగలను" అన్నాడు బాస్.

"రేపు తప్పకుండా యివ్వండి. రేప్ సీన్లు వున్న ఫిల్ములకు కూడా మంచి డిమాండ్ వుంది. చాలామంది అడుగుతున్నారు."

"అలాగే....తప్పకుండా రేపు ఇస్తాను. ఈ రోజునే షూట్ చేయిస్తాను...." అంటూ నవ్వుతూ ముఖేష్ ఇచ్చిన సూట్కేసును అందుకొని తెరిచి చూశాడు.

దాన్నిండా కరెన్సీ నోట్లకట్టలు వున్నాయి.

"థాంక్ యూ....మన మధ్య వ్యాపారం ఎల్లప్పుడూ ఇలాగే సాగుతూ వుండాలని కోరుకుంటున్నాను" అన్నాడు బాస్.

"ఐ విష్ ది సేమ్" అన్నాడు ముఖేష్.

తర్వాత వాళ్ళిద్దరూ సంతోషంగా డ్రింక్ చెయ్యటం మొదలు పెట్టారు.

## 12

చేతులు వెనక్కి వుంచుకొని గదిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు కాంతారావు. తెల్లవారగానే అతడిని తీసుకువచ్చి ప్రత్యేకంగా మరో గదిలో వుంచి వెళ్ళిపోయారు.

తమ సామ్రాజ్యంలోకి ఒకసారి అడుగుపెట్టిన ఏ మనిషినీ ప్రాణాలతో బయటకు పోనివ్వరనే నిర్ణయానికి వచ్చేశాడు అతను.

అందుకే అక్కడినించి ఎలాగైనా తప్పించుకొని పారిపోయి ఆ సావరం గురించి ముఠా గురించి పోలీసులకు తెలియజెయ్యాలనే ఆలోచనలో వున్నాడు.

కాని ఆ గదిలోనించి బయటపడి తప్పించుకోవటం ఎలా?

ఎలా సాధ్యమవుతుంది??

డోరు తెరవటానికి బయటనే వుంది బటన్.

లోపల ఏమీ లేదు.

తలుపు తెరుచుకొని బయటకు వెళ్ళినా ఇంతమందిని తప్పించుకొని తను రోడ్డుమీదకు వెళ్ళగలడా?

ఏమో! ఎలాగైనా చావు తప్పదు.

చచ్చేముందు ఆఖరి ప్రయత్నం ఒకటి చెయ్యాలి.

మంచి ఆలోచన రావటంకోసం నుదుటిమీద కొట్టుకున్నాడు చిన్నగా.

రెండు నిమిషాల తర్వాత అతనికో విషయం గుర్తుకు వచ్చింది.

ఏదయినా అవసరం ఐతే బ్లూ బటన్ నొక్కమని చెప్పారు. కాబట్టి ఇప్పుడు తను ఆ బ్లూ కలర్ బటన్‌తోనే బయటపడే ప్రయత్నం మొదలుపెట్టాలని అనుకున్నాడు.

అలా అనుకోగానే గోడకు వున్న బ్లూ కలర్ బటన్‌ని మూడుసార్లు నొక్కాడు.

నొక్కేసి బెడ్‌మీద ఓ నవలను చేత్తో పట్టుకొని చదువుతున్నవాడిలా కూర్చున్నాడు,

రెండు నిమిషాలు గడిచాయి. చిన్న చప్పుడు చేసుకుంటూ డోర్ తెరుచుకుంది. ఓ మనిషి లోపలకు వచ్చి "ఏం కావాలి?" అనడిగాడు.

"సిగరెట్లు ఐపోయాయి. గంటనించీ సిగరెట్టు తాగక పిచ్చెక్కినట్లుగా వుంది. త్వరగా తీసుకురా. వెళ్ళు" అన్నాడు కాంతారావు.

ఆ మనిషి నిజమే అనుకొని వెనక్కి తిరిగాడు.

అంతే—కాంతారావు ఆ మనిషిమీదకుచిరుత పులిలా యెగిరిదూకి గొంతును గట్టిగా పట్టుకొని గోడవైపుకు నెట్టుకుపోయాడు.

ఆ మనిషి కొంచెం సన్నగానే వున్నాడు. కాంతారావుకంటే అతని బలం తక్కువే. అంతే కాకుండా కాంతారావులో తెగించిన చావు బలం వుంది.

ఒక్క నిమిషంలోనే ఆ మనిషి స్పృహ తప్పి తల పక్కకు వాల్చేశాడు....

అతడ్ని గదిలో ఓ మూలకు లాగి వేగంగా బయటకు వచ్చి బటన్ నొక్కాడు. వెంటనే డోరు మూసుకు పోయింది.

ఆ గది ఎదురుగానే సన్నటి వరండాలాంటిది వుంది. దానికి రెండువైపులా వరుసగా గదులు వున్నాయి. వాటి తలుపులు మూసి వున్నాయి.

పరుగులాంటి నడకతో వెళ్ళి ఆ వరండా మలుపు తిరగబోయి ఉలిక్కిపడ్డాడు కాంతారావు.

ఎదురునించి జాన్సన్ వస్తున్నాడు.

అతడ్ని చూడగానే వెనక్కి తిరిగి పరుగుతీయ బోయాడు.

"ఆగు....ఆగు...." అంటూనే జేబులోనించి పిస్తోలు తీసి పేల్చాడు జాన్సన్.

ఆగిపోయాడు కాంతారావు. గుండు అతని చెవి పక్క నించి దూసుకు వెళ్ళిపోయింది.

పిస్తోలు పేలిన మోతవిని నలుగురు అనుచరులు పరిగెత్తుని వచ్చారు.

"ఇతను తప్పించుకొని పారిపోబోతూ పట్టుబడి పోయాడని బాస్‌కు తెలియజేయండి" అన్నాడు జాన్సన్ ఒకడితో.

అతను వెళ్ళిపోయాడు.

మూడు నిమిషాల తర్వాత పులి తల బాస్ వచ్చాడు.

వస్తూనే ఈడ్చి కాంతారావు చెంపమీద బలంగా కొట్టాడు.

"డర్టీ బ్రూట్ ... మా స్థావరంలో అడుగు పెట్టిన మనిషి అడుగు బయటకు వెయ్యలేడు. తెలుసుకో" అన్నాడు కోపంగా.

బాస్ కేసి ఆశ్చర్యంగా చూశాడు కాంతారావు.

మొహానికి తగిలించుకొన్న ఆ పులి తల బొమ్మను తీసేస్తే అతడిని ఎక్కడో రెండుమూడుసార్లు చూసినట్లు అనిపించింది.

ఎక్కడో గుర్తుతెచ్చుకో నే ప్రయత్నం చేస్తున్నాడు. ముఖ్యంగా ఆ పర్సనాలిటీ, నడకతీరు, కావాలని గొంతు మార్చి మాట్లాడుతున్నట్టుగా అనిపిస్తోంది.

"పీడ్ని పనిష్‌మెంట్ సెల్‌కు తీసుకురండి" అంటూ ముందుకు వెళ్ళాడు బాస్.

వాళ్ళు కాంతారావును అక్కడినించి ఓ చిన్న గుహలాంటి గదిలోకి తీసుకువెళ్ళారు. ఆ గదిలో పైకప్పునించి గొలుసులు వేల్లాడుతున్నాయి.

కాంతారావు చేతులను పైకి ఎత్తి ఆ గొలుసులతో కట్టేశారు.

అప్పుడు బాస్ నల్లటి కొరడా తీసుకువచ్చి దానితో

కాంతారావు శరీరంమీద ఛెళ్ళుమనిపించాడు.

బాధతో అరిచాడు కాంతారావు.

బాస్ వికృతంగా నవ్వి "ఇడియట్.. నువ్వే తెలివి గలవాడి ననుకుంటూవా? శృంగారం జరుపుకోమని మీ యిద్దరినీ ఒకే గదిలో వుంచితే మా ప్లాను యేమిటో ఊహించి దానికి దూరంగా పడుకుంటావా తెల్లవారే వరకూ. అందుకు తగిన ఫలితం ఇదే.... కొరడా దెబ్బలు" అంటూ పిచ్చిపట్టినవాడిలా కసిగా కాంతారావును కొరడాతో కొట్టాడు బాస్.

కొడుతున్నంతసేపూ కాంతారావు బాధతో ఆర్త నాదాలు చేస్తూనే వున్నాడు. అతడి బట్టలు చిరిగి పోయాయి. ఒంటినిండా ఎర్రగా వాతలు తేలాయి.

బాస్‌కు చెయ్యి నొప్పి అనిపించి, "వీడ్ని కూడా మన రేప్ షూటింగ్ హాలులోకి తీసుకువచ్చి కట్టెయ్యండి. వీడి కళ్ళముందే ఆ కస్తూరిని రేప్ చేయిస్తూ ఫిల్మ్ తయారు చెయ్యాలి" అని అక్కడినించి వెళ్ళిపోయాడు బాస్.

అంత బాధలోనే అదిరిపడ్డాడు కాంతారావు ఆ మాటలు విని.

## 13

టాక్సీలోనించి దిగాడు ముఖేష్ సూట్కేసుతో __

నిమిషం తర్వాత టాక్సీ వెళ్ళిపోయింది. అతను ఒక్క సారి అటూ ఇటూ చూసి రోడ్డు క్రాసు చెయ్య బోయాడు.

రోడ్డు మధ్యలోకి రాగానే రివ్వున దూసుకువచ్చిన ఓ ప్లిమత్ కారు ముఖేష్ సూట్కేసు పట్టుకొన్న చేతిని రాసుకుంటూ వెళ్ళిపోయింది.

ఆ విసురుకు అతను వెల్లకిలా పడిపోయాడు. అతని చేతిలోని సూట్ కేసు యెగిరి కొంచెం దూరంలోపడి ఓపెన్ అయ్యింది.

అందులో వున్న బ్లూ ఫిల్మ్ చుట్టలు చెల్లాచెదురుగా దొర్లుకుంటూ పోయాయి.

అప్పుడే మోటారుసైకిలుమీద వస్తున్న ఇన్ స్పెక్టర్ ధనుంజయ్ ఈ దృశ్యాన్ని చూశాడు.

అప్పటికే అక్కడ నలుగురు కానిస్టేబుళ్ళు ప్రత్యక్షమయ్యారు.

కిందపడిన ముఖేష్ షాక్ నించి ఇంకా తేరుకోలేదు. మోటారుసైకిలు ఆపి దన దగ్గరకు దొర్లుకుంటూ వచ్చిన ఓ ఫిల్మ్ చుట్టనుతీసుకొని కొంత ఫిల్మ్ నుతీసి ఎండకు ఎదురుగా వుంచి చూశాడు ధనుంజయ్.

అదిరిపడ్డాడు.

అందులో మాయమైపోయారని కంప్లయింట్ ఇవ్వబడిన యువతీ యువకులు న్యూడ్ గా వున్నారు శృంగార క్రీడలో.

ఒక్క క్షణంలోనే ఇన్ స్పెక్టర్ కి అంతా అర్థమయ్యింది.

షాక్ నించి తేరుకొన్న ముఖేష్ పోలీసులను చూడగానే అక్కడినించి పరుగుదీయటానికి ప్రయత్నం చేశాడు. కాని ఇన్ స్పెక్టర్ ధనుంజయ్ ఇనుప చేతులనించి తప్పించుకోలేకపోయాడు.

క్షణాలమీద ఆ బ్లూ ఫిల్మ్ చుట్టలతోపాటు ముఖేష్ నుకూడా స్టేషన్ కు తీసుకువెళ్ళాడు ధనుంజయ్.

* * *

రేవ్ షూటింగ్ హాలులో కస్తూరి పరుగులుతీస్తోంది.

ఆమె వెనుక ముగ్గురు ఎనుబోతుల్లాంటి మనుషులు పరిగెత్తుతూ ఆమె చీరపట్టుకొని లాగుతున్నారు.

కస్తూరి పడిపోయింది. లేవటానికి ప్రయత్నించగానే ఒకడు ఆమె కాలు పట్టుకొని లాగాడు.

మోకాళ్ళవరకు చెదిరిపోయింది చీర.

ఆమె తెల్లటి పిక్కలమీద కసిగా కొరికాడు ఒకడు. బాధతో అరిచింది కస్తూరి.

బూతులు తిడుతున్నాడు కాంతారావు ఆ ఘోర దృశ్యాన్ని చూడలేక. తన కళ్ళముందే తను ఎంతో గాఢంగా ప్రేమించిన కస్తూరిని వేటాడుతున్నట్టుగా వెంటపడి ముగ్గురు మనుషులు రేప్ చెయ్యటాన్ని అతను చూడలేక పెద్దగా అరుస్తున్నాడు బాస్‌ని అందరినీ తిడుతూ.

ఐనా బాస్ కాంతారావు అరుపులను పట్టించుకోవటం లేదు.

ఆ ముగ్గురినీ ఉత్సాహపరుస్తున్నాడు.

వాళ్ళకు ఎలా చెయ్యవలసిందీ డైరెక్టు చేస్తున్నాడు.

రెండు మూవీ కెమెరాలతో దాన్ని చిత్రీకరిస్తున్నారు ఇద్దరు మనుషులు.

కస్తూరి మళ్ళీ పైకి లేచి పరుగెత్తటానికి ఒక్కసారి అవకాశమిచ్చారు.

కస్తూరి లేచి మళ్ళీ పరుగుదీసింది ఏడుస్తూ—

ఆ ముగ్గురూ తోడేళ్ళలా వెంటపడి మళ్ళీ ఆమెను పట్టుకున్నారు. ఒకడు ఆమె జాకెట్టుమీద చెయ్యివేసి బలంగా లాగాడు.... చేతివరకు జాకెట్టు చిరిగి వాడి చేతిలోకి వచ్చింది. పెద్దగా నవ్వాడు వాడు.

ఇంకోడు వెనుకనించి ఆమెను గట్టిగా పట్టుకున్నాడు.

మూడో వాడు ఆమె బుగ్గలను పళ్ళతో పట్టి గట్టిగా లాగాడు.

బాధతో కెవ్వున అరిచింది కస్తూరి.

తుపుక్కున వాడి మొహంమీద వుమ్మేసింది

అదిరిపోయేడు వాడు.

ఉన్నట్టుండి తుపాకులు పేలిన చప్పుడు వినిపించి బాస్‌తో అంతా వెనక్కు తిరిగి చూసి భయంతో వణికి పోయారు.

చుట్టూ ఇన్‌స్పెక్టర్ ధనుంజయ్‌తో పాటు యాభై మంది పోలీసులు తుపాకులతో సిద్ధంగా వున్నారు ఫైర్ ఓపెన్ చెయ్యటానికి.

ఇన్‌స్పెక్టర్ పక్కనే చేతిలో బేడీలతో తలవంచు కుని నిలబడి వున్న ముఖేష్‌ను చూడగానే తన స్థావరం గురించి పోలీసులకు యెలా తెలిసిపోయి వుంటుందో గ్రహించాడు బాస్.

తప్పించుకోవటం సాధ్యంకాదని అలాంటి ప్రయత్నం చెయ్యలేదు.

ఏడుస్తూ వచ్చి కాంతారావు గుండెలమీద వాలి పోయింది కస్తూరి అతని చేతిగొలుసులు విప్పదీసి.

ఆమెను ఓదార్చాడు అతను.

సమయానికి ఇన్‌స్పెక్టర్ ధనుంజయ్ పోలీసులతో ఆ స్థావరాన్ని తెలుసుకుని ఎలా రాగలిగాడో అతనికి అర్థంకాలేదు.

ధనుంజయ్ బాస్ దగ్గరకు వచ్చి మొహానికి వున్న ఆ పులి తల బొమ్మను వూడపీకి "నువ్వా!" అన్నాడు ఆశ్చర్యంగా నమ్మలేనట్టు.

క్షణం తర్వాత శక్తికొద్దీ పిడికిలితో బాస్ మొహం

మీద కొట్టాడు.

ఎగిరిపడ్డాడు బాస్ కీచుమని అరుస్తూ—

"వీడు జనప్రియ ఫోటో స్టుడియో ప్రొప్రయిటర్ అనంత్ ఇన్‌స్పెక్టర్ గారూ" అన్నాడు కాంతారావు.

"అవును. నాకు తెలుసు .... స్టుడియోలో వుండి ఫోటోలు తీయించుకోటానికి వచ్చే వాళ్ళలో ఎవరెవరు ప్రేమికులో తెలుసుకుని, వాళ్ళని తెచ్చి వాళ్ళతో వాళ్ళకు తెలీకుండానే బ్లూ ఫిల్ములుతీసి బిజినెస్ చేస్తున్నాడు...." అంటూ కోపంతో బాస్‌ను పిడికిలితోనే దొరికిన చోటునల్లా పొడిచాడు కనికొద్దీ.

అప్పటికే కొంతమంది వెళ్ళి అన్ని సౌకర్యాలూ వున్న గదుల్లో బందీలుగా వున్న యువతీ యువకులందరినీ విడిపించుకువచ్చారు.

వాళ్ళందరికీ తను ఆ స్థావరాన్ని ఎలా తెలుసుకున్నదీ చెప్పాడు ఇన్‌స్పెక్టర్.

అంతా తెలుసుకున్న తర్వాత ఆ ప్రేమికులంతా "సార్ ....ఇక మేము ఈ బందిఖానానించి ప్రాణాలతో బయటపడమనుకుని గదుల్లో స్క్రీన్ మీద చూపించిన బ్లూ ఫిల్ములను చూసి ఉద్రేకపడి ఆ కెమెరాలకు దొరికిపోయాం. మీరు దయచేసి మా శృంగారం నిండివున్న ఆ ఫిల్ము లన్నింటినీ తగలబెట్టించండి" అన్నారు.

"తప్పకుండా. ఇకనించయినా మీరు జాగ్రత్తగా వుండండి. సంఘంలో ఇలాంటి పులి తలలు తగిలించుకుని నక్కల్లా గోతులు తవ్వే వెధవలే ఎక్కువమంది వుంటారు ఈ నక్కల ఆట కట్టించాలంటే మీరు నిజమైన పులులు కావాలి" అన్నాడు ధనుంజయ్ కేవలం పది

గంటలలోపుగానే ఆ ముఠాను పట్టుకోగలిగాననే సంతోషంకొద్దీ.

అంతా కదిలారు.

“థాంక్ గాడ్....మళ్ళీ మనం ప్రాణాలతో బయట పడతామని అనుకోలేదు” అంటోన్నది మనోరమ. ఆమె పాదాలకిందవున్న పులితల బొమ్మను గట్టిగా తొక్కుతూ.

అలాంటి ఎన్నో పాదాలు ఆ పులి తల బొమ్మమీద నించి కసిగా నడుచుకుంటూ వెళ్ళాయి.

ఇప్పుడు ఆ పులితల బొమ్మ పగిలి ముక్కలై పోయింది. దానికి పులి తల పోలికలే లేవు.

—:అ యి పో యిం ది:—

# అత్తా-కోడలు

పి. అరుణ

నాకిలాంటి మొగుడు కావాలి—అని గిరిజ ఎప్పుడూ తండ్రితో చెప్పలేదు. అలాగని తల్లితో కూడా చెప్పలేదు. ఆ ఇద్దరికీ చెప్పకపోయినా తమ కూతురుకు యెలాంటి మొగుడు అవసరమో వాళ్ళకు బాగా తెలుసు.

అందుకే గిరిజ తండ్రి జనార్దనం తన కూతురు కోరుకొనే' క్వాలటీస్ వున్న మొగుడికోసమే వేట మొదలు పెట్టాడు.

గిరిజ పూర్తిగా తండ్రి పోలిక. ఆమె పుట్టగానే చూసి తన పోలికలు రానందుకు బాధపడింది గిరిజ తల్లి జానకమ్మ. కాని వయసు పెరిగేకొద్దీ తన బుద్ధులు రావటం చూసి ఆమె ఆ బాధను పోగొట్టుకుంది. గిరిజ పూర్తిగా తననే అనుసరించటం చూసి సంతోషపడింది.

జనార్దనం కూతురుకు తన పోలికలు వచ్చినందుకు ఆనందపడ్డాడుకాని తన గుణాలు రాకుండా భార్య బుద్ధులు వచ్చినందుకు మనసులోనే విచారపడ్డాడు. తన

లాగే మరో మగాడు కూడా కొన్నాళ్ళు కష్టాలు అనుభ
వించక తప్పదనుకున్నాడు.

జానకమ్మను చేసుకున్న తర్వాత జనార్దనానికి కొన్నాళ్ళు జీవితం చీకటిగానే అనిపించింది. ఆమె జనార్దనం మాటను లెక్కచెయ్యలేదు. తను చెప్పినట్లే వినాలనేది. వినకపోతే యే నుయ్యో గొయ్యో చూసు కుంటానని బెదిరించేది. పూర్తిగా ఇంట్లో అన్ని విష యాల్లో ఆమెదే పై చెయ్యి. ఇందుకు జనార్దనం ఒప్పు కోలేదు. ఆయన అమ్మా నాన్నా కూడా ఒప్పుకోలేదు. అందుకే మొగుడ్ని తన చావుతో భయపెట్టి వేరు కాపురం పెట్టించింది. చివరకు జనార్దనం మారిపోక తప్పలేదు. పేరుకే మగాడుగా మిగిలిపోయాడు.

ఆయన ఇంట్లో పిల్లి. బయట కూడా పిల్లే. భార్య చేతిలో బొమ్మ అనే పేరు ఆయిన బంధువుల్లో, స్నేహి తుల్లో పూర్తిగా స్థిరపడిపోయింది.

ఇప్పుడు ఆ ఇంటికి రాబోయే అల్లుడు కూడా అలాంటి పేరునే తెచ్చుకుంటాడని జనార్దనానికి తెలుసు. మగ వాడికి మరో మగవాడు అలాంటి పేరు తెచ్చుకో టాన్ని సహించలేకపోయినా తన కూతురు మన స్తత్వాన్ని దృష్టిలో వుంచుకుని ఆమె సుఖపడటానికి అలాంటి మనిషినే తన కూతురుకు మొగుడిగా తీసుకురావాలని అనుకున్నాడు.

గిరిజ బియ్యేవరకు చదువుకుంది. చదువులో ఆమెకు ఎప్పుడూ ఇంట్రస్టులేదు. చాలా యాంత్రికంగా చదు వుతూ వుండేది. చదువుకునే రోజుల్లో కూడా గిరిజ మనస్తత్వం చాలా క్లియర్‌గా అందరికీ అంతుబట్టేది. చాలామంది అమ్మాయిలకు గిరిజే నాయకత్వం వహించేది.

తను చెప్పినట్టుగానే మిగిలిన వాళ్ళంతా వినాలని పట్టు బడుతూ వుండేది.

ఇది పూర్తిగా ఆమె తల్లి జానకమ్మకు వున్న లక్షణమే. మొదట్లో కూతురిలో పెరిగిపోతున్న ఈ డామినేషన్ అనే లక్షణాన్ని పోగొట్టటానికి జనార్దనం తీవ్రంగా ప్రయత్నాలు చేశాడు. కాని జానకమ్మ ఆ ప్రయత్నాలను ఫలించనివ్వలేదు. నా కూతురిలో ప్రబలంగా వున్న నా లక్షణాన్ని పోగొట్టడానికి వీల్లేదని పట్టు బట్టింది. తండ్రి మాటను వినొద్దని కూతురుతో గట్టిగా చెప్పింది.

అందుకే గిరిజ తండ్రి మాటను వినలేదు. ఇక ఆ ప్రయత్నాలను విరమించుకున్నాడు ఆయన.

గిరిజకు రెండు మూడు సంబంధాలు చూశాడు. కాని ఆ సంబంధాల్లో అబ్బాయిలంతా చురుకయిన వాళ్ళు. స్వతంత్రమైన ఆలోచనలు వున్నవాళ్ళుగా కనిపించారు. అందుకే సంబంధాలు మంచివయినా వాళ్ళవల్ల తన కూతురు తప్పకుండా కష్టాలనే అనుభవిస్తుందని వాటిని వదిలేశాడు జనార్దనం.

ఆ తర్వాత ఆయనకు యెవరో ఓ సంబంధాన్ని చెప్పారు. అబ్బాయి పేరు ఈశ్వర్. ఓ ప్రయివేటు కంపెనీలో ఐదేళ్ళనించీ ఉద్యోగం చేస్తున్నాడు. జీతం బాగానే వస్తుంది. సొంత ఇల్లు, కొంత పొలం కూడా వున్నాయి. తండ్రిలేడు. తల్లి వుంది.

జనార్దనం ఆ సంబంధం గురించి తెలియగానే ఆ వూళ్ళో ఈశ్వర్ పనిచేసే కంపెనీకి వెళ్ళి అతన్ని కలుసు కున్నాడు. అతనితో రెండు నిముషాలు మాట్లాడిన తర్వాత తప్పకుండా ఇతనే నా కూతురుకు తగిన మొగుడు

అని అనుకున్నాడు. అలా ఎందుకు అనుకున్నాడంటే తొలిచూపులోనే ఈశ్వర్ బాగా మెలుగా బిడియ పడుతూ కూర్చున్నంటే కూర్చొనే రకంగా అగుపించాడు. మాట్లాడిన తర్వాత ఆ అభిప్రాయం పూర్తిగా సిరపడిపోయింది.

ఈశ్వర్‌ని పెళ్ళిచూపులకు ఆహ్వానించి సంతోషంగా తిరిగివచ్చాడు.

## 2

పెళ్ళిచూపులకు రాబోతున్న ఈశ్వర్ గురించి చెప్పగానే జానకమ్మకు ఆనందం కలిగింది. గిరిజకు కూడా ఆనందమే కలిగింది. తండ్రి తన మనసు తెలుసుకొని అలాంటి మనిషిని పట్టుకున్నందుకు ఆయన్ని తల్లి సమక్షంలో పొగిడింది.

"ఇదంతా నీ అదృష్టం....నువ్వు బాగా సుఖపడే యోగం వుంది" అన్నది తల్లి.

ఆ రాత్రి గిరిజకు నిద్ర పట్టలేదు. ఆమె కళ్ళముందు యిద్దరు అందమైన అబ్బాయిలు గిర గిరా తిరిగారు. అందులో ఒకబ్బాయి పేరు శరత్ బాబు. రెండో అబ్బాయి పేరు సుందరరావు.

ఆ ఇద్దరబ్బాయిలు గిరిజను ప్రేమించామంటూ ఉత్తరాలు రాశారు. తర్వాత ఆమెతో బహిరంగంగానే ఆ విషయాన్ని చెప్పారు. ఆమె అంగీకరిస్తే పెళ్ళి చేసుకుంటామని అన్నారు. ఆ ఇద్దరిలో యెవరో ఒకర్ని యే అమ్మాయైనా చేసుకోటానికి ఇష్టపడేది. కాని గిరిజ ఒప్పుకోలేదు. అందుకు కారణం ఆ ఇద్దరు అబ్బాయిలూ బాగా తెలివైనవారుగా కనిపించారు. అందుకే ఆ ఇద్దర్నీ

తిరస్కరించింది.

ఈశ్వర్, తల్లి మరో ఇద్దరు పక్కింటివాళ్ళతో పెళ్ళి చూపులకు వచ్చాడు. అతణ్ని చూడగానే కొంచెంగా నిరుత్సాహపడింది గిరిజ. అతనంత అందగాడుగా కనపడ లేదు. కాని అతనిలో కనిపించిన మందబుద్ధిని చూసి తెగ సంతోషపడింది. ఒకందుకు అతను తనంత అందంగా లేక పోవటమే మంచిదనుకున్నది. తను అతని కంటె అందంగా వున్నందుకు బాగానే మిడిసిపడవచ్చు ననుకుంది.

కాని కొడుకు పక్కనే కూర్చున్న అతని తల్లిని చూడ గానే ఆమె కొంచెం గట్టి మనిషిగానే అనిపించింది. ఆమె చూపులు మాటలు కూడా తెలివిగానే అనిపిం చాయి. ఈశ్వర్ నోరు మెదపలేదు. పెట్టిన టిఫిన్ని తిని, కాఫీ తాగి వక్కపొడి నములుతూ పక్క చూపులు చూస్తూ కూర్చున్నాడు. కొడుకు బదులు కూడా తల్లే గిరిజను ఏవో కొన్ని ప్రశ్నలు అడిగి జవాబులు రాబట్టు కున్నది. ఆమె అడిగిన ప్రశ్నలన్నింటికీ గిరిజ అణకువగానే బదులు ఇచ్చింది.

గిరిజ తనకు నచ్చిందని ఈశ్వర్ అక్కడే సిగ్గుపడుతూ చెప్పేశాడు. అతని తల్లికూడా తనకాబోయే కోడలు బాగానే వుందనుకున్నది. కాని కాబోయే వియ్యపురాలిదే ఆ ఇంట్లో పై చెయ్యిగా వున్నట్టు కనిపెట్టింది. ఐనా గిరిజ విధేయత చూసి సరిపెట్టుకున్నది.

తర్వాత కట్నకానుకల గురించి మాట్లాడుకుందామని వెళ్ళిపోయారు.

వాళ్ళు అటు వెళ్ళగానే "అబ్బాయి మనకి తగిన వాడు" అన్నది తల్లి భర్తతో.

"అవును. అందుకే మనం ఈ సంబంధాన్ని వదులుకో
గూడదు. కట్నం ఎక్కువ ఇచ్చయినా సరే ఈ సంబం
ధాన్ని ఖాయపరుస్తాను" అన్నాడాయన.

"ఆయన తల్లి అసాధ్యురాలిగా కనబడుతోంది"
అన్నది గిరిజ తల్లి.

"నిజమే. నాకూ అలాగే అనిపించింది. వినా పర్వా
లేదు. ఆమెను నువ్వు వంచుతావనే నమ్మకం నాకు వుంది.
కొడుకుతో పెళ్ళిచూపులకు వచ్చిన ప్రతి తల్లీ అట్లాగే
కనబడుతుంది. కొడుక్కంటే తల్లికి కోడలు పెళ్ళి
చూపుల విషయంలో ఆసక్తి ఎక్కువగా వుంటుంది. ఈ
విషయంలో నువ్వు ఆలోచించకు. నీకు మొగుడు ముఖ్యం.
మొగుడు చెప్పినట్టు వినే మనిషయితే అత్తగారు మనకో
లెక్క కాదు" అన్నది తల్లి.

"అవును....మీ అమ్మ చెప్పిన మాటలు నిజం. ఎంతో
అనుభవం మీద చెబుతున్న మాటలు. యిందుకు నీకు
వేరే ఉదాహరణ అవసరం లేదు...." అన్నాడు జనా
ర్దనం.

"సర్లెండి. నా మాటలు విని మీరేం చెడిపోయారు.
అంతో యింతో బాగుపడ్డారు" అన్నది జానకమ్మ.

'బాగుపడ్డం యేమోగానీ 'భార్య చేతిలో బొమ్మ'
అనే పేరు ఒకటి సంపాదించుకున్నాను' అనుకున్నాడు
లోలోపల.

# 3

గిరిజ పెళ్ళి వైభవంగానే జరిగిపోయింది. పెళ్ళికి
ఆమె స్నేహితులు అంతా వచ్చారు. వచ్చినవాళ్ళంతా
మొగుడి విషయంలో ఆమె లక్కును అభినందించలేక
పోయారు.

'మరీ అంత బుద్ధావతారంగా వున్నాడేమిటి? ఇంతకు మించి ఆంధ్రదేశంలో మగాడే దొరకలేదా?' అనుకున్నారు.

గిరిజకు కొంచెం క్లోజుగా వుండే అమ్మాయి వాళ్ళంతా ఇలా అనుకుంటున్నట్లుగా చెప్పింది.

గిరిజ నవ్వి "ఎవరో యేదో నా మొగుడి గురించి అనుకున్నారని నేను బాధపడను. అందంగా, చురుగ్గా వున్న మొగుడు రేపు నన్ను తన గుప్పిట్లో వుంచుకుని నలిపేస్తుంటే వీళ్ళంతా జాలిపడతారు. నాకు ఆ స్థితి రాకూడదనే నేను ఇలాంటి మొగుడ్ని ఎన్నుకున్నాను. ఎవరేమనుకుంటే నాకేమిటి? భవిష్యత్తులో నా మాటకు వుండే విలువ, నా సుఖం నాకు ముఖ్యం" అన్నది.

కొంతమంది గిరిజ వాదనతో ఏకీభవించారు.

పెళ్ళిలోనే గిరిజకు అత్తగారు నిజంగానే అసాధ్యురాలు అనే అనుమానం బాగానే బలపడిపోయింది. ఈ విషయం గురించే తల్లీ కూతుళ్ళ మధ్య కొంత చర్చ జరిగింది. తల్లి కూతురుకు ధైర్యం చెప్పింది.

"నిజంగా ఇది నీలోవున్న నా లక్షణాలకు ఓ పరీక్ష. నేనుకూడా నీలాగా కాపురానికి వచ్చాను. వచ్చిన తర్వాత మీ నాన్నను నా దారికి తీసుకురావటానికి అత్తగారు ప్రతిబంధకమయ్యింది. ఐనా నేను నిరుత్సాహపడలేదు. ఎన్నో శక్తియుక్తులను ప్రయోగించాను. చివరకు విజయం సాధించాను. ఇప్పుడు నువ్వు కూడా మీ అత్తగారిమీద విజయం సాధించి ఆమెనో చెప్పుకింద తేలుగా మారుస్తావనే నమ్మకం నాకు వుంది. ఈ విషయంలో నువ్వు విజయం సాధించాలని మనసారా కోరుకుంటున్నాను" అని ఇంకొన్ని మంచిమాటలను కూతురుకు చెప్పి

కూతురును అత్తగారింటికి పంపించింది తల్లి.

తల్లి తనమీద వుంచిన కొండంత నమ్మకాన్ని నిజం చేసుకోవాలనే బాధ్యతతో అత్తగారింట అడుగుపెట్టింది గిరిజ. కోడల్ని అత్తగారు సాదరంగానే ఆహ్వానించింది. రెండురోజులు కూతురు దగ్గరే వుండి వియ్యపురాలు చూడకుండా మరోసారి హితబోధ చేసి తిరిగి వెళ్ళిపోయింది జానకమ్మ.

వారం రోజులపాటు ముందు ఆ యింటినీ ఆ యింటి ఆచారవ్యవహారాలనూ క్షుణ్ణంగా, మవునంగా పరిశీలించింది గిరిజ. ఒక అవగాహనకు వచ్చిన తర్వాతనే తను అవసరమయిన కార్యక్రమాన్ని రూపొందించుకోవాలని అనుకున్నది.

## 4

ఆ రోజునించీ తన కార్యక్రమాన్ని మొదలుపెట్టింది గిరిజ.

అందులో భాగంగా ఉదయమే పాలమనిషి దగ్గరే సంస్కరణ మొదలయింది. రోజూ అత్తగారు ఉదయమే పాలు పోయించుకునేది. కాని ఆరోజు పాలమనిషి వచ్చేసరికి గిరిజ సిద్ధంగా వుంది.

గిన్నె తీసుకొని పాలు పోయించుకోటానికి వచ్చిన గిరిజను చూసి పాలుపోసేది ఆశ్చర్యపోయి "అమ్మగారూ యివాళ మీరు వచ్చారేంటి?" అనడిగింది.

"ఇవాళే కాదు....ఇకనించీ పాలు నేనే పోయించుకుంటాను. కోడలు అంటే ఎవరనుకున్నావ్? ఇంటి బాధ్యతలు తీసుకోవలసిన మనిషి. ఇన్నాళ్ళూ ఈ ఇంటి బాధ్యతలతో మా అత్తగారు అలసిపోయింది. ఇహనుంచీ ఆమె హాయిగా విశ్రాంతి తీసుకుంటుంది...." అన్నది

గిరిజ నవ్వుతూనే

ఈ మాటలను అక్కడే గుమ్మం దగ్గర నిలబడిన ఆమె అత్త సుందరమ్మ వింటూనే వుంది. ఎంతో వినయంగా కనపడే కోడలు అలా మాట్లాడుతుందని ఆమె ఏమాత్రం వూహించలేకపోయింది.

ఆమెకు అంతా అర్థమైపోయింది.

పాలమనిషి అర్థశేరు పాలు పోసింది.

"ఇంకో పావుశేరు యెక్కువ పొయ్యి" అన్నది గిరిజ.

"ఎందుకమ్మా....పాయసం చేస్తున్నారా?"

"పాయసం కాదు. ఇకనించీ రోజూ ముప్పావుసేరు పాలుపొయ్యి. అర్థసేరు పాలు చాలడంలేదు. ఇంట్లో నేనో మనిషిని ఇప్పుడు పెరిగాను కదా!"

"అది కాదమ్మా, మీ అత్తగారు..." అంటూ పాలమనిషి ఏదో చెప్పబోయింది. కాని గిరిజ వినిపించుకోకుండా లోపలకు వెళ్ళిపోయింది.

పాలమనిషి సుందరమ్మను ఆశ్చర్యంగా చూసింది. దానికి ఆ యింట్లో సుందరమ్మ హోల్డు పోతోందని తెలిసిపోయింది.

సుందరమ్మకు కూడా ఆ ఇంటి పెత్తనాన్ని కోడలు తనంతట తానుగానే లాక్కుంటున్నదని అర్థమయ్యింది.

ఆ తర్వాత కూరలమ్మేవాడు బండిమీద కూరలు తీసుకు వచ్చి యింటి ముందు ఆగి, పెద్దగా కేకలు పెట్టాడు.

సుందరమ్మ బయటకు వెళ్ళబోయింది కాని ఈలోపలే గిరిజ సంచీ తీసుకుని బయటకు వెళ్ళింది. అలా వెళుతున్న కోడల్ని చూసి సుందరమ్మకు తీవ్రమైన కోపం వచ్చింది.

ఐనా ఏమీ మాట్లాడలేకపోయింది.

కోడలు ఖరీదయిన కూరలు బేరం చెయ్యకుండానే తీసుకుంటుంటే కూరల బండీవాడు ఆశ్చర్యపోయాడు.

రోజూ సుందరమ్మ చౌకగా వున్న ఎండిపోయిన కూరలను గంటసేపు బేరంచేసి కొంటూవుంటుంది.కొంచెం ఖరీదుగా వున్న కూరలను అసలు తీసుకోదు.

కూరలు తీసుకుని బండీవాడి దగ్గర వున్న పద్దు పుస్తకంలో రాసి లోపలకు వచ్చింది.

లోపలకు రాగానే "అంత ఖరీదయిన కూరలు యిప్పుడెందుకు?" అన్నది సుందరమ్మ—గిరిజను.

"వారం రోజులనుంచీ మీరు చౌకగా వున్నాయని కొంటున్న ఒకే రకం కూరలు తిని విసుగు పుట్టింది..." అన్నది.

"అంత ఖరీదైన కూరయి మనలాంటి వాళ్ళు కొనేవి కాదు. ధనవంతులు కొనే కూరలు అవి. మన తాహతు యెంతో తెలుసుకుని మనం ప్రవర్తిస్తే బావుంటుంది" అన్నది సుందరమ్మ.

"మీరు చౌకరకం, నాసిరికం తిండి తింటానికి అలవాటుపడ్డారేమో. నేనలాకాదు. మా ఇంట్లో తాజా కూరలు, తాజా తిండి తినవచ్చును. మీరు పెడుతున్న తిండి తినలేకుండా వున్నాను. ఈ రోజునుంచీ వంట కూడా నేనే చేస్తాను. మీవంట నాకు నచ్చటంలేదు."

"అట్లాగా....ఇది నీ పుట్టిల్లుకాదు. మీ నాన్న నీకు ఖరీదైన తిండిపెడితే నువ్వు అక్కడకు వెళ్ళినప్పుడు అలాంటి తిండే తిను. కాని యిక్కడ నువ్వు అలాంటి తిండి గురించి ఆలోచించకు. నువ్వు ఈ ఇంటి అలవాట్లకు, ఆచారాలకు అలవాటుపడాలి. మీ అమ్మ నీకు ఈ విష

యాలన్నీ చెప్పే వుంటుంది" అన్నది సుందరమ్మ.

"మా అమ్మ నాకు ఒక్కటే చెప్పింది. మీ అత్తగారు ఇన్నాళ్ళూ యింటి బాధ్యతతో అలిసిపోయింది. ఆ బాధ్యతలన్నింటినీ నువ్వు తీసుకొని ఆమెకు విశ్రాంతిని కలగజెయ్యమని చెప్పింది. అందుకు మీరు ఇలాంటి చిన్న చిన్న విషయాలగురించి పట్టించుకోకండి."

కోడలు ఎంత తెలివైనదో సుందరమ్మకు ఆ క్షణంలో అర్థమయ్యింది.

ఎందుకంటే ఆమెకూడా ఇదే కోవకు చెందిన మనిషి. ఆమె కూడా ఆ యింటికి కోడలుగా వచ్చినప్పుడు ఇంటి పెత్తనాన్ని తన అత్తగారి దగ్గర్నించి తన చేతిలోకి తెచ్చుకోటానికి యెన్నో విధాల ప్రయత్నం చేసింది. చివరకు విజయం సాధించింది. ఆ రోజునించీ ఈ రోజు వరకు పెత్తనాన్ని అలా సాగిస్తూనే వుంది.

ఇప్పుడా పెత్తనాన్ని కోడలు తన్నుకుపోవాలని చూస్తుందని తెలియగానే ఆమె కలవరపడింది.

"నీ నాటకాలు నాకు తెలుసు. ఈ ఇంటి బాధ్యతలతో నేను అలసిపోలేదు. నాకు విశ్రాంతి అవసరం లేదు. యిక్కడి అధికారాన్ని నీ గుప్పిట్లోకి తీసుకొని మామీద సవారి చెయ్యాలని చూస్తున్నావు" అన్నది సుందరమ్మ.

"అధికారాన్ని గుప్పిట్లోకి తీసుకోటానికి ఇదేమైనా పెద్ద ఎస్టేటా? లేకపోతే ఓ రాష్ట్ర అధికారమా? ఈ యింట్లో వున్నది ముగ్గురు మనుషులం. అందులో నన్ను మినహాయిస్తే ఇక ఇద్దరి మనుషులమీద నేను అధికారం చెలాయించేది ఏముంది? మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు. దయచేసి అర్థంచేసుకోటానికి ప్రయత్నిం

చండి" అన్నది.

"నువ్వు బాగా నటిస్తున్నావు. నీ నాటకాలు నా దగ్గర పనిచెయ్యవు. నీకు నా గురించి పూర్తిగా తెలీదు. సుందరమ్మ మంచితనానికి ప్రాణం ఇస్తుంది. కోపం తెప్పిస్తే ప్రాణంతీస్తుంది. గుర్తుంచుకో" అని బెదిరించింది.

తేలిగ్గా నవ్వుతున్నది గిరిజ.

"అత్తా ...నువ్వు నిజంగా అసాధ్యురాలివే....నన్నే బెదిరిస్తున్నావా? ఈ గిరిజ—జానకమ్మ కూతురు.... జానకమ్మ హిస్టరీ నీకు తెలీదు. ఈ అధికార మర్దనంలో ఎవరు గెలుస్తారో" అనుకుంది.

## 5

గిరిజ రాత్రి వరకూ ఎల్లాగో ఆగిందికాని సుందరమ్మ ఆగలేకపోయింది. ఈ మధ్యలో నే కొడుకును పెరట్లో బావి దగ్గర నిలబెట్టి కోడలు ఆ ఇంటి అధికారాన్ని తన చేతుల్లోకి లాక్కోటానికి ఏలాంటి ప్రయత్నాలు చేస్తున్నదో వివరించి చెప్పింది.

"అలాగా. నువ్వు కంగారుపడకు. దానికి నేను రాత్రికి చెబుతానులే. అది నా మాట వింటుంది" అన్నాడు ఈశ్వర్.

"అది నీ మాట వింటుందనే నమ్మకం నాకు లేదు. మనం తెలీక గోతిలో పడ్డాం. ఇది కాపురానికి వచ్చి నెల కూడా నిండకుండా ఇట్లాంటి పెత్తనం వ్యవహారాలను మొదలు పెట్టిందంటే ఇంకొన్ని రోజుల్లో నన్ను యింట్లో నించి వెళ్ళగొడుతుంది. అందువల్ల నువ్వు ఈ రాత్రికే దాన్ని బాగా భయపెట్టు" అన్నది కొడుకుతో.

సరేనన్నాడు ఈశ్వర్.

ఈశ్వర్ కి ఇలాంటి అత్తా కోడళ్ళ వ్యవహారంలో తలదూర్చాలంటే తల నొప్పి అనిపించింది. ఇలాంటి గొడవలు అసలు అతనికి ఇష్టం వుండదు. అయినా తల్లి బాధపడుతుందని ఆ రాత్రి తలుపులు మూసి గిరిజ గదిలోకి వచ్చిన తర్వాత మెల్లగా నోరు తెరిచాడు.

"నీకో విషయం చెప్పాలి గిరిజా. నువ్వేమీ అనుకోవుకదా" అని అడిగాడు.

భర్త చెప్పబోయే విషయం ఏమిటో గిరిజకు తెలుసు. అయినా ఏమీ తెలీనట్లు "చెప్పండి" అన్నది.

"నువ్వు బాధపడకూడదు" అన్నాడు.

"బాధపడే విషయాన్ని మీరు నాకు చెబుతారని నేను అనుకోను. నామీద మీకు వుండే ప్రేమ నాకు తెలుసు" అన్నది ముందుగానే.

గిరిజ అలా అనేసరికి ఈశ్వర్ పొంగిపోయాడు. నిజంగా తను భార్యమీద అంత ప్రేమ చూపుతున్నట్టుగా అతనికి తెలీదు.

"ఏమీలేదు. నువ్వు ఈ ఇంటి అధికారాన్ని తన చేతిలోనించే లాక్కోటానికి ప్రయత్నం చేస్తున్నావని అమ్మ బాధపడుతోంది. ఇది నిజమేనా?" అడిగాడు.

"ఓస్ .... ఇంతేనా? ఇంకేమిటో అనుకున్నాను. ఇందులో ఇంటి అధికారం లాక్కోవటం అంటూ ఏమీ లేదు. మీ అమ్మ పోయించుకునే పాలు సరిపోవటంలేదు. అంతేకాదు, ఆమె కొనే కూరలు రోజూ అవే తిని విసుగు పుడుతోంది. అందుకే ఇకనించీ ఎక్కువ పాలు పోయించు కోవాలనుకున్నాను. మంచి కూరలు కొన్నాను. ఇందులో తప్పేమిటి? ఇంటి అధికారమంటే పాలు పోయించు కోవటమేనా? కూరలు కొనటమేనా?" అడిగింది.

"అవును. ఇవేమంత పెద్ద విషయాలు కాదు. ఇంత చిన్న విషయాలకోసం నువ్వే కలిగించుకోవటం ఎందుకు? ఎన్ని పాలు పోయించుకోవాలో అమ్మకి చెప్పు. అలాగే ఏ కూరలు తీసుకోమంటావో ఆమెకు చెప్పు. తీసుకుంటుంది" అన్నాడు.

"అలాగే.... నాకేం అభ్యంతరం లేదు" అన్నది గిరిజ.

తెల్లారిన తర్వాత అన్ని పనులు తల్లినే చెయ్యమని చెప్పాడు ఈశ్వర్. కాని ఆ పనులు చెయ్యబోయే ముందు తన భార్యను అడిగి చెయ్యమన్నాడు.

అందుకు తల్లి ఒప్పుకోలేదు.

"దాన్ని అడగాల్సిన ఖర్మ నాకేం పట్టింది? ఇది నా యిల్లు. నా ఇంటికి కోడలిగా వచ్చి నన్నే ఈ ఇంట్లో బొమ్మను చేసి ఆడించాలని చూస్తోంది. నువ్వే దానికి గట్టిగా చెప్పు. అది చెప్పినట్టుగా ఈ ఇంట్లో యేదీ జరగదు" అన్నది కోపంగా.

ఈశ్వర్ ఇరుకున పడిపోయాడు. గట్టిగా తల్లితో ఏమీ చెప్పలేకపోయాడు. అలాగని భార్యతో కూడా చెప్పలేకపోయాడు.

అతను మొదటినించీ మెతక మనిషే. కాదు. సుందరమ్మ తనకు వున్న ఒకే ఒక్క కొడుకు తను చెప్పిన మాట వినకుండా పోతాడేమోనని అలా మెతకమనిషిగా తయారుచేసింది.

"పోనీ .... నువ్వే సర్దుకుపోరాదూ" అన్నాడు భార్యతో.

"ఇందులో సర్దుకుపోవటానికి యేముంది? ఇన్నేళ్లొచ్చాయి. ఇన్నేళ్ళనించి ఈ ఇంటి పెత్తనం అంతా తానే మోస్తూ వచ్చిందికదా. ఇప్పుడు దాన్ని నాకు వదిలి ఓ

పక్క కూర్చుని చూడటానికి మీ అమ్మకు అంత పట్టుదల ఏమిటి? ఇంటి పెత్తనం అనేది యెప్పుడయినా కోడలుకే చెందుతుంది. కోడలు రావటంతోనే అత్తగారు ఆ పెత్తనాన్ని కోడలుకు ఇచ్చెయ్యాలి. కావాలంటే మీ అమ్మ కాపురానికి వచ్చిన తర్వాత అలా యింటి పెత్తనాన్ని తన అత్తగారి దగ్గర్నించి తీసుకున్నాదో లేదో కనుక్కోండి. మీకే తెలుస్తుంది."

గిరిజ ఇంత విపులంగా చెప్పిన తర్వాత ఈశ్వర్‌కు భార్య మాటల్లో నిజమున్నట్టే అనిపించింది.

ఆ సాయంత్రం మొదటి ఆట సినిమాకు వెళదామన్నది గిరిజ. తెలుగు సినిమాకు పోదామన్నాడు ఈశ్వర్.

"వద్దు. హిందీ సినిమాకు వెళదాం. తెలుగు సినిమాలు చూసి బోర్ కొట్టింది" అన్నది.

"హిందీ సినిమా నాకు అర్థం కాదు."

"నాలుగు సినిమాలు చూస్తే అదే అర్థమవుతుంది. పదండి" అన్నది.

ఈశ్వర్ హిందీ సినిమాకు బయల్దేరాడు.

అతను కుర్చీ టిక్కెట్లు తీసుకోబోతుంటే వద్దని తనే బాల్కనీ టిక్కెట్లు తీసుకున్నది.

"ఎందుకు డబ్బులు దండగ? ఎక్కడ కూర్చున్నా ఆ సినిమాయేగదా చూసేది" అన్నాడు ఈశ్వర్.

"నిజమే. అలాగని నేల క్లాసుకు వెళ్ళి యే చుట్ట కాల్చుకునే మనిషి పక్కనో కూర్చుని సినిమా చూడలేము కదా. ఇది కూడా అంతే. మీ స్నేహితులెవరైనా కనపడినా ఘనంగా వుంటుంది" అన్నది.

అతనేమీ మాట్లాడలేకపోయాడు.

ఇంటర్వెల్ లో కూల్ డ్రింక్స్ వచ్చాయి.

భర్త డ్రింక్ లు తీసుకుంటాడేమోనని ఒక్క నిమిషమే చూసింది. కాని ఈశ్వర్ వాటిని చూడనట్టు ఎటో చూస్తున్నాడు.

అప్పుడు గిరిజే కూల్ డ్రింక్స్ కుర్రాడిని పిల్చి రెండు గోల్డ్ స్పాట్ లను ఇవ్వమన్నది.

ఈశ్వర్ ఏదో అనబోయాడు. అప్పటికే ఆ కుర్రాడు ఓ. బాటిల్ మూత ఓపెన్ చేశాడు.

"తీస్కోండి" అన్నది గిరిజ బాటిల్ని అతనికిస్తూ....

డ్రింకులు తాగిన తర్వాత ఈశ్వర్ డబ్బులు ఇవ్వక తప్పలేదు.

సినిమా వదిలిన తర్వాత బయటికొచ్చారు.

ఆ థియేటర్ నించి వాళ్ళ యిల్లు అంత దూరంకాదు. అయినా గిరిజ "అబ్బా....ఈ జనం అందరినీ రాసుకుంటూ నడవాలంటే విసుగ్గా వుంది" అంటూ ఓ రిక్షాని పిలిచింది.

"ఇల్లు దగ్గరే కదా....రిక్షా యెందుకు?" అన్నాడు ఈశ్వర్.

"దగ్గరే అనుకోండి....అయినా ఈ జనంలో నడవటం కష్టం....అయినా మనం రోజూ రిక్షాలు ఎక్కంకదా" అన్నది తనే బేరమాడి ఎక్కికూర్చుని.

ఆ రాత్రి ఈశ్వర్ పొదుపు గురించి మితంగా ఖర్చు చెయ్యటం గురించీ భార్యతో ఏదో చెప్పబోయాడు. కాని గిరిజ ఆ విషయాన్ని తేలిగ్గా కొట్టిపారేస్తూ "ఆమాత్రం నాకు తెలీదా? రేపు మనకు డబ్బులేక ఇబ్బంది పడుతుంటే నేను చూడగలనా? ఉన్నంతలోనే దర్జాగా బతుకుదాం. ఏదయినా పెళ్ళయిన కొత్తల్లోనే

పిల్లలు పుట్టేంతవరకే మనం అనుభవించేది. పిల్లలు పుట్టాక మన ఖర్చు పెరుగుతుంది. యింత చిన్న విషయం మీకు తెలుసుకదా" అన్నాది చివరగా.

ఆ ఇంట్లో అత్తకీ—కోడలుకీ మధ్య ప్రతి చిన్న విషయానికీ యుద్ధం మొదలయ్యింది. యెవరికివారే ఆ యుద్ధంలో విజయం సాధించాలని తీవ్రమయిన ప్రయత్నాలు చేస్తున్నారు.

ఆ ఇద్దరిమధ్య ఈశ్వర్ అడకత్తెరలో పోక చెక్కలా నలిగిపోవటం మొదలు పెట్టాడు.

"నువ్వేం మగాడివిరా....కొత్తగా యింటికి వచ్చిన పెళ్ళాన్ని వంచి దారిలోకి తీసుకురాలేకపోయావు" అన్నది తల్లి.

"నేనేం చేసేది? ఇదంతా నీ పెంపకమే. చిన్నతనం నుండి నువ్వు నన్ను ఇట్లాగే పెంచావు. యే విషయంలో నువ్వు నాకు స్వతంత్రం యిచ్చావు. స్వతంత్రంగా ఆలోచించే అవకాశం యిచ్చావు. దీనికంతటికీ అసలు కారణం నువ్వే. కోడలు కూడా నీ మనిషే అని నువ్వు యెందుకు అనుకోవు" అని అడిగాడు ఈశ్వర్.

"అత్తగారు బతికున్నంతవరకూ ఇంటి బాధ్యతలు, గొడవలు ఆమే చూసుకుంటుందని యెందుకు అనుకోదు? ఇంత చిన్న వయసులోనే అధికారం చెలాయించాలనే తాపత్రయం దానికి యెందుకు?" అనేది సుందరమ్మ వాదన.

"నా మొగుడు. నా యిల్లు. ఈ సంపాదన అంతా నా మొగుడిది. ఆ మొగుడికి పెళ్ళాంగా ఆ సంపాదనను ఖర్చుపెట్టే హక్కు నాకు వుంది. అందుకే ఈ యింటి పెత్తనం నాది. నా పెత్తనాన్ని మీరు సహించలేక

పోతే ఈ ఇంట్లోనించి వెళ్ళిపోవచ్చు" అనేసింది గిరిజ.

"ఏమిటీ....నువ్వు నా యింట్లో నుంచి నన్నే వెళ్ళమంటున్నావా? నీకెన్ని గుండెలు? నీ అంతు చూస్తాను. ఈ సుందరమ్మ గురించి నీకు యింకా తెలీదు.....నీ మొగుడా? నీ మొగుడు యెక్కడినించి వచ్చాడు? ఎన్ని రోజుల క్రితం నీకు మొగుడయ్యాడు? వాడు ముందు నాకు కొడుకు. ఆ తర్వాత నీకు మొగుడు. నేను బతికున్నంతవరకు ఈ యింటిమీద సర్వాధికారాలు నాకే ఉంటాయి. నేను చచ్చిపోయిన తర్వాతనే నీకు ఈ యింట్లో అధికారం సంక్రమించేది" అన్నది సుందరమ్మ కటిగా.

అప్పుడే మొదటిసారిగా గిరిజ మెదడులోకి ప్రవేశించింది ఆ ఆలోచన—అత్తగారు బ్రతికి ఉండకూడదు అని.

# 6

గిరిజ అత్తగారింటికి వచ్చి నెల దాటి రెండురోజులు గడిచాయి.

"నాకు అమ్మ—నాన్నను చూడాలని వుంది. ఒక సారి మనిద్దరం వెళ్ళి వద్దాం...." అన్నది గిరిజ, భర్తతో.

"నేను రావటం కుదరదు. ఈమధ్య ఆఫీసులో పని ఎక్కువగా వుంటోంది. సెలవులు కూడా ఇవ్వటంలేదు. ఎలాగ?" అన్నాడు.

"మీకు వీలు అవకపోతే నేనొక్కదాన్నే వెళతాను."

"ఒక్కదానివే వెళతావా? యేం బావుంటుంది?"

"బావుండే దేమిటి? మావాళ్ళు అలా అనుకోరు.

నేను ఇష్టపడే ఒక్కదాన్నీ వచ్చానని చెబుతాను. ఒక్కదాన్నే వెళ్ళటానికి నాకు భయంలేదు."

"సరే....నీ యిష్టం....మళ్ళీ యేమయినా అనుకోంటుంది మా అమ్మతో కూడా ఒక మాటచెప్పు" అన్నాడు.

"ఆమె అనుకునే దేమిటి? అయినా ఆమెతో చెప్పాల్సిన అవసరం నాకు లేదు. నాకు మొగుడే ముఖ్యం. మీ మాటే నాకు కావలసింది. మీరు సరేనన్నారు. అంతే. కావాలంటే మీరు చెప్పుకోండి" అన్ని అప్పటికప్పుడే సూట్ కేసులో తన బట్టలు సర్దుకుని పుట్టింటికి బయల్దేరింది.

ఒంటిగా యింటికి వచ్చిన కూతుర్ని చూసి జానకమ్మ కొద్దిగా ఆశ్చర్యపడింది.

"ఏమిటి విశేషం?" అనడిగింది.

"విశేషం ఏదీలేదు. కొంచెం పని వుండి వచ్చాను. ఒక విషయంలో నీ సలహా తీసుకోవాలి" అన్నది గిరిజ.

అప్పుడు తండ్రి జనార్దనం యింట్లో లేడు.

"ఏమిటా సలహా? వివరంగా చెప్పు...." అన్నది తల్లి....

అప్పుడు గిరిజ తనకీ తన అత్తగారికీ మధ్య జరుగుతున్న యుద్ధం గురించి తల్లితో చెప్పింది.

అంతా విని "అయితే మనం వూహించిన దానికంటే మీ అత్తగారు మరీ అసాధ్యురాలు అయివుంటుంది. ఇప్పుడు ఆడదానికి మరో ఆడదే పోటీగా వుంది. నువ్వు చెప్పినదాన్నిబట్టి చూస్తుంటే ఆమె కూడా మనలాంటి మనిషే అయివుంటుంది. అందువల్ల మనం జాగ్రత్తగాకే వుండాలి" అన్నది.

"అవును. ఆమె బతికివుండగా నాకు ఆ ఇంట్లో పెత్తనం రాదని గట్టిగా చెప్పింది. నిజంకూడా అంతే.

నాకు ఆమె భయపడేటట్టుగా కనపడటంలేదు. అందువల్ల యిక నాకు ఒక్కటే మార్గం కనపడుతోంది. అదేమిటంటే ఆ ఘటాన్ని అడ్డు తొలగించుకోవటమే...." అన్నది.

ఉలిక్కిపడింది తల్లి.

"ఏమిటే నువ్వనేది! ఆమెను పైకి పంపుతానంటావా?"

"అవును. తప్పదమ్మా. ఆమె మనిద్దరికంటే ఎక్కువ మొండిది. ఇంకో పదేళ్ళవరకూ ఆమె మంచాన పడకుండా హాయిగా తిరుగుతుంది. ఆ తర్వాత కదా నాకు ఆ ఇంట్లో పెత్తనంవ నే....అప్పటివరకూ నేను ఎదురు చూడలేను. ఈ లోపలే నేను అనుకున్నది జరిగిపోవాలి. అందుకు ఆమెను పైకి పంపించటం ఒక్కటే దారి"

"సాధ్యమేనంటావా?" అని సందేహాన్ని వెలిబుచ్చింది తల్లి.

"తల్చుకుంటే ఏది సాధ్యంకాదు. అయితే కొంచెం జాగ్రత్తగా వ్యవహరించాలి."

"ఏం చేస్తావు? ఏదయినా మందు పెడతావా?" అడిగింది.

"మందు పెడితే లాభంలేదు. తొందరగా చావదు. పైగా కొద్దిరోజుల్లోనే ఆ విషయాన్ని తెలుసుకుంటుంది. దాన్నించి బయటపడుతుంది. ఆమెకు నా ప్రయత్నం తెలిసిపోతుంది. అందువల్ల నువ్వు ఏదయినా ప్లాను ఆలోచించు." అన్నది గిరిజ తల్లితో.

ఇంతలోనే తండ్రి వచ్చాడు. కూతుర్ని పలకరించాడు. చూసిపోదామని వచ్చినట్టుగా చెప్పింది తండ్రితో.

అత్తగారి గురించి చెప్పింది కాని ఆమెను పైకి పంపించే ఆలోచన చేస్తున్నట్టుగా ఆయనతో చెప్పలేదు.

చెబితే ఆయన కంగారు పడతాడేమోనని చెప్పలేదు. అంతేకాదు. తన ప్రయత్నాలను భయంతో సాగనివ్వక పోవచ్చును.

అల్లుడి గురించి అడిగాడాయన.

"ఆయనదేమీ లేదు నాన్నా. నా మాట కాదనే శక్తి ఆయనకు లేదు. ఎటొచ్చీ ఆ ఇంట్లో మా అత్తగారిదే పెత్తనం. తన పెత్తనం కిందకి ఇంకో మనిషి వచ్చినందుకు సంతోషపడింది. కాని ఆమె పెత్తనాన్ని నేను అంగీకరించటంలేదు. ఆమె నన్ను ఇబ్బందులు పెట్టి చెప్పుకింది తేలులా అణుచుకు రావాలని చూస్తోంది. ఆయన తల్లికి నచ్చచెబుతున్నాడు కాని ఆమె వినటం లేదు" అన్నది తండ్రితో.

"పెత్తనందేముందమ్మా.... అల్లుడు నిన్ను బాగా చూసుకుంటే చాలు. ఆమె పోయిన తర్వాత ఇక పెత్తనమంతా నీదేకదా." అన్నాడు తండ్రి.

"సర్లే.... మీరు ఆపండి. పెత్తనం ఏమున్నదంటూ గిరిజను నిజంగానే గాజులు తొడుక్కున్నదాన్ని చెయ్యకండి. ముసలిదై పోయి కూడా దానికి ఇంకా పెత్తనం మీద అంత వ్యామోహం ఎందుకు?" అని గర్జించింది జానకమ్మ.

ఆ గర్జనకు భయపడి అక్కడినించి వెళ్ళిపోయాడు తండ్రి.

"నీ అత్తగారు కూడ ఇలా భయపడి పారిపోవాలి. వీలున్నంతవరకు ప్రయత్నం చెయ్యి. ముందుగానే తొందరపడి పైకి పంపించే ప్రయత్నాలు వద్దులే. ఎందుకంటే

ఏ మాత్రం బెడిసికొట్టినా మనం జైల్లో కూర్చోవలసి వస్తుంది. అందుకు లోసుగులు లేని దారి ఏదయినా కనపడిన తర్వాత తప్పనిసరి అయినప్పుడు ఆ ప్రయత్నం చేద్దాం."

"సరే.... మా అత్తగార్కి ఇంకొంచెం టైము, ఇంకొంచెం అవకాశము ఇస్తాను. మర్యాదగా తను పెత్తనాన్ని నాకు ఇస్తుందేమో చూస్తాను. నాకు అడ్డు తగిలిందంటే ఇక చివరి ప్రయత్నం ఆమెకు చావుతప్పదు." గిరిజ దృఢమైన స్వరంతో అన్నది తల్లితో.

"నీ యిష్టం. అంతా నీ తెలివితేటలు మీద ఆధార పడివుంది. జాగ్రత్త. ఎప్పుడయినా అంతే. మొగుడ్ని వంచటం సులభమే. కాని ఆ తలను వంచడమే కష్ట సాధ్యమైనది. ఆ ఇంట్లో నీదే పైచెయ్యి కావాలని ఇక్కడే నేను ఆ దేవుడ్ని ఎప్పుడూ ప్రార్థిస్తూవుంటాను" అన్నది తల్లి.

ఆ రోజునే తిరిగి అత్తగారింటికి ప్రయాణమయ్యింది గిరిజ.

## 7

అత్తా కోడళ్ళిద్దరికీ ఆ రోజు సాయంత్రం మళ్ళీ ఓ పెద్ద యుద్ధం జరిగింది. ఆ మధ్యాహ్నం సుందరమ్మ ఎవరింటికో పేస్కుకొట్టటానికి వెళ్ళింది. ఆ టైములో గిరిజ రవ్వలడ్లు చేసుకుని తిన్నది. షికారుకు వెళ్ళివచ్చిన అత్తగారికి కనీసం తను లడ్లు చేసిన విషయం కూడా చెప్పలేదు. ఐనా ఆమె తెలుసుకున్నది.

దాంతో ఆమెకు కోపం వచ్చి రకరకాల పిండివంటలు చేసుకుని రహస్యంగా తింటూ ఇల్లును గుల్ల చేస్తుందంటూ గిరిజను రకరకాల తిట్లు తిట్టింది. గిరిజ కూడా తనకు వచ్చిన రకరకాల తెలుగు, ఇంగ్లీషు తిట్లను తిట్టేసింది.

గిరిజ ఆ రాత్రి భోజనం చెయ్యకుండా అలిగి పడుకుంది. ఈశ్వర్ ఆఫీసునించి వచ్చి తల్లి చెప్పిన రవ్వలడ్ల కధ విని అలిగిపడుకున్న భార్యను భోజనానికి రమ్మని బతిమాలాడు. అయినా గిరిజ వెళ్ళలేదు. చివరికి భర్త ఎంతగానో బతిమిలాడిన తర్వాత కొన్ని షరతులను విధించింది.

"ఈ ఇంట్లో నేను గానీ మీ అమ్మగానీ ఎవరో ఒకరు వుండాలి. ఇద్దరం వుండటానికి వీల్లేదు. ఆమెను వెళ్ళిపొమ్మని చెప్పండి. ఆమె వెళ్ళకపోతే మనమే వేరు కాపురం పెడదాము. మీ అమ్మ పెట్టే నరకం నేను భరించలేను" అంది.

"అట్లాగే. ముందు నువ్వు భోజనానికిరా. అమ్మతో నేను మాట్లాడతానులే" అన్నాడు ఈశ్వర్.

భోజనం చేసింది గిరిజ.

ఇంకొంచెం పొద్దుపోయిన తర్వాత ఈశ్వర్ తల్లితో మాట్లాడాడు.

"ఈ పెత్తనం గురించే కదా ఈ గొడవంతా. ఆ పెత్తనం ఏదో నా భార్యకే ఇవ్వరాదా? అలా కాని పక్షంలో అది నిన్ను ఇంట్లోనుంచి వెళ్ళిపోయి వేరుగా ఎక్కడయినా వుండమంటోంది. లేకపోతే మనమే వేరు కాపురం పెడదామంటోంది. అందువల్ల నువ్వు ఏదో ఒక దానికి ఒప్పుకోక తప్పదు. మధ్యలో నేను నలిగి పోతున్నాను" అన్నాడు ఈశ్వర్ తల్లితో.

కొడుకు మాటలు విని ఆమె గుండె బాదుకుని పెద్ద పెట్టున యేడ్చింది.

"ఒరేయ్ ఈశ్వర్ పెళ్ళయిన తర్వాత పెళ్ళాం మాటలు విని నన్నే ఇంట్లోనించి వెళ్ళిపొమ్మని అంటు

న్నావా? లేకపోతే మీరే వేరుగా వెళ్ళిపోతామని చెబుతున్నావా? ఒక్క విషయం గుర్తుపెట్టుకో, నేను ఈ ఇంట్లోనుంచి వెళ్ళను. మీరు ఈ ఇంట్లోనుంచి వెళ్ళిన మరుక్షణంలోనే నేను రైలు కిందపడి చస్తాను. చచ్చే ముందు నా చావుకు మీ రిద్దరూ కారణం అని ఉత్తరం రాసిపెట్టి మరీ చస్తాను. ఇక ఈ ఇంటపెత్తనం దానికి ఇవ్వను. అది చెప్పినట్టు ఈ ఇంట్లో ఏదీ జరగదు. వెళ్లిపో." అంటూ ప్రళయనాదం చేసింది.

ఆ నాదానికి భయపడివచ్చి భార్య గదిలో పడిపోయాడు ఈశ్వర్.

భర్త చెప్పినదంతా విని మవునంగా తల వూపింది గిరిజ.

తెల్లవారిన తర్వాత భర్త ఆఫీసుకు వెళ్ళిపోయాడు. సుందరమ్మ ఎవరింటికో కబుర్లకోసం వెళ్ళింది. భోజనం చేసిన తర్వాత అలా తిరిగి రావటం ఆమెకు అలవాటు.

ఆ రాత్రి ఈశ్వర్ అపరాధపరిశోధన కథల పుస్తకం తీసుకువచ్చాడు. అతను ప్రతినెలా ఆ పుస్తకాన్ని తీసుకువచ్చి చదువుతూ వుంటాడు. ఆ ఇంటికి వచ్చిన దగ్గర్నించీ గిరిజ కూడా వాటిని చదువుతోంది.

ఆమె వరండాలో కూర్చుని అపరాధపరిశోధన చదువుతున్నప్పుడు పోస్టుమేన్ వచ్చి గిరిజ చేతికి ఓ ఇన్లాండు కవరు అందించాడు. అది గిరిజ తండ్రి రాసిన ఉత్తరం. ఆమె ఆ ఉత్తరాన్ని ఓ పెన్ చేసి చదువుతుంటే పోస్టుమేన్ అక్కడే నిలబడి గిరిజ ఉత్తరం చదవటం పూర్తిచేసిన తర్వాత "అమ్మా, ఈ అపరాధపరిశోధన పుస్తకంలో 'హత్యకు వెయ్యి మార్గాలు' కథ చదివారా?" అని అడిగాడు.

"ఎందుకు?" అన్నది గిరిజ.

"ఆ కథ రాసిన రచయిత శంకర్ ఈ వూళ్లోనే వుంటాడమ్మా"

"ఈ వూళ్లోనా?!"

"అవును. అతను ఈ వీధిలోనే చివరవున్న డాబా ఇంట్లో ఓ గదిలో వుంటున్నాడు. అతని కథలు ప్రతి నెలా ఈ అపరాధపరిశోధనలో వుంటాయి. అతనికి పుస్తకాలు రాగానే నేను కూడా తీసుకుని ప్రతినెలా చదువుతూ వుంటాను."

"అలాగా. అత నేం చేస్తూ వుంటాడు?" కుతూహలంగా అడిగింది గిరిజ.

"ఏదో చిన్న వ్యాపారం చేస్తున్నట్టున్నాడు. ఇంకా పెళ్ళి కాలేదనుకుంటాను. ఎక్కువగా కథలు రాస్తూ వుంటాడు. అంతకుమించి నాకు వివరాలు తెలియవు" అన్నాడు.

"సరే.... వెళ్లు" అన్నది గిరిజ.

పోస్టుమేన్ వెళ్ళిపోయాడు.

అతను వెళ్ళగానే ఆ పుస్తకంలోవున్న శంకర్ రాసిన 'హత్యకు వెయ్యి మార్గాలు' కథను చదివింది గబగబా.

ఆ కథను చదివి ఆశ్చర్యపోయింది గిరిజ. అందులో ఓ మనిషిని హత్య చెయ్యటానికి ఎన్నో రకాల మార్గాలు వున్నట్టుగా శంకర్ రాశాడు. అంతవరకు బాగానేవుంది. కాని హంతకుడు చేసిన చిన్న పొరపాటువల్ల చట్టానికి దొరికిపోతాడు నేరస్థుడిగా.... అదే గిరిజకు నచ్చలేదు.

ఎలాగయినా ఆ రచయితను కలుసుకుని మాట్లాడితే బావుంటుందనిపించింది గిరిజకు. తన అత్తగారి పీడ వది

లించుకోటానికి ఏదయినా మార్గం చెప్పకపోడు. ఎలా గయినా తను అతనితో మాట్లాడి తీరాలి అనుకుంది.

అనుకున్నదికాని అతన్ని ఎక్కడ కలుసుకోవాలో అర్థంకాలేదు. అతని గదికి తను వెళ్ళటం బావుండదు. ఎవరైనా చూసినా తను నలుగుర్లో చులకనవుతుంది.

పోనీ అతన్నే తన ఇంటికి రమ్మని కబురు పెడితే?

ఈ ఆలోచన కూడా గిరిజకు అంతగా నచ్చలేదు. తను ఆ రచయితతో ఒంటరిగా మాట్లాడే సమయంలో అత్తగారు వచ్చిందంటే కొంప మునుగుతుంది. తనమీద రకరకాల నిందలు వేస్తుంది. అలాంటి అవకాశం ఆమెకు ఇవ్వకూడదనుకుంది.

ఆ రాత్రి చాలా సేపటివరకు ఈ విషయం గురించే ఆలోచించింది గిరిజ.

చివరికి ఆమె ఒక ఉపాయం ఆలోచించింది.

దాని ప్రకారం ఆ రాత్రి ఈశ్వర్ గాఢ నిద్రలో మునిగిపోయిన తర్వాత రచయిత శంకర్‌కు ఓ ఉత్తరం రాసింది.

అందులో తను అతని అభిమాని అనీ పెళ్ళయిన కారణంగా అతన్ని గదిలో లేక తన ఇంట్లో కలుసుకోవటం బావుండదు కాబట్టి మర్నాడు సాయంత్రం ఆరున్నర గంటలకు రైలుస్టేషన్ దగ్గర పార్కులో కలుసుకోమని రాసింది.

తెల్లవారిన తర్వాత భర్త ఆఫీసుకు వెళ్ళగానే గిరిజ ఆ ఉత్తరాన్ని పోస్టు చేసింది.

ఎలాగైనా అత్తగారి పీడ వదిలించుకోవాలని గట్టిగా అనుకున్నది.

# 8

సాయంత్రం ఆరున్నరగంటలు—

ఆ సమయంలోనే పార్కులోకి వచ్చింది గిరిజ. అప్పటికే అక్కడకు శంకర్ వచ్చి ఆమె కోసం ఎదురు చూస్తున్నాడు.

ఆ క్రితం రోజు సాయంత్రం తన గదిలోనించి బయటకు వస్తున్న శంకర్‌ను చూసింది కాబట్టి పార్కులో అతన్ని పోల్చుకోవటానికి ఇబ్బంది పడవలసిన అగత్యం ఏర్పడలేదు.

అతను కూడా ఆమెను గుర్తించి చిరునవ్వు నవ్వాడు. అతను కొంచెం లావుగా - బొద్దుగా వున్నాడు. చామన చాయలో ఓ మాదిరి పొడుగ్గా వున్నాడు.

ఆ పార్కు పెద్దదే. కాని ఎక్కువమంది జనం లేరు.

వాళ్ళిద్దరూ గుబురుగా వున్న ఓ చెట్టుపక్కనే కూర్చున్నారు.

"మీ గురించి పోస్టుమేన్ చెప్పాడు. మీ కథలు అపరాధపరిశోధనలో చాలా చదివాను. అవన్నీ నాకు ఎంతగానో నచ్చాయి. మీరు నేను వుంటున్న రోడ్డులోనే వుంటున్నారని పోస్టుమేన్ చెప్పిన తర్వాత ఎలాగైనా మిమ్మల్ని కలుసుకుని మాట్లాడాలనుకున్నాను." అన్నది గిరిజ.

శంకర్ చిరునవ్వుతో "థాంక్స్...." అన్నాడు.

"ఈ నెల సంచికలో వున్న మీ కథ "హత్యకు వెయ్యి మార్గాలు" కథ మరీ నచ్చింది. ఆ కథలో మీరు రాసినట్టుగానే ఓ మనిషిని హత్య చెయ్యటానికి అన్ని మార్గాలు ఉన్నాయంటారా?" అని అడిగింది ఆమె.

అతను నవ్వి "క్రయిం కథలు రాసే రచయితలకు

ఆడవాళ్ళలో అభిమానాలు ఉండటమే తక్కువ. అలాంటిది మీరు యింత వివరంగా ఆ కథల గురించి కూడా అడుగుతున్నారంటే మీకు క్రయిం సాహిత్యం పట్ల బాగా అభిమానం వుండివుంటుంది" అన్నాడు శంకర్.

"క్రయిం సాహిత్యం పట్ల అభిమానం సంగతి ఎలా వున్నా ముందు హత్యకు ఉన్న మార్గాల గురించి తెలుసు కోవటం ప్రస్తుతం నాకు చాలా అవసరం."

అతను ఆశ్చర్యంగా గిరిజను చూసి—

"మీ మాటలు నాకు అర్థం కావటంలేదు. దయచేసి వివరంగా చెప్పండి" అన్నాడు.

"వివరంగా చెప్పాలంటే నామీద హత్యాప్రయత్నం జరగవచ్చుననిపిస్తోంది. కాని అది యే రూపంలో ఉంటుందో నేను ఊహించలేకుండా ఉన్నాను" అన్నది.

"వాట్!" అంటూ అదిరిపడ్డాడు శంకర్.

నిమిషం తర్వాత "మీరు చెబుతున్నది నిజమేనా?!" అని అడిగాడు.

"నూటికి నూరుపాళ్ళు నిజం. యిందులో అబద్ధం లేనే లేదు."

"ఐతే మిమ్మల్ని హత్య చెయ్యటానికి ఎవరు ప్రయత్నం చేస్తున్నారు? ఎందుకు?"

"ఎవరో కాదు. మా అత్తగారే నన్ను హత్యచేసే లేక చేయించే ప్రయత్నాలు చేస్తుందేమోనని నాకు భయంగా వుంది. ఇక ఆమెకీ నాకూ బొత్తిగా పడటంలేదు. ఆమె యెన్నో రకాల ఇబ్బందులు పెడుతోంది. వాటిని భరించ లేక నేను యెదురుతిరుగుతున్నాను. అందుకని ఎలాగైనా నా అంతు చూస్తానని చాలాసార్లు బెదిరించింది. అది

బెదిరింపు కాదని నిజంగానే ఆమె నా అంతు చూస్తుం
దని నాకు అనుమానంగా వుంది."

"ఆశ్చర్యంగా వుంది. అలాంటప్పుడు ఈ విషయాన్ని
మీ భర్తతో చెప్పి మీరు వేరుగా వుండొచ్చుకదా"
అన్నాడు శంకర్.

"ఉండొచ్చు. నిజమే. అందుకు ఆయనకూడా ఒప్పు
కున్నాడు. కాని మా అత్తగారు ఒప్పుకోలేదు. మమ్మల్ని
వదిలి తను వెళ్ళిపోదుట. మేము వేరుగా వెళ్ళిపోతే
తను అప్పుడే తన చావుకి మేమే కారణం అని ఓ
ఉత్తరం రాసిపెట్టి రైలుకిందపడి ఆత్మహత్య చేసుకుం
టుందట. ఈ బెదిరింపుతో ఆయన వేరు కాపురం పెట్ట
టానికి ఒప్పుకోవటం లేదు. ఇక నాకేమిటి దారి?" అని
అడిగింది గిరిజ—శంకర్ని.

అతను ఓ ఐదు నిమిషాలు మాట్లాడకుండా తీవ్రంగా
ఆలోచించి "ఇంతకీ నన్నేం చెయ్యమంటారు?" అనడి
గాడు,

"ఆమె నన్ను ఏ విధంగా చంపగలదో చెప్పండి.
నా జాగ్రత్తలో నేను ఉంటాను" అన్నది.

గిరిజకు తెలివి బాగానే పనిచేస్తోంది. అందుకే ఆమె
రివర్స్ గేర్లో తను అత్తగార్ని చంపటానికి పద్ధతుల
గురించి అడక్కుండా ఆమే తనని చంపే అవకాశం
వున్నట్టూ, ఆమె తనని ఏ విధంగా చంపే అవకాశం
వుందో ముందుగానే తెలుసుకోటానికి అడుగుతున్నట్టుగా
అతనికి కొంచెంలాంటి అనుమానం రాకుండా అడిగింది.

శంకర్ నవ్వి "అంత పెద్దామె మిమ్మల్ని హత్యచేసే
లేక చేయించే ప్రయత్నాలు చెయ్యటం ఏమిటి? మీరు
అనవసరంగా భయపడుతున్నారు. ఆమెను అనుమానిస్తు

న్నారు" అన్నాడు.

"కాదు శంకర్ గారూ. దయచేసి మీరలా తేలిగ్గా తీసి పారెయ్యకండి. ఆమె సంగతి మీకు తేలీదు. రెండు సార్లు గొడవ జరుగుతున్నప్పుడు నా గొంతు నొక్కటానికి వచ్చింది కోపంతో. ఆమెకు నామీద అంతులేని కసి, ద్వేషం వున్నాయి."

అతను మధ్యలో అడిగాడు.

"మీామీద ఆమెకు అంత కసి, ద్వేషం యెందుకల్ల ఏర్పడ్డాయి?"

"నేను కాపురానికి వచ్చిన తర్వాత ఆమె చేతిలో నించి యింటి పెత్తనాన్ని నేను లాక్కోవాలని చూస్తు న్నానుట. అందుకే ఆమెకు నేనంటే అంత పగ"

"నిజంగా ఇదంతా ఆశ్చర్యంగా వుంది. యిలాంటి గొడవల గురించి కూడా హత్యలు జరుగుతాయంటే నేను నమ్మలేకుండా వున్నాను".

"మీరు నమ్మలేకపోవచ్చు. కాని ఇది నిజం. అంతా జరిగిపోయిన తర్వాత నా పోయిన ప్రాణం తిరిగిరాదు. అందువల్ల ముందుగానే నా జాగ్రత్తలో నేను వుండటం మంచిదికదా. ప్లీజ్ చెప్పండి. ఆమె నన్ను ఏ విధంగా హత్యచేసే అవకాశాలు వున్నాయి" మళ్ళీ అడిగింది గిరిజ.

ఒక్క నిమిషం శంకర్ ఆలోచించి "మీరు ఇంతగా భయపడుతున్నారంటే మీ ఇద్దరిమధ్య బాగానే అడ్డు గోడలు లేచి వుంటాయి. ఆమె మీరు తీసుకునే ఆహా రంలో ఏదయినా కలిపి చంపవచ్చు. కత్తితో పొడిచి చంపవచ్చు. మీ దొడ్లో బావి వుండి మీరు నీళ్ళు తోడు తున్నప్పుడు వెనకనుంచి వచ్చి అందులోకి నెట్టి చంప వచ్చు. లేదా మీరు కృశించి, నీరసించిపోయి చనిపో

యేట్టుగా ఏదయినా మందు పెట్టి చంపవచ్చు....ఇలాంటి మార్గాలు ఎన్నో వున్నాయి" అన్నాడు.

అతను చెప్పినవన్నీ విని "మీరు చెప్పిన పద్ధతుల్లో నన్ను చంపే ప్రయత్నాలు చేస్తే నేరం ఆమెమీదకు వస్తుందనుకునే అవకాశం వుండదా?" అని అడిగింది.

"ఉంటుంది. ఐతే ఆ ఉండటమనేది హత్య జరిగిన సమయం పరిస్థితులమీద ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు ఆమె మరో మనిషి ఇంట్లో వుండగా మిమ్మల్ని చంపే ప్రయత్నం చెయ్యదుకదా. ఇంట్లో మీరిద్దరూ ఉన్నప్పుడే ఆ పని చేస్తుంది. అలాంటప్పుడు పోలీసులు హత్య జరిగిన తర్వాత తప్పకుండా ఆమే ఆ పని చేసిందని తెలుసుకుంటారు. అందువల్ల ఆమె పట్టుబడే అవకాశం వుంది."

"ఇది హత్య అని తెలియకుండా సహజమైన చావులాగా కనిపించే మార్గాలేమైనా వున్నాయా? ఒకవేళ ఆమె నన్ను అలా హత్య చెయ్యవచ్చు కదా!" అనుమానంగా అడిగింది.

"అలాంటి మార్గంకూడా ఒకటి వుంది. మీరు నిద్రపోతున్నప్పుడు దిండుతో మీ మొహాన్ని నొక్కిపట్టి ఊపిరాడకుండా చేసి చంపవచ్చు. అలాంటప్పుడు అది హత్య అని తొందరగా యెవరికీ తెలీదు. చూసేవాళ్ళకు సహజమైన చావుగానే కనపడుతుంది."

"నిజమే....ఒక సినిమాలో చూశాను. మీరు చెప్పినట్టుగానే దిండుతో మొహంమీద నొక్కి హత్య చెయ్యటం....బహుశ ఆమె నన్ను అలాగే హత్య చేస్తుందేమో" అన్నది గిరిజ భయం నటిస్తూ.

శంకర్ నవ్వాడు.

"మీరు అనవసరంగా భయపడుతున్నారేమో! ఆమె మిమ్మల్ని హాత్య చెయ్యగలదనుకుంటే నాకు నమ్మకం కలగటంలేదు" అన్నాడు.

గిరిజ కూడా అదోలా నవ్వి "ఏదో ఒకరోజు మీరు నా హాత్య వార్త విన్నప్పుడు బాగా ఆశ్చర్యపోతారు" అన్నది.

"మళ్ళీ యెప్పుడు కలుస్తారు?" అడిగాడు శంకర్.

"ఎప్పుడు కలుసుకునేది నేను మీకు ఉత్తరం రాస్తాను. నాలో భయం పెరిగినప్పుడు మీ సలహా తీసుకోటానికి తప్పకుండా మిమ్మల్ని కలుస్తాను" అన్నది ఆమె లేస్తూ.

శంకర్ కూడా నిలబడ్డాడు.

అప్పటికే బాగా చీకటి పడిపోయింది.

## 9

మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో ఆ యింట్లోకి రిక్షా దిగి ఓ మనిషి లోపలకు వచ్చాడు.

అతను—సన్నగా పొడుగ్గా ఉన్నాడు. లోతుకు పోయిన కళ్ళు. పొడుగాటి ముక్కుతో విచిత్రంగా ఉన్నాడు.

ఎదురుగా వచ్చిన సుందరమ్మను చూస్తూనే "పిన్నీ బావున్నావా?" అనడిగాడు.

"ఆ....ఏం బాగులేరా నాగరాజూ....యేదో యిట్లా ఉన్నాను. నువ్వు రెండు నెలలనించీ ఈ వూరికే రావటం లేదేం? మమ్మల్ని మరచిపోయావా?" అని అడిగింది ఆమె.

"రెండు నెలలూ మరో ప్రాంతంలో బిజినెస్సు బాగా ఉండటంతో ఇటువైపు రాలేదు. చిన్న పనుండి

యిప్పుడే వచ్చాను. మళ్ళీ సాయంత్రమే వెళ్ళిపోవాలి. ఈశ్వర్ ఆఫీసుకు వెళ్ళాడా?" అని అడిగాడు.

తన గదిలో కిటికీ దగ్గర నిలబడి ఓరగా తెరచివున్న కిటికీ రెక్కల సందునించి అతడ్ని చూసి ఇతనెవరో తెలుగు సినిమాలో తన్నులుతినే ఎలకలా ఉన్నాడే అనుకుంది గిరిజ.

తర్వాత నాగరాజు—సుందరమ్మ యిచ్చిన నీళ్ళుతాగి "ఈశ్వర్ పెళ్ళికి రావాలని యెంతో ప్రయత్నంచేశాను. కాని వదల్లేరు. ఇంతకీ వదిన ఏదీ? ఇంట్లో యెక్కడా కనపడదేమిటి?" అంటూ లేచి గిరిజ ఉన్న గదివైపు వచ్చాడు.

సుందరమ్మ ఏదో మాట్లాడబోయి వూరుకుంది.

లోపలకు వచ్చిన నాగరాజును చూసి లేచి నిల్చుంది గిరిజ.

"హల్లో వదినగారూ. నా పేరు నాగరాజు. మీ అత్తగారికి అక్కయ్య కొడుకుని. అనివార్య కారణాల వల్ల మీ పెళ్ళికి రాలేకపోయాను" అన్నాడు చిరు నవ్వుతో.

అతను నవ్వుతున్నా భయంకరంగానే అనిపించింది గిరిజకు.

ఇతని గురించి ఈశ్వర్ ఎప్పుడూ చెప్పలేదని అను కుంది. రెండు నిమిషాలు అక్కడే నిలబడి సుందరమ్మ పిలవగానే ఆ గదిలోనించి వెళ్ళిపోయాడు నాగరాజు.

ఆ తర్వాత కొంచెంసేపు నాగరాజుతో గిరిజ మొండి తనం గురించి చెప్పటం ఆమె విన్నది. అప్పుడే వెళ్ళి సుందరమ్మతో గొడవ పెట్టుకోవాలని అనుకున్నది.

కాని—నాగరాజు ముందు అదంతా బావుండదని

పూరుకుంది.

కావి — నాగరాజు కోర చూపులు, ఓర చూపులు చూస్తుంటే అతను తప్పకుండా రౌడీ వెధవే అయి వుంటాడని అనుకున్నది.

"ఈ నాగరాజు మనింట్లో యెన్ని రోజులుంటాడు?" అనడిగింది ఆ రాత్రి భర్తను.

"ఏమో .... ఒక్కోసారి ఇరవై రోజులు కూడా ఉంటాడు. అమ్మకు నాగరాజంటే యిష్టం. అతను చిన్న తనంలో కొన్నాళ్ళు మా యింట్లోనే పెరిగాడు. అమ్మే అతన్ని పెంచింది. అతనేదో వ్యాపారం చేస్తున్నాడు. ఏం వ్యాపరమో నాకింతవరకు సరిగ్గా తెలీదు" అన్నాడు ఈశ్వర్.

"అతను ఇన్ని రోజులు ఈ ఇంట్లో పడి తింటుంటే మీ అమ్మకు ఇష్టంగానే ఉంటుంది. మనమేదైనా చేసుకు తింటే ఏడుస్తుంది" అన్నది గిరిజ.

ఈశ్వర్ భార్యతో ఏమీ అనలేదు.

అదే రోజు రాత్రి గిరిజ పన్నెండు గంటలు దాటిన తర్వాత తలుపు తీసుకొని బయటకు వచ్చింది బాత్ రూమ్ కెళ్ళటానికి.

బయటంతా చీకటిగా వుంది.

ఐనా ఆమెకు భయమనిపించలేదు. గిరిజకు అలాంటి చీకటంటే భయంలేదు. రోజూ తనే ఒంటరిగా బయట కొచ్చి బాత్ రూంకు వెళుతుంది. భర్తను నిద్రలేపదు. అతను ఎంతసేపటికీ నిద్రలేవడు.

ఈశ్వర్‌ను నిద్రలేపటం అంత సులభంకాదు.

బాత్ రూంలోకి వెళ్ళి బయటకు వచ్చింది.

అంతే. ఎవరో ఆమెను విసురుగా ముందుకు నెట్టినట్టు

అనిపించింది. అలా అన్పిస్తున్నప్పుడే ముందుకు బోర్లా పడిపోయింది.

పడుతూనే పెద్దగా అరిచింది.

పడటంవల్ల నుదుటిమీద చిన్న దెబ్బ తగిలింది.

గిరిజ అరుపు వినిపించి ఈశ్వర్ బయటకు వచ్చాడు. అప్పుడే ఆమె పైకి లేస్తోంది.

"ఏమయ్యింది?" అడిగాడు.

"ఎవరో నన్ను ముందుకు నెట్టారు?"

అప్పుడు అతను ఆ బాత్ రూం పక్కన అంతా వెతికాడు. ఎవ్వరూ కనిపించలేదు.

"ఎవరూ లేరు గిరిజా....నువ్వు అలాగని భ్రమపడి ఉంటావు" అన్నాడు.

"కాదు. ఎవరో నన్ను చెయ్యిపెట్టి ముందుకు నెట్టి నట్టు అనిపించింది" అన్నది.

"అలాగే అనుకుంటే ఆ మనిషి ఎవరో యింతలోనే యెక్కడికి పారిపోతాడు. నీ చీరే పాదాలకు అడ్డుపడి ఉంటుంది. ముందుకి పడ్డావు."

"కాదు....కాదు ఈ యింట్లో మనుషులే యెవరో నన్ను నెట్టారు. నన్ను హత్యచెయ్యటానికి ప్రయత్నం చేస్తున్నారు."

అలాంటి టైములో భార్యకు ఏం చెప్పాలో ఈశ్వర్ కు అర్ధంకాలేదు.

వాళ్ళిద్దరూ యింట్లోకి వచ్చేసరికి నాగరాజు వచ్చి "ఏం జరిగింది? ఏమిటీ హత్య అంటున్నారు" అన్నాడు.

"ఏమీ లేదు. నువ్వెళ్ళి పడుకో" అన్నాడు ఈశ్వర్.

వెళ్ళిపోతున్న నాగరాజును అనుమానంగా చూసింది గిరిజ.

# 10

"ఇది హత్య. అందువల్ల నే నడిగే ప్రశ్నలకు సరయిన జవాబులు ఇవ్వండి" అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టర్ చంద్ర గిరిజతో.

"అడగండి" అన్నది ఆమె నీరసంగా.

అక్కడే సుందరమ్మ శవం మంచంమీద వెల్లకింతలా పడివుంది. ఆమె కనుగుడ్లు బయటకు పొడుచుకువచ్చాయి. గొంతు నొక్కటంవల్ల ఆమె మరణం సంభవించిందని పోలీసు డాక్టరు చెప్పాడు.

గొంతుమీద వేలిముద్రలు లేవని వేలిముద్రల నిపుణుడు అన్నాడు.

"ఈ సాయంత్రం ఎన్ని గంటలకు మీరు బయటకు వెళ్లారు?"

"ఆరు గంటలకు" చెప్పింది.

"ఇప్పుడు సమయం తొమ్మిది గంటలు కావస్తోంది. ఇప్పటివరకూ మీరు యెక్కడ వున్నారు?"

"ఆయన ఆలస్యంగా యింటికి వస్తారని ఉదయమే చెప్పి వెళ్ళారు. అందుకని బోరుకొడుతుంటే సినిమాకు వెళ్ళాను."

"సినిమా అప్పుడే వదిలారా?"

"వదల్లేదు. కాని నాకు తలనొప్పిగా వుందని వచ్చేశాను."

"ఎన్ని గంటలకు బయటకు వచ్చారు?"

"ఒక పావు గంట క్రితం."

"ఏ థియేటర్‌కు వెళ్ళారు? మీ దగ్గర కట్ చేసిన టిక్కెట్ వున్నాదా?"

"ఉంది.... సంధ్యా డీలక్స్ థియేటర్‌కు వెళ్ళాను" అంటూ చేతిలో వున్న హాండ్ పర్సులోనించి టిక్కెట్ పిస్ తీసి ఇన్‌స్పెక్టర్‌కు ఇచ్చింది.

చంద్ర దాన్ని చూసి జేబులో పెట్టుకున్నాడు.

"మీ ఫోటో వుంటే ఒకటి ఇస్తారా?"

గిరిజ బీరువాలో ఉన్న ఫోటో ఆల్బమ్‌తీసి అందులో నించి తను ఒక్కతే వున్న ఓ ఫోటోను చంద్రకు యిచ్చింది.

ఈశ్వర్ యేడుస్తున్నాడు తల్లి హత్య చెయ్యబడి నందుకు.

ఇన్‌స్పెక్టర్ అతన్ని ఓదార్చి "మీరు కాకుండా ఈ యింట్లో యింకెవరు ఉంటున్నారు?" అడిగాడు.

ఈశ్వర్ యేడుస్తూనే నాగరాజు గురించి చెప్పాడు.

"నాగరాజా?! అతనెవరు? యిప్పుడెక్కడ ఉన్నాడు?"

ఇన్‌స్పెక్టర్ అలా అడుగుతున్నప్పుడే నాగరాజు లోపలకు వచ్చి అక్కడి దృశ్యాన్ని చూసి "పిన్నీ" అంటూ పెద్దగా అరిచి ఆమెమీద పడబోయాడు.

చంద్ర అతడ్ని పట్టుకుని "ముందు నేను అడిగే ప్రశ్నలకు జవాబులు చెప్పండి. ఆమె మామూలుగా మరణించలేదు. హత్య చెయ్యబడింది" అన్నాడు.

హత్య మాట వినగానే నాగరాజు అదిరిపడ్డాడు.

తర్వాత ఇన్‌స్పెక్టర్ అతన్ని కొన్ని ప్రశ్నలడిగాడు.

"సాయంత్రం ఏడున్నర కావస్తున్నప్పుడు నేను యీ యింటినించి బయటకు వెళ్ళాను. వెళ్ళి యిప్పటివరకూ 'హూమ్‌నీడ్స్ సప్లయింగ్ షాపు' దగ్గర కూర్చుని పది నిమిషాలక్రితమే రిక్షాలో ఎక్కి యిక్కడికి వచ్చాను"

అన్నాడు నాగరాజు.

ఇంకో గంట గడిచిన తర్వాత సుందరమ్మ శవంతో యిన్స్పెక్టర్ తన పరివారంతో అక్కడినించి వెళ్ళి పోయాడు యెవర్నీ ఆ యింటినించి కదలవద్దనే ఆంక్ష విధించి.

అలా స్టేషన్‌కు వెళ్ళిన ఇన్స్పెక్టర్ చంద్రను అపరాధ పరిశోధనకు రచనలు చేసే శంకర్ కలుసుకున్నాడు.

కలుసుకుని గిరిజ తనని కలుసుకోవటం—మాట్లాడటం అంతా చెప్పేశాడు.

ఇన్స్పెక్టర్ అంతా విని "మైగాడ్" ఈ హత్య ఎంతో క్లియర్‌గా వుంది. హత్యకు మోటివ్ కూడా తెలిసిపోయింది. కోడలును హత్య చెయ్యాలనుకున్నా అత్తగారే హత్య చెయ్యబడిందంటే ఈ హత్య ఎవరు చేసి వుంటారు? అన్నాడు.

"ఎవరో కాదు సర్. నా అనుమానం ప్రకారం ఈ హత్యను గిరిజే చేసివుంటుంది. అత్తగారు తనని చంపుతుందేమోననే భయంతో ఆమే అత్తగార్ని హత్యచేసి వుండొచ్చు" అన్నాడు శంకర్.

"నిజమే. కాని ఆమె ఆ టైములో సంధ్య డీలక్స్ థియేటర్లో వున్నట్టుగా చెప్పింది. ఎంక్వయిరీ చేస్తేగానీ ఏదీ తెలీదు" అన్నాడు.

మరో పదినిముషాలకే ఇన్స్పెక్టర్ సంధ్య డీలక్స్ థియేటర్‌కు వెళ్ళి అక్కడి గేటుదగ్గర వుండేమనిషికి గిరిజ ఫోటో చూపించి మాట్లాడాడు.

అతను చెప్పిన మాట వినగానే అతనికి ఆశ్చర్యం కలిగింది.

ఎనిమిది గంటలు కావస్తున్నప్పుడే ఆమె థియేటర్లో

నించి బయటకు వెళ్ళిపోయిందిట. మళ్ళీ తిరిగి రాలేదని గట్టిగా చెప్పాడు అతను.

ఇమ్మీడియట్ గా వచ్చి ఇన్ స్పెక్టర్ గిరిజను కలుసుకున్నాడు.

"నిజం చెప్పండి. మీరు ఎనిమిది గంటలు కావస్తున్నప్పుడే థియేటర్లోనించి బయటకు వచ్చారుకదూ!"

తలవంచుకుంది గిరిజ.

"నిజమే....ఎనిమిదిగంటలు కావస్తున్నప్పుడే సినిమా విసుగుపుట్టి బయటకొచ్చాను. మనసు బావుండక అలా పార్కులోకి వెళ్ళి చాలా సేపు కూర్చొని తిరిగివచ్చాను. ఎనిమిదిగంటలకే బయటకు వచ్చానని చెబితే మీరు నన్ను అనుమానిస్తారని అలా చెప్పాను" అన్నది.

ఇన్ స్పెక్టర్ నవ్వాడు.

"ఇప్పుడు కూడా నేను మిమ్మల్నే అనుమానిస్తున్నాను. క్రయిం కథా రచయిత శంకర్ నన్ను కలుసుకుని అంతా చెప్పాడు. మీకు మీ అత్తగారికి మధ్య రగులుతున్న పగ గురించి జరుగుతున్న యుద్ధం గురించి అతను అంతా చెప్పేశాడు. ఇప్పుడు అంతా క్లియర్ అయ్యింది. ఎనిమిదిగంటలకే బయటకువచ్చిన మీరు ఇంటికి వచ్చి ఒంటిగావున్న మీ అత్తగార్ని హత్యచేసి మళ్ళీ బయటకు వెళ్ళిపోయారు. హత్య ఎనిమిది గంటలు దాటిన తర్వాత జరిగివుంటుందని డాక్టర్ అన్నాడు. ఏమీ తెలియనట్లు తొమ్మిదిగంటలు కావస్తున్నప్పుడు ఇంటికి తిరిగి వచ్చారు. ఎనిమిదిగంటలు దాటిన తర్వాత నించీ తిరిగి ఇంటికి వచ్చేవరకూ మీకు ఎలిబీ లేదు. వుండదు కూడా. ఇందులో ఎలాంటి సందేహంలేదు. ఈ హత్యను మీరే చేశారు."

"కాదు.... కాదు...." అంటూ అరిచింది గిరిజ పిచ్చి పట్టినదానిలా.

ఐనా ఇన్‌స్పెక్టర్ నమ్మలేదు. విన్లేదు. ఆమెను కస్టడీలోకి తీసుకున్నాడు.

ఆ రాత్రే గిరిజ తల్లిదండ్రులకు కబురుచేశాడు ఈశ్వర్. అతనికి అంతా అయోమయంగా అనిపించింది. తను గిరిజ అందం చూసి మోసపోయానేమో అనే ఆలోచన వచ్చింది.

# 11

తెల్లవారుతూనే పరిగెత్తుకుంటూ వచ్చారు గిరిజ అమ్మా-నాన్న.

జనార్దనం - జానకమ్మ.

పోలీసు స్టేషన్లో వున్న కూతుర్ని కలుసుకున్నారు. •

"నాన్నా" అంటూ భోరుమన్నది గిరిజ—ఏడుస్తూ.

ఆమెలో వున్న ధైర్యమంతా ఆ రాత్రి పోలీసు స్టేషన్లో గడిపేసరికి జారిపోయింది. ఇక తను ఆ నేరం నించి తప్పించుకోగలననే నమ్మకం కూడా పోయింది.

తనే ఈ నేరం చేసిందనటానికి బలమైన సాక్ష్యంగా తను నమ్ముకున్న కథారచయిత శంకర్ నిలిచాడు.

అతడిని కలుసుకుని తనగోయ్యిని తానే తవ్వుకున్నది-అనుకుంది.

"ఇక ఈ ఉచ్చునుంచి తప్పించుకోలేను నాన్నా.... అన్ని సాక్ష్యాలూ నేనే ఈ హత్య చేసినట్టుగా నిరూపిస్తున్నాయి. మరో మనిషి ఆమెను హత్య చేసే అవకాశం లేదుట. అందువల్ల ఈ హత్యను నేనే చేశానని ఇన్‌స్పెక్టర్ అంటున్నాడు. బహుశ నాకు ఉరిశిక్ష పడొచ్చునని కూడా అంటున్నారు. తప్పితే జీవిత ఖైదు

తప్పదుట....అత్తలు నశించాలని నినాదాలు ఇచ్చాం. కాని ఈ రోజు అత్తలతో పాటు కోడళ్ళం కూడా నశించి పోతున్నాం" అన్నది పెద్దగా యేడుస్తూ....

కూతురి యేడుపు చూసేసరికి వాళ్ళిద్దరికీ దుఃఖం ఆగ లేదు.

"భయపడకు తల్లీ....నువ్వు నిర్దోషివే....తప్పకుండా విడుదల అవుతావు" అన్నాడు జనార్దనం కూతురుకన్నీళ్లు తుడుస్తూ....

## 12

"ఏమిటీ! సుందరమ్మగార్ని మీరు హత్యచేశారా?!" ఆశ్చర్యంగా అడిగాడు ఇన్ స్పెక్టర్ చంద్ర.

"అవును ఇన్ స్పెక్టర్ గారూ.... నేరం కూతురుమీద పడిందని దాన్ని నా తలమీద వేసుకోవటంలేదు. నిజం గానే ఆమెను నేను గొంతునొక్కి చంపాను. ఐతే ఈ నేరం ఆ సమయంలో ఇంట్లోలేని నా కూతురుమీద పడుతుందని నేను అనుకోలేదు" అన్నాడు జనార్దనం.

"వివరంగా చెప్పండి....ఎందుకు చేశారీ హత్య?" అన్నాడు ఇన్ స్పెక్టర్.

అంతా జనార్దనాన్ని ఆశ్చర్యంగా చూశారు.

"నా కూతుర్ని చూసిపోదామని పావు తక్కువ ఎనిమిదిగంటలు కావస్తున్నప్పుడు వచ్చాను. తలుపులు దగ్గరకు మూసివున్నాయి. తలుపులను నెట్టాలనుకుని లోపల్నించి గిరిజ గురించిన మాటలు వినపడేసరికి ఆగి పోయి ఆ మాటలు విన్నాను.

నా కూతురు అత్తగారు సుందరమ్మ అంటున్నది. 'ఈ కోడలు గిరిజ పీడ ఎలాగైనా వదిలించుకోవాలిరా నాగరాజా. ఇది నా కొడుకును గుప్పిట్లో ఇరికించుకుని

వాగీని కీలుబొమ్మను చేసి ఆడిస్తోంది. అట్లాగే నన్ను కూడా ఆడించాలని ఈ ఇంటి పెత్తనాన్ని తనే చెలాయించాలని చూస్తోంది. ఇది బతికివుంటే ప్రమాదం.... ఏ మందో పెట్టి నన్ను పైకి పంపించి ఆ తర్వాత నా కొడుకును దిక్కులేని వెధవను చేస్తుంది. అందుకే దీన్ని పైకి పంపించే ఏర్పాటు ఏదైనా వుంటే చూడరాదూ' అన్నది.

అందుకు ఆ నాగరాజు 'నువ్వు ఈ విషయం గురించి నిశ్చింతగా వుండవే పిన్నీ .... నా చేతిలో ఇద్దరు మనుషులు వున్నారు. నాలుగువేలు మనవి కాదనుకుంటే ఆ గిరిజ బజారుకు వెళ్ళినప్పుడు వెనకనించి వచ్చి పొడిచిపోతారు. ఆ హత్యను మనం చేయించామని ఎవ్వరూ అనుకోరు. ఏ నగలకోసమో ఇంకేదో కారణంగానో హత్య జరిగిందనుకుంటారు. రేపే ఆ మనుషులతో మాట్లాడతాను. నువ్వు డబ్బు సిద్ధంచేసి వుంచు' అని బయటకు వెళ్ళిపోయాడు. నేను చీకట్లోకి క్రోటన్ మొక్కల చాటుకు తప్పుకున్నాను.

వాళ్ళిద్దరి మాటలూ నాలో ఆవేశాన్ని కలిగించాయి. ఆ సుందరమ్మ నేను ఎంతో అపురూపంగా పెంచుకున్న నా కన్న కూతుర్ని కిరాయి రౌడీలతో చంపించాలనుకుంటున్నదని వినగానే ఆమెవల్ల నా కూతురుకు ప్రమాదం వుందని తెలియగానే ముందుగా ఆమెనే చంపాలనుకున్నాను.

వెంటనే ఇంట్లోకి వెళ్ళాను. ఆమె మంచంపైన అటు తిరిగి పడుకున్నది. వెనకనుంచి వెళ్ళి గొంతు పట్టుకొని నొక్కి చంపేసి వేలి ముద్రలు తుడిచి అక్కడినించి తిరిగి మా వూరు వెళ్ళిపోయాను. నన్నెవరూ చూడలేదు

కాబట్టి. అనుమానం నా మీదకి రాదనుకున్నాను. కానీ ఇప్పుడు అనుమానం నా మీదికి రాకపోయినా నిర్దోషి అయిన నా కూతురు దోషిగా నిలబడేసరికి నా అంతట నేనే బయటపడక తప్పలేదు" చెప్పాడు జనార్దనం.

"ఏమండీ. ఇప్పటి ఈ స్థితికి నేనే కారణం" అన్నది ఆయన భార్య జానకమ్మ యేడుస్తూ—

"కాదు. నేనే కారణం" అన్నది గిరిజ కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"అవును. నూటికి నూరుపాళ్ళు మీరే కారణం. చిన్నతనం నించే కుటుంబపెత్తనమంతా ఆడదే చెలాయించాలనే సిద్ధాంతంతో నువ్వు దాన్ని పెంచావు. అదే సిద్ధాంతం కోసం గిరిజ అత్తగారితో యుద్ధానికి తలపడింది. దాని ఫలితం ఇది. నిన్ను, కూతుర్ని అదుపులో వుంచలేని నా అసమర్థత పిల్లిలాంటి నేను ఈ రోజు హంతకుడినయ్యాను. గిరిజా అత్తా ఒకప్పటి కోడలు... ఇవాల్టి కోడలే రేపటి అత్త... అలాంటప్పుడు రేపు నువ్వు కూడా అత్తవే అవుతావు. తప్పుడు స్లోగన్లు, తప్పుడు సిద్ధాంతాల ఫలితం ఎప్పుడూ తప్పుడుగానే వుంటుంది" అన్నాడు జనార్దనం చివరగా—

—: అయిపోయింది: —

# తూనీగ రెక్కలు

## చంద్రశేఖర అజాద్

"అంకుల్, అంకుల్, రవి తూనీగల్ని పట్టుకొని రెక్కలు విరిచేస్తున్నాడు" ప్రక్కింటి రాము వచ్చి కంప్లయింటు యిచ్చాడు.

"రవిని నేను రమ్మంటున్నానని పిలుచుకురా బాబూ" అన్నాడు శ్రీరాములు.

రాము పరుగెత్తాడు.

"ఏంటి నాన్నా" అంటూ వచ్చాడు రవి.

"తూనీగల్ని చంపుతున్నావా?" అని ప్రశ్నించాడు శ్రీరాములు.

"చంపటంలేదు. రెక్కలకు దారం కట్టుకొని ఆడుకుంటున్నాను" రామువంక చూస్తూ చెప్పాడు.

"ఇంకేమైనా ఆట ఆడుకోరాదూ" అన్నాడు.

"సరే" అంటూ పరిగెత్తాడు రవి.

శ్రీరాములు నవ్వుకున్నాడు.

"తిక్క వదిలిందా" అంటూ వెక్కిరించాడు రాము.

రవి కళ్ళు రామువంక తీక్షణంగా చూశాయ్.
వెంటనే రామునివంచి వీపుమీద బలంగా గుద్దాడు.

"అమ్మో" అంటూ నోరు తెరిచి గుక్కపట్టాడు రాము.

"ఏడిచావా, చంపుతా" బెదిరించాడు రవి.

రాము చటుక్కున రెండు చేతుల్తో నోరు మూసుకున్నాడు.

"ఈసారి మా నాన్నతో చెప్పావా ఈ తూనీగ రెక్కలు విరిచినట్టు నీ చేతులు విరిచేస్తా" అన్నాడు తిరిగి.

రాము కళ్ళలో భయం తొంగిచూసింది.

"ఆడుకుందాం రా" అన్నాడు రవి.

"నేను రాను."

"రావా" కోపంగా అన్నాడు.

"వస్తాను. ఏం ఆట."

"తూనీగలాటే."

"నేను ఆడను. తూనీగల్ని చంపితే దేవుడు మన చేతుల్ని తీసుకుంటాడని మా అమ్మ చెప్పింది" అన్నాడు రాము. రవి కళ్ళలో వెంటనే భయం తొంగిచూసింది. అంతలోనే తిరిగి మామూలుగా మారాడు.

"అయితే నువ్వు పో" అన్నాడు.

రాము ఏడుస్తూ తిరిగి శ్రీరాములు దగ్గరకు వెళ్ళాడు.

"మరండి రవి నేను మీకు చెప్పానని కొట్టాడండి. మళ్ళీ చెబితే చంపేస్తానన్నాడండి" వెక్కుతూ చెప్పాడు.

"నేను వాడ్ని కొడతాలే బాబు" అన్నాడు శ్రీరాములు.

"రేపు నన్ను మళ్ళీ కొడితే."

"నేనున్నానుగా" అన్నాడు శ్రీరాములు.

రాత్రికి రవిని దగ్గర కూర్చోబెట్టుకున్నాడు.

"ఏంరా నీకు రాముతో పోట్లాట వచ్చిందా" అనడిగాడు.

"అదికాదు నాన్నా వాడికి తూనీగలు పట్టుకోవటం రాదు. అందుకని నామీద చాడీలు చెబుతున్నాడు" అన్నాడు రవి.

"సరేగాని. రామును కొట్టకు. వాళ్ళ అమ్మవాళ్ళు ఊరుకోరు."

"సరేలే" అన్నాడు రవి.

"పోయి చదువుకో."

రవి వెళ్ళిపోయాడు.

"విన్నావుగా. ఆ రాముకు తూనీగలు పట్టుకోవటం రాదట. అదన్నమాట వాడి ఏడుపు. వాటిని పట్టుకోవాలంటే మంచి వేగం ఉండాలి. మొత్తంమీద మన వాడి దెబ్బ స్ట్రాంగా పడుంటుంది. పైగా వీడు చూడ రాదూ.... చంపుతానన్నాడట" భార్యతో అంటూ నవ్వాడు శ్రీరాములు.

తలుపు చాటునుండి వింటున్నవారి ఒక్కగానొక్క కుమారుడు రవి కళ్ళు గర్వంతో మెరిశాయి.

ఇది జరిగి పదేళ్ళయింది.

## 2

ఆ రోజే క్లాసులు ప్రారంభం కాబోతున్నాయి. అందులో చాలామంది హైస్కూలు జీవితంనుండి తొలిసారిగా కాలేజీ ప్రాంగణంలోకి అడుగిడుతున్నారు. సాధ్యమయినంతవరకు ఎక్కువ భాగం వారికున్న వాటిల్లో మంచి బట్టలు ధరించి వచ్చారు. ఆడపిల్లలంతా ఎంతో

ఆకర్షణీయంగా ఉన్నారు. కౌమార దశనుండి యవ్వనం లోకి అడుగిడుతున్నారంతా. ఒకరికొకరు క్రొత్త. ఇంకా పరిచయాలు కాలేదు.

రవి అక్కడే చదివాడు. అక్కడ హైస్కూలుతో పాటు ఇటీవలనే ఏర్పడిన జూనియర్ కాలేజీ కలిసే ఉన్నాయి. ఇంకా విశాలమైన ఆవరణలో భవనాలు నిర్మించి డిగ్రీ కాలేజీ ఏర్పాటుచేస్తారనుకుంటున్నారు.

రవి కామర్స్ తీసుకున్నాడు. క్లాసులు ఫార్మల్ గా ఆరంభం అవుతున్నాయి.

"ఏయ్ మిష్టర్ సి.యి.సి. రూం యెక్కడుందో చెబుతావా" అడిగాడో విద్యార్థి రవిని.

రవి తీక్షణంగా చూశాడు.

"ఏ స్కూలు నుండొచ్చావ్?"

"ఎం.జి.యం." గంభీరంగా చెప్పాడతను.

అంతే. అతని కళ్ళముందో మెరుపు. పళ్ళు కదిలిపోయాయి. ముక్కు అదిరి రక్తం వచ్చింది. వెంటనే క్రిందపడిపోయాడు. రవి జేబులోనుండి కర్చీఫ్‌తో తుడుచుకొని స్టైయిల్ గా నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

విద్యార్థులంతా కంగారుగా అక్కడకు చేరారు. ఎవరో పరుగెత్తుకెళ్ళి నీళ్ళు తెచ్చి అతని మొఖంమీద జల్లారు.

"ఏం జరిగింది?" అడిగారెవరో.

కర్చీఫ్‌తో మొఖం తుడుచుకున్నాడతను.

"సి.యి.సి. రూం ఎక్కడుందో చెప్పమని అడిగాను. ఏ స్కూలు నుండి వచ్చావన్నాడు. చెప్పాను. మొఖంమీద కొట్టి వెళ్ళిపోయాడు" చెప్పాడతను.

ఒకరి మొఖాలు ఒకరు చూసుకున్నారు.

"ఎవరతను?"

"రవి అని. ఇక్కడే చదివాడు" అన్నారెవరో.

అదే సమయంలో .... రవి తన స్నేహితుల దగ్గర బిగ్గరగా నవ్వుతున్నాడు.

"లేకపోతే ఏయ్ మిష్టరట. ఈ రోజు కాలేజీకి వచ్చాడు. ఆ పోజేమిటి? ఏ స్థూలంటే గొంతులో ఏదో పెట్టుకున్నట్లు .... ఎం. జి. ఎం.....అంట. ఫట్ మంటూ కొడితే కొడుక్కి చుక్కలు కనిపించాయి. క్రిందపడి పోయాడు" అన్నాడు రవి.

"తగాదాలు ప్రారంభం" అన్నాడు శేఖర్.

"గుడ్ స్టార్టింగ్" అన్నాడు సత్యం నవ్వుతూ.

"నాకు తెలిసినంతవరకు మిష్టర్ అనటంలో తప్పు లేదు. నువ్వు తెలుగు భాషని ప్రేమిస్తున్నావని, ఏమండి అనమని చెప్పి ఉండాల్సింది" అన్నాడు శేఖర్.

"ఏడ్చావుగాని....ఇప్పుడు చూడు మన ప్రతాపం కాలేజీ అంతా మనమంటే హడలి ఛస్తారు" అన్నాడు రవి గర్వంగా.

"హిట్లరన్నా జనం భయపడతారు. ఇకనుండి నువ్వు ఊరికే ఆవేశపడటం మానాలి" శేఖర్ సలహా.

రవి, శేఖర్ వంక కోపంగా చూశాడు. అదే సమయంలో శేఖర్ కళ్ళు రవిని ప్రేమగా చూస్తున్నాయి. ఆ చూపుల్లో ఏం శక్తి వుందో రవి కదిలిపోతుంటాడు.

"నిన్ను ఎప్పుడు కొడతానో. పదిరోజులు బెడ్ మీదుండేటట్లు కొడతానురా" అన్నాడు నవ్వుతూ.

"నాకు పది రో జు లు బెడ్ మీదుండాలన్నప్పుడు యెక్కడున్నా వచ్చి నీతో కొట్టించుకుంటాలేరా" అన్నాడు శేఖర్.

"సాయంకాలం సినిమాకు పోదాం" అన్నాడు సత్యం.

"సర్లే" అన్నాడు రవి.

కానీ ఆ సాయంకాలం సినిమాకు వెళ్ళటం సాధ్యం కాలేదు.

మధ్యాహ్నంకల్లా ఎం. జి. యం. స్కూలు విద్యార్థి తరఫున ఓ పదిమంది కాలేజీ దగ్గరకొచ్చేశారు. ఆ కాలేజీ ఆవరణలో విశాలమైన రావిచెట్టు వుంది. అక్కడ సమావేశమయ్యారంతా. వారి నడుమ ఉదయం దెబ్బతిన్న విద్యార్థి ఉన్నాడు. అతని పేరు రమణ. అతను ఏదో చెబుతున్నాడు. వాళ్ళ దగ్గర బెల్టులతోపాటు సైకిల్ ఛెయిన్స్ ఉన్నాయి. ఒకరిద్దరి దగ్గర బాకులున్నాయి. వాళ్ళలో ఒకతను కాలేజీలో అందాల్ని చూస్తానంటూ బయలుదేరాడు. క్లాసు రూముల్లోకి నడుస్తున్నాడతను.

"ఏం బాబాయ్ ఇటొచ్చావ్" అంటూ పలకరించాడు రవి.

అతను సంతోషంగా రవిని కౌగలించుకున్నాడు.

"ఏం లేదు గురూ. మనోడ్ని ఎవరో కొట్టారంట. అసలే వాడి ఆరోగ్యం బాగుండదు. కాలేజీలోకి వచ్చిన మొదటి రోజే స్పృహపోయేట్లు కొట్టారు. అందుకని వచ్చాం" అన్నాడు.

"ఎం.జి.యం. స్కూలా."

"అవును. వాడెవడో తెల్సా నీకు?"

"తెలుసు. నేనే."

అతను మాట్లాడకుండా నోరు తెరిచాడు.

"ఏంటి నాయుడు మనలో మనం కొట్టుకోవటం ఏం బాగా లేదు."

"అతను మనోడేనా?"

"అవును."

"నాకు తెలియదు. రఫ్‌గా మాట్లాడుతుంటే కోపం వచ్చింది."

"అయిందేదో అయింది. మనందరం ఒకటే. ఎదుటి వర్గాల నాయాళ్ని లాగించాలి గుర్తుపెట్టుకో" అన్నాడతను.

రవిని వెంటబెట్టుకొని కబుర్లు చెబుతూ అతనొస్తుంటే దెబ్బలుతిన్న విద్యార్థి "అతనే" "అతనే" అన్నాడు. అందరికీ ఆశ్చర్యంగా ఉన్నా ఎందుకయినా మంచిదనే స్టడీగా నిలబడ్డారు.

"ఒకేయ్. భలే పని జరిగింది. మనోడ్ని కొట్టింది యెవరో కాదు. వీరయ్యనాయుడిగారల్లుడు" సంతోషంగా చెప్పాడతను.

రమణకు అతని ముఖంలో సంతోషం కొంత ఇబ్బందిగా అనిపించింది.

"వీరయ్యనాయుడు నీకెలా వరస" అడిగాడాయన.

"మావయ్య."

"నువ్వు శ్రీరాములుగారబ్బాయివా?"

"అవును."

అతనుకూడా సంతోషించాడు.

రమణ కయోమయంగా ఉంది.

"ఇతను రమణ. మనోడే. ఇకముందు మీరంతా కలిసి ఉండండి" అన్నాడతను.

రవితో రమణను కరచాలనం చేయించాక

"సర్లే నాయుడూ...నువ్వాళ్ళ మేం చెబుతాంలే"

అన్నాడతను రమణ నుద్దేశించి.

రమణ వెళ్ళిపోయాడు.

"ఈయన తెలుసా" అన్నాడు ముందు తీసుకొచ్చిన వ్యక్తి.

రవి అడ్డంగా తలూపాడు.

"xox."

రవికి ఎక్కడో జ్ఞాపకాల మెరుపు. ఎప్పుడో ఓసారి విన్నాడు. పట్నంలో జరిగిన ఓ తగాదాలలో—అతనిదో మరొకతనిదో తల పగిలిందని.

"పద నాయుడూ... మొదటిసారి మనం కలుసుకున్న సందర్భంలో పార్టీ చేసుకుందాం" అన్నాడు xox.

"ఓ రేయ్ నాకు క్వార్టర్... నాయుడూ నువ్వు తాగుతావా" అన్నాడు.

రవి అడ్డంగా తలూపాడు.

"సర్లే బీరు తీసుకుందువుగానిలే. బీరూ... కోడిపలావ్ తీసుకునిరా. సిగరెట్లు కూడా తీసుకురా" అంటూ xox జేబులో నుండి ఓ వంద కాయితం తీసిచ్చాడు ఎవరికో.

రవి వాళ్ళతో పాటు ఆ గదిలోకి వెళ్ళాడు. కూర్చున్నాక xox చెప్పటం ప్రారంభించాడు.

"చూడు నాయుడు. మనందరం ఒక కులంవాళ్ళం. మనమంతా ఒక్కటి. మనకు బలముంది. అయినా వెనకబడి ఉన్నాం. మనవాళ్ళు పైకి రావటంలేదు. ఆ కమ్మనాకొడుకులు చూడు. వ్యాపారాలు వాళ్ళవి. సినిమాలు వాళ్ళవి. పొలాలు వాళ్ళవి. మనల్ని అణగద్రొక్కుతున్నారు. అందుకే మనమంతా కలిసుండాలి. మనవా.. మీద యెవరైనా చెయ్యివేస్తే అది మనవాడిని కొట్టినట్టు కాదు. నాయుడు కులాన్ని కొట్టినట్లు. ఇది గుర్తుపెట్టుకో.

మన కులం కోసం మనం ప్రాణాలిస్తాం. అవసరమయితే ప్రాణం తీస్తాం. ఇదికూడా గుర్తుపెట్టుకో. మీ మావ వీరయ్యంటే ఊరంతా హడలే. మరి నువ్వు కూడా అంత పేరు తెచ్చుకోవాలి" అన్నాడు.

అతను బట్టలు విప్పుతుంటే బొడ్డు దగ్గర వ్రేలాడు తున్న పదునైన కత్తి...బెల్టులా తగిలించిన ఛైయిన్‌ను రవి గమనించాడు. అతను సబ్బుతో మొఖం కడుక్కొని వచ్చాడు. అయినా అతని మొఖంలో ఓ వంతయినా రఫ్‌నెస్ తగ్గలేదు.

ఇంతలో బాటిల్స్ వచ్చాయి. గ్లాసులందుకుని వాటిల్లో పోసుకున్నారు.

"నా కలవాటు లేదు" అన్నాడు రవి.

"ఫర్వాలేదు బీరేగా. కూల్‌డ్రింక్‌లా ఉంటుంది. హాటయితే మెల్లగా తీసుకోవచ్చులే" అన్నాడు గంగ.

రవి గ్లాసెత్తి నోట్లోకి వంపుకున్నాడు. ఎందుకో వంటకడు కాయల రసంలా వుందనిపించింది. రెండు గ్లాసులు త్రాగేసరికి మధురంగా ఉందనిపించింది. పలావు తింటుంటే గంగకు మందు పనిచేయటం ప్రారంభించింది.

రవిలో కుల దృక్పధం....ఆ రోజే బలంగా ఇంజెక్టు చెయ్యబడింది.

# 3

సత్యం తెల్లటి బట్టల్లో మెరిసిపోతూ వస్తున్నాడు. కాలేజీలో రోజా అంత నీట్‌గా డ్రెస్ మెయింటన్ చేస్తుంది అతనే. ఆ చొక్కామీద ఓ హృదయం— దానినుండి దూసుకెళ్ళిన మన్మధ బాణం ఉన్నాయి.

"ఆ బాణం ఎవరిదిరా" అన్నాడు శేఖర్ సత్యం

రావిచెట్టు దగ్గరకు రాగానే.

"మనదే."

"అంటే నీదనా."

"మరి."

"ఆ హృదయమో?"

"సుందరిది."

"అవునులే. నీ జీవితంలో సుందరి టూ నిన్ను ప్రేమించదు. ఆ బొమ్మలతో నే తృప్తిపడు."

నవ్వారంతా.

రవి సిగరెట్టు అవతలపడేశాడు.

"సత్తిగా ఇలా రా" అన్నాడు.

"ఫోరా....నిన్న సినిమాకు వెళ్దాం అని అడ్రసుల్లేవు"

"ఈ రోజు వెళదాంలే" అన్నాడు రవి.

తెల్లటి బట్టల్లో సత్యాన్ని చూస్తుంటే ఎందుకో తెలీని కసి.... లేచి వచ్చి భుజంమీద చేతులు వేశాడు.

"చెయ్యిం తియ్యరా" అంటూ ప్రక్కకు జరిగాడు. అప్పటికే చేతుల మురికి ఆ చొక్కాకు అంటుకుంది.

"ఏంటిరా ఇది. ఇస్త్రీ బట్టలు పాడుచేశావు" అన్నాడు సత్యం కోపంగా.

రవి సంతోషంగా నవ్వాడు.

"కొందరికంతే. తెల్లటి వాటిని చూసినా....నిర్మలంగా ఉన్న వాటిని చూసినా....భరించలేరు." శేఖర్ అన్నాడు.

రవి తీక్షణంగా శేఖర్‌ను చూశాడు.

అంతలోనే....ఆకర్షణ!

"నన్ను విమర్శించే హక్కు నీ కొక్కడికే ఉందిరా" అన్నాడు సత్యం ఓడిపోయినట్లుగా.

"ఈ రోజు ఉదయం ఆటకు 'లవ్ ఇన్ ఆంధ్ర'కు

వెళదాం" అన్నాడు రవి సత్యంతో.

"కామర్స్ లెక్చరర్ వచ్చాడు" అన్నాడు సత్యం.

"ఆయన రేపూవస్తాడు. అది ఈ రోజే చివరి ఆట"

"నువ్వు వస్తావంటరా"

"నేను రానులేరా" అన్నాడు శేఖర్.

ఇద్దరూ సినిమాకు వెళ్ళారు. సత్యం సినిమా చూడ టంలో లీనమైపోయాడు. అకస్మాత్తుగా భుజంమీద చురుక్కుమంది. రవి తెరలు తెరలుగా నవ్వుతున్నాడు. సత్యం బాధగా చూశాడు. సత్యం భుజంమీద రవి సిగరెట్ అంటించాడు. సత్యం కళ్ళలో కనిపిస్తున్న బాధను చూస్తున్న కొద్దీ నవ్వుతున్నాడు. కళ్ళవెంట నీళ్ళు వచ్చి ఆగిపోయాడు.

"ఏంటిరా నువ్వు" కోపంగా అన్నాడు సత్యం.

"సారీ....రా" అన్నాడు రవి నవ్వుతూనే.

"నీకూ కాలుస్తే తెలుస్తుందిరా ఆ బాధ"

"కాల్చరా"

"మేం కాల్చలేం" అన్నాడు సత్యం ఉభావంగా.

"సరదాకి కాల్చాలేరా" అన్నాడు రవి.

"ఇంకెప్పుడూ అలా చేయకు" అన్నాడు సత్యం.

"నాయుడూ" పిలిచారెవరో.

రవి వెనక్కు తిరిగాడు.

"గంగ"

లేచి అటు వెళ్లాడు

"ఆ కమ్మవాడితో నీ స్నేహం ఏమిటి?"

"ఛ....వాడు నా చిన్ననాటి నుండి స్నేహితుడు. మా నడుమ అలాంటివేం లేవు"

గంగ మొఖంలో ఓ క్షణం నిరాశ.

"సర్లే. సాయంకాలం రూమ్‌కొస్తావా?"

"వస్తాను" అని వచ్చేశాడు.

"ఎవర్రా" అన్నాడు సత్యం.

"ఎవరో తెలిసినవాళ్లు" అన్నాడు రవి.

మరుసటి రోజు రావిచెట్టు నీడలో అందరూ సమావేశం అయ్యారు.

"నిన్న సిన్మాహాల్లో సత్తిగాడు సీరియస్‌గా చూస్తున్నాడురా సిన్మా.... ఊరికినే సిగరెట్ లైట్‌గా అంటించాను. ఇక చూడు వాడి చిందులు" అన్నాడు రవి.

అందరూ పగలబడి నవ్వుతున్నారు.

"బాబూ వాడిది శరీరమా అస్బ్రేనా" అన్నాడు గుప్తా.

రవి కళ్ళలో మెరుపు!

చేతిలో సిగరెట్ చివరిదశకొచ్చింది. చటుక్కున లేచి వెళ్ళి గుప్తాను గట్టిగా పట్టుకొని వాడి భుజం మీద నలిపేశాడు.

గుప్తా బాధతో పెద్దగా అరిచాడు.

అందరూ పొట్ట చెక్కలయేట్లు నవ్వుతున్నారు. రవయితే కడుపు చేత్తో పట్టుకొని పొర్లుతూ.... పెద్దగా నవ్వుతున్నాడు.

"అడిది కా....దు....రా....నీ....నీ....ది అస్బ్రే" అని మరింత బిగ్గరగా నవ్వాడు.

గుప్తా నల్లగా ఉంటాడు. అయినా బాధతోనూ.... కోపంతోనూ మరింతగా మాడిపోయింది. అతని ముఖం.

"నువ్వు మనిషివా, రాక్షసుడివా" అంటూ అరిచాడు.

అందరూ మరోసారి బిగ్గరగా నవ్వారు.

"ఏంటిబే. కోపం వచ్చిందా" అన్నాడు రవి.

"కోపం ఎందుకొస్తుంది. నువ్వు సిగరెట్ వాడి భుజం మీద ఆర్పుతుంటే హాయిగా ఉంది. ఒకే రవి నీ పద్ధతులు మార్చుకోకుంటే అదే హాబిట్‌లా మారుతుంది. అసలు ఓ మనిషి బాధపడుతుంటే నీకు కలిగే ఆనందం ఏమిటో అర్థంకావటంలేదు. మనం ఇలాంటి పనులకు నవ్వితే వాడిలానే చేస్తుంటాడు" అన్నాడు శేఖర్ మిగతా వారందరితో.

రవి, శేఖర్ ముఖంలోకి చూడకుండానే

"నోర్మూయ్‌బే. మాటింగిచ్చావు కానీ" అన్నాడు.

## 4

కాలేజీ మొదలయి ఆరు నెలలు గడిచింది.

ఈ ఆరు నెలల్లోనూ రవికి చెంది పది కొట్లాటలు జరిగాయి. పది సందర్భాలలోనూ రవి దెబ్బలకు ఎదుటి వ్యక్తులే గురికావటం జరిగింది. ఆ కొట్లాటలు క్రమంగా కులద్వేషధాన్ని సంతరించుకున్నాయి.

ఇప్పుడు అక్కడ నాలుగు గ్రూపులేర్పడ్డాయి. కమ్మ, నాయుడు, క్రిస్టియన్, ముస్లింలకు చెందినవే అవి. వీటిలో వీటికి తగాదాలు జరుగుతున్నాయి. ఎవరెవరి ప్రాంతాల్లో వారుంటారు. మరొకరి ప్రాంతంలోకి వెళ్ళటం జరగదు. పొరపాటున ఎవరైనా అటువెళ్తే, తల పగలటమో, దెబ్బలు తినిరావటమో జరిగిపోతుంది. ఈ పరిస్థితి కాలేజీ ప్రిన్సిపాల్ గారికి కూడా ఇబ్బందికరంగా ఉంది. అందుకే ఓసారి అందరి తల్లిదండ్రులతో ఓ సమావేశం ఏర్పాటు చేశారు. అయినా ప్రయోజనం లేకుండా పోయింది.

అదలా ఉండగా 'అశోక్' అనే ఓ విద్యార్థి క్రొత్తగా చేరాడు. అతను ఎర్రగా ఉంటాడు. వాళ్ళు అంతకుముందు బర్మాలో ఉండేవారట. వాళ్ళ నాన్న

మిలిట్రీనుండి వచ్చారట. అశోక ఇంగ్లీషులో మాట్లాడ తాడు. యన్.సి.సి డ్రిల్లు బాగా చేస్తాడు. అతను కూడా కమ్మవాడే. మంచి బట్టలు వేసుకొని కాలేజీకి వస్తుం టాడు. సత్యానికి మంచి కాంపిటీషన్ గా తయారయ్యాడు.

వాడితో ఎలా తగాదా పెట్టుకొని కొట్టాలా అని ఆలోచనలో పడ్డాడు రవి.

"ఒరేయ్. ఆ బర్మాగాడు సుందరివంక చూస్తున్నా డురా" అంటూ బాధపడ్డాడు సత్యం.

"సుందరివంక ఎవరైనా చూస్తారు. నీకేమిటి బాధ" అన్నాడు శేఖర్.

"సుందరిని నేను ప్రేమిస్తున్నాను."

"అతనూ ప్రేమిస్తున్నాడేమో"

"వీల్లేదు"

"ముందు సుందరి ఎవరిని ప్రేమిస్తుందో కనుక్కో" అన్నాడు శేఖర్.

"ఈ రోజే లవ్ లెటర్ రాస్తున్నా"

"తెలుగులోనే" అనుమానంగా అన్నాడు శేఖర్.

"మరి ఇంగ్లీషులోనా? అది వాడివల్లేమవుతుంది. అశోక గాడయితేనా" అన్నారెవరో.

"భలేవాడివే. వీడూ రాస్తాడు. ఐ లవ్ యూ అని."

అందరూ నవ్వుకున్నారు.

"లేదురా. గుప్తా గాడు తెలుగులో రాస్తాడు. నేను ఇస్తాను" అన్నాడు సత్యం.

"గుప్తానా" ఫక్కున నవ్వాడు శేఖర్.

"వాడు రాస్తే నిజంగా ప్రేమించినా వెంట నే మానే స్తుంది"

"ఏడ్చావులేవోయ్" అన్నాడు గుప్తా.

"అవునురా. అది ప్రేమలేఖ, ఎకౌంట్ బుక్ కాదు"

ఆ సాయంకాలమే సుందరికి లెటర్ ఇవ్వబోతే "బీ కేర్ ఫుల్" అందిట. అందుకు సత్యం బాధపడలేదు గాని....అశోక కూడా ఈ దృశ్యం చూశాడట. అంచేత ఇమ్మిడియట్ గా 'బర్మాగాడిని' బాదేసి కడుపుమంట తీర్చుకోవాలని సత్యం ప్రపోజల్.

రవి అంగీకారం తెల్పాడు.

కాలేజీ వదిలాక అశోక వస్తున్నాడు. రావిచెట్టు దగ్గరకు రాగానే సత్యం పిలిచాడు.

అశోక్ వచ్చాడు.

"ఏంటిబే నన్ను చూసి నవ్వుతున్నావు" అన్నాడు సత్యం.

"టాక్ పొలైట్ లీ"

"నీకు పొలైట్ ఏంటిబే."

"నేను నిన్ను చూసి ఎప్పుడు నవ్వాను బే బే" అన్నాడు అశోక్.

"ఏంటిరా నస" అన్నాడు రవి.

సత్యం అమాంతం కలియబడ్డాడు. ఆతను కూడా తిరగబడ్డాడు. ఇద్దరికీ దెబ్బలు బాగానే తగిలాయి. కానీ సత్యం, అశోక్ చొక్కాను చించేశాడు.

ఆ చొక్కా అంటే అశోక్కి ప్రాణమూ....సత్యానికి కడుపు మంటానూ....

ఇంతలో కొందరువచ్చి ఇద్దరినీ విడదీశారు.

"ఐ విల్ సీ యువర్ ఎండ్. నాటోన్లీ యూ.... మీ అందరి సంగతి" అంటూ విస విసలాడ్తూ వెళ్ళి పోయాడు.

"అది గాదురా సత్తిగా. ఆడి మొఖంమీద రెండేస్తే

బర్మాముక్కు బద్దలయ్యేదికదా. మినుముల బస్తా పట్టు
కున్నట్లు కుమ్ముతావేంటి" అన్నాడు రవి.

"ఆడికి ఎంతసేపూ ఆ చౌకా చించాలనే యావ
తప్పితే.... దెబ్బలు తింటవాన్ననే సంగతే తెలియక
పోతేనూ" అన్నాడు గుప్తా.

అందరితోపాటు సత్యం కూడా నవ్వాడు.

అశోక్ సేరుగా వెళ్ళి వాళ్ళ నాన్నను సంప్ర
దించాడు. అయన దగ్గర ఓ తుపాకి ఉంది. ఆయనకు
వాళ్ళబ్బాయి 'చౌకా' చింపారని తెలియగానే కోపం
వచ్చింది. తుపాకి తీసుకెళ్ళి కాల్చేస్తానంటూ కూర్చున్నా
డాయన. బర్మా భార్యవచ్చి....

"డోంట్ బీ సిల్లీ....ఇదేం పాకిస్థాన్ యుద్ధంకాదు.
పోలీస్ రిపోర్టివ్వండి" అంది.

వెంటనే అశోక్‌ను తోడ్కొని మొత్తం సత్యంతో
పాటున్న రవి, గుప్తా, సలీం మీద కంప్లయింటుఇచ్చారు.

క్షణాల్లో వారందరినీ కాలేజీ ఆవరణనుండే స్టేషన్‌కు
తీసుకెళ్ళారు. అప్పటికి సాయంకాలం అయింది.

"మున నాయుడు లాకప్‌లో ఉన్నాడంట" ఆజ్ఞెప్పి
ఎవరో పలావు పొట్లాం పంపించారు.

సత్యం చౌదరికి ఛికెన్ కుర్మా....

గుప్తాగారికి అవకాయ భోజనం....

సలీం సాబ్‌కు కైమాకర్రీ....

యస్.ఐ. గారికి ఫోనూవచ్చాయి!

"అబ్బే అలాంటిదేం లేదు. కుర్రాళ్ళు కొట్టుకున్నారు
కదా.... బెదిరించి వదిలేస్తాం"

"అలాగేనండి" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"ఏయ్. కానిస్టేబుల్ వాళ్ళనిటు పిల్చుకురా"

అన్నాడు.

నలుగురూ మెల్లగా నడుచుకుంటూ వస్తున్నారు.

"త్వరగారండి. వెళ్ళిపోతుర్లా ఏమిటా నడక" అంటూ కసిరాడు. అంతా వేగంగా నడిచి వచ్చారు.

"ఒరేయ్. ఇలారా" అని గుప్తాను పిలిచాడు.

గుప్తా భయంగా దగ్గరకెళ్ళాడు.

"పెద్ద రౌడివా.... కొట్లాడుతున్నావట...." అంటూ కర్రతో ఒకటి వేశాడు.

"నేను కాదండి. సత్యమండి" అన్నాడు కంగారుగా.

"పది గుంజీళ్ళు తియ్యి" ఆజ్ఞాపించేడాయన.

సత్యంమీద కసిగానూ.... యస్.ఐ.గారి మీద భయంతోనూ గుంజీళ్ళు తీశాడు. మిగతావాళ్ళకి నవ్వు వస్తోంది కానీ....నవ్వితే ఎక్కడ బాదేస్తాడోనని అణిచి పెట్టుకుంటున్నారు.

"సత్యం ఎవరు?"

"నే నేనండి" అన్నాడు సత్యం.

"నువ్వేనా అశోకను కొట్టింది"

"అతనే ముందు కొట్టాడండి"

"అతని చొక్కా చించావట"

"నా చొక్కా నే చించాడండి"

"ఓరి అసత్యం. మీ మొఖాలు తగలెయ్యా. చదువు లెటూ రావు. కొట్టుకోవడం కూడా రాదా. ఆడాళ్ళు జాకెట్లు చించుకున్నట్లు చించుకున్నారు సిగ్గులేదూ"

"కిస్ కా బేటా హై రే తూ" అన్నాడు సలీంను చూస్తూ.

"సారాకొట్టు ఇమాంకా సాబ్"

"మందు పీకే గయా రే తూ... "

"సై సాబ్"

"మీ అందరూ గుంజీళ్లు తియ్యండి."

రవికి అవమానం అనిపించింది. ఒకరి మొఖాలొకరు చూసుకున్నారు.

"సారు" అరిచాడు.

గుప్తాతోపాటు అందరూ తియ్యటం ఆరంభించారు.

"నువ్వాపు" అన్నాడు గుప్తాని....

"ఇంక చాలు ఆపండి. ఈసారి పిచ్చివేషాలు వేశారో నాలుగు రోజులు సెల్ లో త్రోయించి....రిజిస్టర్ లో ఎక్కించి....మీ ఫొటోలు సెంటర్లో తగిలిస్తా....సంఝే" అన్నాడు.

తలలూపారంతా.

"పొండి" అరిచాడు.

బయటకురాగానే అందరికీ కడుపుబ్బేంత నవ్వొచ్చింది. గుప్తాకి మాత్రం నవ్వు రాలేదు.

"ఏరా దొంగనాకొడకా నీ మూలంగా నేను దెబ్బలు తిన్నాను" అంటూ సత్యం మీద లేచాడు గుప్తా.

"అది సరేగాని మనం గుంజీళ్లు తీశామని ఎవరికీ చెప్పొద్దు" అన్నాడు రవి.

"గుప్తాగాడు తీశాడని ముందే చెబుతారు. ఇప్పుడేమో ఇలా మాట్లాడుతారు" అన్నాడు గుప్తా నిరసనగా.

"లేదులేరా. ఇప్పుడందరం తీశాంగా" అన్నారంతా.

## 5

"నాయుడూ....నువ్వా సత్యం కోసం జైలుకెళ్ళటం ఏం బాగుండలేదు. కమ్మనాకొడుకులతో నీకేమిటి పని. నువ్వు మా మాటవిని వాళ్ళతో స్నేహం మానాలి" అని గట్టిగా చెప్పాడు గంగ.

"ఏరా స్టేషన్లోకి వెళ్లొచ్చావట. దేశవాళ్ళ కోసం తగాదాలకెళుతున్నావా" అన్నాడు వీరయ్య. ఆయన దృష్టిలో దేశవాళ్ళంటే అర్థం వేరే కులం అనే.

శ్రీరాములుగారేం మాట్లాడలేదు. ఆయన రవి గురించి పట్టించుకోవడం మానేసి చాలా కాలమయింది.

"ఏరా నీకు బుద్ధుందా....నువ్వా, ఆ శేఖర్ గాడు కమ్మవాళ్ళైనా! ఆ తెగలందరూ ఒకటిగా ఉంటుంటే మీకు బుద్ధి లేకపోయే. వాళ్ళలో ఎవడిమీదన్నా దెబ్బ పడనీ, అందరూ కట్టగట్టుకొస్తారు. మరి మనలో ఐకమత్యం ఏడిచిందా. మీలో మీరు కొట్టుకు ఛస్తారా. ఇక నుండైనా వాడితో స్నేహం మానండి" అంటూ సత్యం వాళ్ళని కోప్పడ్డారు కొంతమంది పెద్దలు.

గుప్తాను సలీంను కూడా వారివాళ్ళు బాగా తిట్టారు. ఆ కాలేజీలోనూ, పట్టణంలోనూ ఎన్ని గ్రూపులున్నా. కులాలు పేరుతో కొట్టుకుంటున్నా, వీరంతా స్నేహంగా వుంటారు. ఈ మాటలు వారి స్నేహబృందాన్ని ఏ మాత్రం త్రెంచలేకపోయాయి. ఆ రోజు....

వై.పి.సి. గ్రూపు అమ్మాయిలంతా నడిచి వెళ్తున్నారు.

"చిలకపచ్చ చీరకట్టు" అంటూ పాడుతున్నాడు రవి.

చివ్వున వెనక్కు తిరిగింది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయి అదే చీరకట్టుకొని వుంది.

"మిష్టర్ వళ్ళెలా ఉంది."

"ఏంటే వాగుతున్నావు. కోస్తా" అంటూ ముందుకు పోబోయాడు రవి.

"డోంటాక్ రబ్బిష్. నీ అంతు చూస్తా" అందా

అమ్మాయి రౌద్రంగా.

"ఏంటే నువ్వు చూసేది" అంటూ మీదకు పోబో యాడు.

శేఖర్ వాళ్ళంతా కలిసి రవిని బలవంతంగా నెట్టు కుంటూ అవతలకు తీసుకెళ్ళారు. ఆ అమ్మాయి ఏడుస్తూ లోపలకు పరిగెత్తింది. క్షణాల్లో ఈ వార్త దావా నంలా వ్యాపించింది.

"రవీ .... దిసీజ్ టూ మచ్. నీ ప్రవర్తన ఏం బాగుండలేదు" అన్నాడు శేఖర్.

"దాని ప్రవర్తన బాగుందా?"

"అదిగో ముందా భాష వదిలెయ్. స్త్రీలను గౌర వించటం నేర్చుకో. ఆడవాళ్ళపట్ల ఆ రఫ్ నెస్ ఏమిటి? ఆ అమ్మాయి మీదికెళుతున్నావు. కొడదామనా! ఎవరన్నా వింటే ఎంత చెండాలంగా వుంటుంది."

"నా కనవసరం. నన్ను ఎవరేమైనా అంటే సహించను."

"నీకేమిటోయ్. అందరికీ ఆ ఆత్మాభిమానం వుం టుంది. ఆ అమ్మాయి ఆకుపచ్చచీర కట్టుకొని వుంది. అందుకే ఆమె గురించి పాడుతున్నావనుకుంది. ఆమెను కాదని నువ్వు చెప్పి ఉండాల్సింది."

"ఇప్పుడేమంటావ్?"

"ఏం అంటున్నానో అర్థం కావటంలేదా. నీలో శాడిస్టు లక్షణాలు ముదిరిపోతున్నాయి. సిగరెట్ అంటించి, బేడతో కోసి ఆనందించేది మనుషులు కాదు. గుర్తుంచుకో."

"షటప్" అరిచాడు రవి ఆవేశంతో.

అప్పుడే చూశాడు శేఖర్ కళ్ళలోకి.

"ఇంకా అరువు. ఒక్క విషయం రవి. నువ్వు నన్ను కొట్టినా చంపినా బాధపడను. నీలో ఈ మానసిక ప్రవృత్తి ఛేంజ్ కాకుంటే సమాజానికి నువ్వు భారంగా తయారవుతావు. మైండిట్" అంటూ వెళ్ళిపోయాడు శేఖర్.

రవి వెంటనే సిగరెట్ వెలిగించాడు. నిమిషాల్లో అయిపోయింది. తిరిగి మరొకటి వెలిగించాడు. శేఖర్ మాటలు మారుమ్రోగుతున్నాయి. క్లాసుకు వెళ్ళినా కూర్చోలేకపోయాడు. బయటకు వచ్చేశాడు. రావిచెట్టు దగ్గరకు రాగానే క్రమ్మేశారు పదిమంది.

"ఏరా మా చెల్లాయి నేదో అన్నావట." అన్నాడతను.

"మాటలు మర్యాదగా రానీ" అన్నాడు రవి.

"నీకేమిటిరా మర్యాద" అంటూ ఛెయిన్ తీసి తల మీద కొట్టాడు. 'ఫటక్'మంటూ శబ్దం వినిపించింది.

"అబ్బా" అంటూ తలమీద చెయ్యి పెట్టుకున్నాడు.

ఛెయిన్ తిరిగి చేతిమీదపడి చురుక్కుమంది.

తలనుండి రక్తం కారుతుంది.

ఓ చెయ్యి మొఖానికి మరో చెయ్యి తలకు అడ్డంగా పెట్టుకొని కూర్చుండిపోయాడు. తలో దెబ్బ వేస్తున్నారు. చొక్కా చినిగిపోయింది. వీపుమీద గీసుకుపోయింది. కొంచెంసేపు కొట్టాక....

"జాగ్రత్త నా కొడకా. ఈసారి పిచ్చిగా ప్రవర్తిస్తే ప్రాణాంతీస్తాం" అని వెళ్ళిపోయారంతా.

ఈ వార్త వినగానే విద్యార్థులంతా పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ అమ్మాయికి కూడా ఈ వార్త తెలియగానే అమాంతం క్లాసునుండి వచ్చేసింది. వాస్తవానికి ఈ

విషయం ఆమె తన అన్నకు చెప్పనేలేదు. ఉదయం ఆ సంఘటన జరగటం.... వార్తలు వెళ్ళిపోవటం.... వాళ్ళు వచ్చి కొట్టి వెళ్ళిపోవటం జరిగింది.

రవి మగతగా పడివున్నాడు. రిక్షాకోసం ఒకతను సైకిల్ వేసుకుని వెళ్ళాడు. ఆ అమ్మాయి తన కర్చీఫ్‌తో రవి మొఖంమీద కారుతున్న రక్తం తుడిచింది.

ఆ సంఘటనకు విద్యార్థులంతా కదిలిపోయారు.

రిక్షా వచ్చింది.

రవిని హాస్పిటల్‌కు తీసుకెళ్ళారు.

మూడు కుట్లు పడ్డాయి.

రవికి కుట్లువేసేదాకా ఆ అమ్మాయి అక్కడే వుంది. ఆ తర్వాత వెళ్ళిపోయింది. రవి మిత్రులు ఈ విషయం తెలియచేశారు.

రవి ఆలోచిస్తున్నాడు. జీవితంలో తొలిసారిగా అతని శరీరంమీద చైయిన్ దెబ్బ పడినప్పుడు బాధంటే ఏమిటో అర్థం అయింది. తాను కొడుతుంటే, కాలుస్తుంటే ఇంతగా బాధపడతారు కాబోలు ననుకున్నాడు. తన రక్తం తుడిచిన ఆ అమ్మాయిని తలుచుకుంటే సిగ్గుతో కదిలిపోయాడు. ఆమెపట్ల తన ప్రవర్తన సమంజసంగా లేదనుకున్నాడు. శేఖర్ మాటలు గుర్తొచ్చాయి.

నిజమే. తనలో ఓ విధమైన రాక్షసత్వం చిన్ననాటి నుండే ప్రవేశించింది. ఒక్కసారే తాను రెక్కలు విరిచిన తూనీగలు, తాను కోజా కొట్టే రాము ముఖం జ్ఞాపకం వచ్చారు. ఎదుటి వాడిని హింసించి ఆనందించాలనే తత్వం తనలో ప్రబలమయింది. అలాంటి పనుల నుండి, ఆలోచనలనుండి బయటపడాలి.

రవిలో రేఖామాత్రంగా కలిగిన ఆ ఆలోచన కార్య

రూపం దాల్చలేదు.

పట్టణంలోనే రెండు గ్రూపులుగా విడిపోయారీ సమస్యమీద. రవి తల పగలటం ఓ కులసమస్యగా తీసుకున్నారు. ఆడపిల్లను అల్లరిచేసేంత స్థాయికి ఎదగటంపట్ల తిరిగి ఆ కులంవారిలో ఆందోళన చెలరేగింది. ఈ సమస్యను సంప్రదింపుల ద్వారా కాక బలాబలాల ద్వారానే తేల్చుకోవాలని యెవరికి వారు నిర్ణయించుకున్నారు.

"మన నాయుడికి నాలుగు కుట్లు పడ్డాయి. వాడికి ఆరుకుట్లు పడాలి. ఇది జరక్కపోతే మన మెవరం నాయుళ్ళమే కారు" అంటూ శపథం చేశారు కొందరు.

రవి ఆ రోజు మొదటిసారిగా హాట్ సేవించాడు. అతని కళ్ళముందు ఆ అమ్మాయి శేఖర్ కనిపించారు. అంతలోనే, ఆ వాతావరణంలో వారిని తన మనోపథం నుండి బలవంతంగా చెరిపేసుకున్నాడు.

పథకం సిద్ధం అయింది.

సరిగ్గా నెలరోజులకు క్రొత్త సినిమాచూసి వెళుతున్నాడు ఆ అమ్మాయి అన్న. దారి కాచి భయంకరంగా కొట్టేశారు. స్పృహలేకుండా రక్తపు మడుగులో పడుంటే ఎవరో హాస్పిటల్లో చేర్పించారు. కష్టంమీద అతను బ్రతికి బయటపడ్డాడు.

తిరిగి కత్తులు తారాస్థాయి నందుకున్నాయి. పట్టణంలో 144వ సెక్షన్ విధించారు. రవి కాలేజికెళ్ళటం మానేశాడు. అతని సమయం అంతా గంగ రూంలోనే గడిచిపోతోంది.

అక్కడకు రకరకాల వ్యక్తులు వచ్చేవారు. పేకాట త్రాగటం జోరుగా సాగిపోతుండేవి. అక్కడే రవికి వివిధ వ్యక్తులతో పరిచయం అయింది. అతని పరిధి ఆ

పట్టణందాటి ఆ చుట్టుప్రక్కల గ్రామాలకు విస్తరించింది.

ఓసారి ఏదో కొట్లాట సందర్భంగా.... ఓ గ్రామం వెళ్ళారంతా.... ఆ కొట్లాటలో ఒకతను రవి కళ్ళముందే చచ్చిపోయాడు.

అప్పటిదాకా ఎవరన్నా కొట్టాల్సివచ్చినా అంతగా ఆలోచించేవాడు కాదు రవి. కానీ మనిషిని చంపటం పట్ల యెందుకో తెలియని భయం ఉండేది.

ఇప్పుడది కూడా తొలిగిపోయింది.

పూర్తిగా కాలేజీకి వెళ్ళటం మానేశాడు.

అతనికి కావలసిన మందు, భోజనం KGK రూంలోనే లభిస్తున్నాయి. క్రొత్తగా అలవాటయింది మగువ. రవికి వారిని అనుభవించటంలోనూ రాక్షస పద్ధతులే అలవాటయ్యాయ్. అందుకు కారణం అతని సహచరులు. వారు స్త్రీలను ట్రీట్ చేసే విధానం.... స్త్రీల గురించి నీచంగా మాట్లాడుకునే తీరు అతన్ని మార్చాయి. డబ్బుకు లోటుండేదికాదు. ఎంతకావాలంటే అంత వస్తుండేది. అప్పుడప్పుడు చిన్నా, పెద్దా కొట్లాటలు సాగుతూనే ఉన్నాయి.

రవి ఇప్పుడు పూర్తిస్థాయి రౌడీగా ఎదిగాడు.

సత్యం, శేఖర్ తదితరులు వేరే చోటుకి చదువుల కోసం వెళ్ళిపోయారు.

ఆ పట్టణంలో ప్రధానంగా ఇరువర్గాల నడుమ కక్షలు రగుల్కొంటున్నాయ్. అయితే చాలా నిశ్శబ్దంగా.... బ్రద్దలవనున్న లావాలా ఉంది వాతావరణం.

## 6

"మమ్మల్ని వ్యాపారాలు చేసుకోనివ్వటంలేదు. మామూళ్ళు యివ్వలేక ఛస్తున్నాం."

"హోటల్‌కొచ్చి నానా ఆగడం చేస్తుంటారు. ఇచ్చింది చాలదు. ఇంకా కావాలని డిమాండ్. కాదంటే యే ఈగనో చంపి రభస. ఒక్కోసారి బిల్లులు కూడా ఇవ్వటంలేదు."

"ఆ రవిగాడి, గంగగాడి అండ చూసుకుని వాళ్ళు చేసేపనులు మరీ దారుణంగా ఉన్నాయి. సినిమాలు చూడనీయరు. ఆడవాళ్ళని ఒకటే గొడవ. మొన్నా నడుమ ఓ మధ్యవయస్కురాలిని బలవంతం చేయబోయారట. ఈ గొడవలు ఇలానే సాగితే భరించటం కష్టం."

పట్టణంలోని కొన్ని వర్గాలు తీవ్రంగా అశాంతి చెందాయి. వాస్తవానికి రవి పేరునా, గంగ పేరునూ చాలామంది వాడుకున్నారు. ఎవరెవరినో కొట్టాలంటే ఇంతివ్వండి అంటూ వసూలు చేసిన సందర్భాలూ ఉన్నాయి. ఇలాంటి విషయాలేం రవికి తెలియదు. రవి పూర్తిగా నిషాలో ఉండటానికి అలవాటు పడ్డాడు.

రవి, గంగను అమితంగా ప్రేమించేవాడు. గంగలో ఓ విధమైన నిజాయితీ వుంది. అతనికి కులం అంటే పిచ్చి అభిమానం. ఆ విషయాల్లో తలదూరిస్తే మూర్ఖంగా తెగిస్తాడు. మిగతావారిలో అలాంటి దృక్పథం కనిపించేదికాదు. వారి కుల దృక్పథం సైతం కుట్రలతోనిండి ఉండినట్లనిపించేది. ప్రతి విషయానికి వీళ్ళని వాడుకోవటాన్ని రవి గమనించేవాడు. అయినా రవి ఆ పరిస్థితులనుండి బయటపడలేక పోయేవాడు. అంతగా కూరుకుపోయాడు వాటిల్లో.

గంగ, రవి పట్ల వారి కులంలోనే చాలామందికి సానుభూతి లేదనే విషయం వారికి తెలీదు. అలాంటివారంతా

పట్టణంలోని అనిశ్చిత పరిస్థితులపట్ల ఆందోళన చెందు తున్నారు. యే క్షణాన ఏమవుతుందో తెలియదు. చాలా సందర్భాలలో అమాయకులు దెబ్బలు తింటున్నారు. కాగా ఈ పోట్లాటలు సమసిపోయి ప్రశాంత వాతా వరణం ఏర్పడాలని వారంతా కోరుకుంటున్నారు.

ఇప్పుడు ఆ పట్టణంలో వర్గాలలో మార్పులొచ్చాయి. కొంతమంది చదువుల నిమిత్తమో, జీవితంలో సెటిల్ అయ్యే నిమిత్తమో వేరే వేరే ప్రాంతాలకు వెళ్ళి పోయారు. వారు వెళ్ళటంతో ఆయా కులాల ప్రాభవం అణిగిపోలేదు. క్రొత్తవారొచ్చి ఆ స్థానాన్ని భర్తీ చేశారు.

ఇప్పుడు కమ్మవారికి చెందిన యువకులు మరీ ఉద్రేక పూరితంగా ఉంటున్నారు. వాళ్ళంతా ఏదో ఒకటి చేసెయ్యాలనే ధోరణిలో ఉన్నారు. అందుకే వారంతా మంతనాలు సాగిస్తున్నారు. ఇటీవల రవి వర్గానికి, క్రిస్టియన్ యువకులకూ నడుమ తగాదాలు జరుగుతున్నాయి. అందుకని తాత్కాలికంగా అయినా కమ్మవారూ, క్రిస్టియన్లు ఐక్యం అయ్యారు. ముస్లింలు మాత్రం తటస్థంగా ఉండిపోయారు.

ఇలాంటి బాపతు జనానికి చెంది కొలబద్దలుంటాయి. ఆయా వర్గాలకు ఒకరో, యిద్దరో నాయకులుంటారు. వారికెప్పుడూ ప్రచారం లభిస్తుండాలి. అందుకు అవసర మయినా లేకున్నా కొన్ని కొట్లాటలు సృష్టించబడు తుంటాయి. ఊర్లో టెంక్షన్ మొదలవుతుంది. కొన్నాళ్లు అటూ, యిటూ ఎడా పెడా ఖర్చు చేస్తారు. తిరిగి కొన్నాళ్ళు స్తబ్ధత....ఆ తర్వాత తిరిగి మొదలు. ఈ సంఘటనలన్నీ కలిసి ఓ పతాక సన్నివేశానికి ప్రాణం

పోతుంటాయి.

కొన్నాళ్ళు ఓ వర్గం వెలుగుతుంది. అది శాశ్వతం అనుకుంటారు. మరి కొన్నాళ్ళకి ఇంకోవర్గం తలెత్తుతుంటుంది. అదో ప్రాసెస్‌లా జరుగుతుంటుంది.

ప్రస్తుతం పరిస్థితి అదే.

ఇప్పుడు రాజ్యమెవరిది? అది నిర్ణయించుకోవటానికే సిద్ధపడ్డారంతా.

"రవినీ, గంగనూ లేపెయ్యాలి" నిశ్చయానికొచ్చేశారు.

అదంత సులభంగా జరిగే విషయంకాదు. అందుకు ఓ పథకం రచించాల్సి ఉంటుంది. ఎవరి కోటల్లో వారు ఉంటున్నారు. అవి అత్యంత భద్రంగా ఉంటాయి. నేరుగా దండెత్తి వెళ్ళి జయించటం ఎవరికీ సాధ్యం కాదు. అందుకు కుట్ర ఒక్కటే మార్గం—ఎవరికయినా.

వాళ్ళని ఈ ప్రపంచం నుండి పంపెయ్యాలని నిర్ణయించుకొన్నాక వారి కార్యక్రమాల్ని పరిశీలించటానికి రహస్యంగా నిర్ణయించబడ్డారు కొందరు.

దాదాపు నెలరోజులు అన్నీ గమనించి వారు రిపోర్టు అందచేశారు. దాని ప్రకారం ఉదయం ఎనిమిదిగంటలకు లేక పదిగంటలకు రవి, గంగ వాళ్ళ రూముకొస్తాడు. అక్కడ చాలామంది ఉంటుంటారు. ఆ గదిలో మారణాయుధాలు ఎప్పుడూ తయారుగా ఉంటాయి. అక్కడ కొట్లాట జరిగితే వారిదే పైచేయిగా ఉంటుంది. తిరిగి ఏ రెండు గంటలకో ఇంటికి వెళతాడు. రూమునుండి ఇంటికి వెళ్ళే త్రోవలో ఓ అవకాశం లభించవచ్చు. అయినా అప్పుడుకూడా రవి వెంట ఒకరిద్దరు ఉంటూనే వుంటారు.

తిరిగి సాయంకాలం ఆరుగంటల ప్రాంతంలో దుర్గా

మహల్ ప్రాంతానికి వస్తుంటాడు. అప్పుడు కూడా అవకాశం ఉంటుంది. అయితే వెంటనే పని ముగించుకోవాల్సి ఉంటుంది. దుర్గామహల్ ప్రాంతం పూర్తిగా వారిది. ఆ చుట్టుప్రక్కల షాపుల్లోనూ, ఇళ్ళల్లోనూ ఎప్పుడూ ఆయుధాలు రెడీగా ఉంటాయి. క్షణాల్లో ఎలాంటి పరిస్థితినయినా అక్కడ ఎదుర్కొంటారు.

ఈ సందర్భాల్లో ఏ మాత్రం అనుమానం కలిగినా పరిస్థితులు అనుకూలించవు.

క్లుప్తంగా వారి పరిశోధనా సారాంశం అది. విషయాలన్నీ అత్యంత రహస్యంగా జరిగాయి. పట్టణంలో అంతకుముందే జరిగిన కొట్లాట టెంక్షన్ లో వాళ్ళున్నారు.

ఆ రోజు జరిగిన రహస్య సమావేశంలో ఆదివారం నాడు ముహూర్తం నిర్ణయించారు.

సాయంకాలం ఆరుగంటల ప్రాంతంలో....రవి ఇంటి నుండి బయలుదేరుతాడు. ఆ సందర్భంలో సాధారణంగా వంటరిగానే ఉంటాడు. స్కూటర్ మీద ఇద్దరో ముగ్గురో వెళ్ళి క్షణాల్లో పొడిచేసి వెళ్ళిపోతారు. అతనితో పాటు వేరెవరైనా ఉంటే వాళ్ళని కూడా పొడిచెయ్యాలి. అప్పుడు అవకాశం లేకుంటే....దుర్గామహల్ నుండి వెళ్ళేటప్పుడు ఎవరోకర్ని, లేదా ఇద్దర్నీ లేపెయ్యాలని నిశ్చయించుకున్నారు.

రవికి మృత్యువు ఎదురవుతుందని తెలియదు. అతను రొటీన్ కార్యక్రమంలో ఉన్నాడు.

## 7

"శేఖర్" ఆప్యాయంగా అన్నాడు రవి.

చాలాకాలం తర్వాత వారు కలుసుకున్నారు. రవికి తన కాలేజీ రోజులు గుర్తుకొచ్చి కళ్ళవెంట నీళ్లొచ్చాయి.

"ఓరేయ్ రవి. నువ్వు చాలా మారిపోయావురా, నిన్నిలా చూస్తుంటే మిత్రుడిగా నాకు బాధ కలుగుతుంది. నువ్వు తాగుతున్నావు. వ్యభిచరిస్తున్నావు. ఊర్లో అందరి దృష్టిలో నువ్వో రౌడీవి. నీకు తెలుసా లేదో నీ పేరుతో మామూళ్ళు వసూలు చేస్తున్నారట. నీకు హృదయం లేదని, నువ్వో రాక్షసుడివని జనం అనుకుంటున్నారు. కానీ రవి నీ హృదయం నాకు తెలుసు. నిన్నిలా తయారు చేసింది వీళ్ళే. నీ కెప్పుడూ మారే అవకాశం ఇవ్వలేదు. కులం పేరుతో నిన్ను రెచ్చగొట్టి నిన్నో నాయకుడ్ని చేశారు. నీ మూలంగా నా కులంలో ఎవరికైనా మంచి జరిగిందా!

అసలీ కులం కొట్లాటలు ఎవరికోసం! ఎవరి లాభం కోసం! నువ్వాలోచించు. రవీ....సత్యం....గుప్తా....సలీం మనవే కులాలురా. మన స్నేహాన్ని నిలిపింది కులమా? ఒరేయ్ ఈ రోజు నీకు హాయిగా గడిచి పోతోంది. మేం చదువుకొని నిరుద్యోగాలుగా ఉన్నాం. మేమంతా కూడా కొట్లాడాలిరా బ్రతుకు తెరువుకోసం. మనమంతా ఐక్యంగా పోట్లాడాలి. కాని ఏం చేస్తున్నాం? కులాల పేరుతో కొట్టుకుంటున్నాం. బలివుతుంది ఎవరు? మనమేరా! మీ తగాదాల్లో ప్రాణాలు కూడా పోతుంటాయి. కాని ఏ ధ్యేయంకోసం ఆ త్యాగాలు! ఆలోచించు. నీకూ బాధ్యత ఉంది. నువ్వూ జీవితంలోకి రావాలి. రేపు నీ పిల్లలికి నేర్పాలి" అన్నాడు శేఖర్.

ఆ మాటలు రవి హృదయంలోకి చొచ్చుకు పోతున్నాయి.

సాయంకాలం ఆరుగంటలు దాటుతోంది. శేఖర్ ఆ

రోజే రావటం జరిగింది. ఊళ్లోవున్న మిత్రుడు రవి ఒక్కడే. అందుకే రవిని తీసుకొని పొలాలగట్లమీదకు వెళ్ళాడు. చిన్ననాటి సంగతులన్నీ చెప్పుకుంటుంటే వారికి కాలం తెలియనేలేదు. చాలాకాలం తర్వాత రవి మనసు ఆ రోజే ప్రశాంతంగా ఉంది. కుట్రలూ.... తగాదాలనుండి ఆ రోజు విడివడింది.

"మరి నేను వెళతానురా" అన్నాడు రవి.

"రవీ, నువ్వు మారుతావనే నమ్మకం నాకుంది" అన్నాడు శేఖర్ ఆప్యాయంగా.

"మారతానురా. తప్పకుండా మారతాను" అన్నాడు రవి. ఆ మాటల్లో బాధ స్పష్టంగా ఉంది. రవికి తన తలకంటిన రక్తం తుడిచిన అమ్మాయి గుర్తొచ్చింది.

"మరలా మనం కలుసుకునేదెప్పుడో" అన్నాడు శేఖర్.

రవి నవ్వి.... శేఖర్ చేతిని ఆప్యాయతతో నొక్కి బయలుదేరాడు. సరాసరి ఇంటికొచ్చి స్నానం చేశాడు. హాయిగా ఉంది. ఆరోజింక బయట కెళ్ళాలనిపించలేదు.

అంతలో దూసుకొచ్చిందో రిక్షా. అందులోనుండి కంగారుగా ఇద్దరు క్రిందికి దూకారు.

"నాయుడూ, గంగను పొడిచేశారు"

"ఎప్పుడు?" ఆదుర్దాగా అన్నాడు.

"ఇరవై నిముషాలవుతోంది"

"ఎక్కడ?"

"దుర్గామహల్ దగ్గర. ప్రాణం పోయింది."

వరసగా తలమీద పిడుగులు పడుతున్నట్లయింది. చటుక్కున లేచి చొక్కా వేసుకొని వాళ్ళ గదివైపుకు

రిక్షాలో బయలుదేరాడు రవి.

ఆ సమయంలోనే అంతా కరచాలనం చేసుకున్నారు సంతోషంతో.

“అసలు ఈ రోజు రవిగాడు అడ్రస్ లేడు. ఏమయి పోయాడో” అన్నారెవరో.

“వాడ్ని కూడా లేపేస్తే పీడా వదిలేది” అన్నాడింకో వ్యక్తి. ఆ గదినిండా మందువాసన.

ఆ రోజు సాయంకాలం ఆరుగంటలకు మ్యాట్నీ చూసి ఇంటికి వెళుతున్నాడు గంగ. క్షణాల్లో ఈ వార్త తెలిసి పోయింది. లుంగీ విగాదున్నాడతను. రివ్వున దూసుకొచ్చింది స్కూటర్. సడన్ గా వారిని చూడగానే పరిగెత్తబోయాడు గంగ. లుంగీ అడ్డం పడింది. కూలి పడ్డాడు. ఈలోపు అతని స్నేహితుడు పారిపోగల్గాడు. లుంగీ విసిరేసి నగ్నంగా పారిపోవటానికి గంగ మనసు ఒప్పుకోలేదు. అలాగే కూర్చుండిపోయాడు.

ఆ లోపు బలంగా కడుపులో ఒకటి....వీపుమీద.... డొక్కలో బలంగా కత్తిపోట్లు. క్షణాల్లో వెళ్ళిపోయారంతా. రక్తపు మడుగులో గంగ! ఆ ముగ్గురినీ గంగ స్నేహితుడు చూశాడు.

పొడిచేసిన ముగ్గురూ ఊరువిడిచి వెళ్ళిపోయారు. ఏ పరిస్థితినయినా ఎదుర్కోవటానికి వాళ్ళు రంగం సిద్ధం చేసుకున్నారు.

ఆ రోజు రవి, గంగను తలుచుకొని భోరున ఏడుస్తూనే ఉన్నాడు. మిగతావారికి బాధగా ఉన్నా....గంగ గురించి నిజాయితీగా బాధపడింది రవి ఒక్కడే.

పోస్టుమార్టం అయ్యాక శవాన్ని ఊరేగించారు.

ఘనంగా దహనక్రియలు పూర్తిచేశారు. ఆ తర్వాత ఫలితాలు ఎలా ఉండనున్నాయోనంటూ ఊరంతా తల్లడిల్లింది.

కానీ ఏం కాలేదు!

ఊరంతా ప్రశాంతంగా ఉంది!

గంగను హత్య చేశారన్న అనుమానం ఉన్న ముగ్గురూ తమ పెద్దల సలహా మేరకు లొంగిపోయారు.

కోర్టులో కేసు నడుస్తోంది!

"కాట్టీల బ్రతుకులింతే. ఎప్పుడో నాడు హీనంగా చావాల్సిందే" అనుకున్నారు ఊరంతా.

రవి ఆ షాక్ నుండి తేరుకోలేదు.

# 8

పట్నంలోని పెద్దలూ, రాజకీయవేత్తలూ తీవ్రంగా మంతనాలు సాగించారు. ఈ కేసు వార్తలు పేపర్లలో విపరీత ప్రచారాన్ని అందుకున్నాయి. తొలిసారిగా రవికి ప్రపంచం అంటే ఏమిటో అర్థం అయింది.

కోర్టులో సాక్ష్యాలు తారుమారయ్యాయి. గంగ స్నేహితుడు క్రాస్ ఎగ్జామినేషన్లో జవాబులు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి. సినిమా చూసి వస్తున్నాం అని చెప్పి....అందులో హీరోయిన్ ఎవరని అడిగితే ఎవరిదో పేరు చెప్పాడు. అందులోనూ అది పాతసినిమా. ఆ హీరోయిన్ తెలియని వారుండరు.

గంగ మరణం పట్ల వారి తల్లిదండ్రులే అంతగా పట్టించుకోలేదు. వారిని ఏనాడు ప్రేమగా పలకరించటంగాని, సహాయం చెయ్యటంగాని గంగ చెయ్యలేదు. అవతలి పార్టీ వారు నిధులు ప్రోగేసి అందరినీ కొనేశా

రన్న వదంతులొచ్చాయి. ఆఖరకు గంగ కుటుంబసభ్యులు కూడా ప్రలోభానికి గురయ్యారని గుస గుసలు విని పించాయి.

రవి కివన్నీ తీవ్రమైన మనస్తాపాన్ని కలిగించాయి. అతనికి కులం అన్నా, తగాదాలన్నా అసహ్యం ఏర్పడింది. గంగను తలుచుకొని మౌనంగా రోదించేవాడు.

ఆ రోజు తీర్పు వెలువడేరోజు. అందరూ ఎంతో ఆత్రంగా ఎదురుచూస్తున్నారు. రవిలో నిర్లిప్తత....

అందరినీ నిర్దోషులుగా ప్రకటించి వదిలేశారు. వారందరినీ ఊరేగింపుగా తీసుకొచ్చారు.

"నాయుడూ....గంగ ఆత్మకు శాంతి కలిగించాలి" అంటూ చెప్పబోయారెవరో....

"షటప్" అరిచాడు రవి.

"ఏంటి నాయుడు"

"ఇంకెప్పుడూ నన్ను నాయుడని పిలవకు" కఠినంగా అని లేచిపోయాడు రవి.

తిరిగి పట్టణంలో ప్రశాంతత....

అయితే అది తాత్కాలికమే అయింది.

నిర్దోషిగా బయటకొచ్చిన వారిలో.

మరో శాడిస్టు తలెత్తాడు!

## 9

"అంకుల్, మీ గంగే తూనీగలు పట్టుకొని చంపు తున్నాడు" అంటూ వచ్చి చెప్పాడు శ్యామ్.

"వాడేడి?" అంటూ లేచి వెళ్ళాడు రవి.

"గంగా, ఇలారా" అని పిలిచాడు కోపంగా.

గంగ భయంగా వచ్చాడు.

"తూనీగల్ని చంపకూడదమ్మా. వాటికి ప్రాణం వుంటుంది. రెక్కలు విరుస్తుంటే ఏడుస్తాయి. నీ చెయ్యి విరిస్తే నీకు బాధగా ఉండదూ. అందుకే అలాంటి ఆటలు ఆడకూడదు. మీరిద్దరూ కొట్టుకోకుండా ఆడుకోండి. ఇంకెప్పుడూ అలాంటి ఆటలు ఆడవుకదూ" అన్నాడు.

"ఆడను డాడీ" అన్నాడు గంగ చేతిలో తూనీగను ఎగరేస్తూ.

రవికి శేఖర్, సోదరిలాంటి ఆ అమ్మాయి జ్ఞప్తికొచ్చారు.

—:అయిపోయింది:—

# సరైన అల్లుడు

## టెంపోరావ్

ఆమె కారు పోనిస్తోంది. పక్కనే అతడు కూర్చు న్నాడు, కొంతసేపు వాళ్ళు మాట్లాడుకోలేదు. ఒక నిర్జన ప్రదేశంలో ఆమె కారు ఆపింది. అతడివంక నవ్వుతూ చూసింది.

"రామ్!" అందామె.

అతడు ఓరగా ఆమె కేసి చూశాడు.

"రాణీ!" అన్నాడతను.

ఇద్దరూ దిగారు. రోడ్డునుంచి కొంచెం దూరం నడిచి గడ్డినేలమీద కూర్చున్నారు. చుట్టూ ప్రశాంతంగావుంది. అక్కడక్కడ తాడిచెట్లు, చింతచెట్లు కనిపిస్తున్నాయి. సూర్యుడు అస్తమించాడు. కాని ఇంకా చీకటి పడలేదు.

"రామ్, నువ్వు వచ్చి నాన్నతో మాట్లాడు" అందామె.

"అయినంటే నాకెందుకో భయం!" అన్నాడతను.

రాణి నవ్వింది. అతడి చేయి పట్టుకొని నిమిరింది.

"నాన్నను గురించి పత్రికల్లో చాలా చదివివుంటావు. అందుకే భయపడ్తున్నావు. కాని నాన్న చాలా మంచి వాడు."

"ఇరవై నాలుగ్గంటలూ ఆయనతో ఉంటావు...."

"రాంగ్ రామ్! నాన్నతో నేను రోజూ అరగంట సేపేనా ఉండను" అందామె.

ఆమెవైపు అతడు ఆశ్చర్యంగా చూశాడు.

"నాన్న యెప్పుడూ తన పనిలో మునిగివుంటాడు. ఆయన యింటికొచ్చేసరికి నేను నిద్రపోతూ వుంటాను. నేను లేచే లోపల నాన్న వెళ్ళిపోతాడు?"

"సెలవుల్లో?"

"నాన్నకు సెలవులుండవు. అనేకమందికి సెలవులిచ్చే నాన్న తను ఎన్నడూ లీవు తీసుకోడు. జ్వరం వచ్చినా యింట్లో ఉండడు. డాక్టరు తనని ఆఫీసుకొచ్చే చూస్తాడని చెప్పి వెళ్ళిపోతాడు."

"గ్రేట్ మేన్! ఏకాగ్రతతో ఆయన పనిచేస్తున్నారు. అందుకే ఆయన ప్రచురించే దినపత్రిక భారతి దేశంలో విశేషంగా అమ్ముడవుతోంది" అన్నాడు రామ శేషగిరిరావు.

"ఆఫీసులో వున్నా నాన్న ఫోన్ చేసి నాతో రోజుకి కనీసం 20 సార్లు మాట్లాడతాడు. ఎక్కువసేపు మాట్లాడడు" అందామె.

"నీమీద నీ తండ్రికంత ప్రేమ."

"అమ్మ చనిపోయి ఐదేళ్ళు దాటింది. నాన్న కోటీశ్వరుడు. ఈ లోకంలో ఎందరో స్త్రీలు ఆయన్ని పెళ్లాడానికి ఒప్పుకొనేవారు. కాని నాన్న పెళ్ళాడలేదు."

అతడామె వైపు నవ్వుతూ చూశాడు. రాణీ బాగా

తండ్రి పోలిక! కోల మొహం. పెద్ద కళ్ళు. తీర్చిదిద్దిన ముక్కు!

"రాణీ, నాన్నగారితో నువ్వే మాట్లాడ కూడదూ?" అడిగాడతను.

"నేను చెప్తాను. నువ్వు కూడా రావాలి. ఆయనతో మాట్లాడాలి!"

"అలాగే వస్తాను."

"ఈ ఆదివారం ఒక అమెరికన్ ఫామిలీకి నాన్న యింట్లో డిన్నర్ యిస్తున్నాడు. డిన్నర్ పదింటికి వుండొచ్చు. వాళ్ళు ఎనిమిదింటికి వస్తారు. నువ్వు 6-30 కి రా. నాన్నతో మాట్లాడొచ్చు," అందామె.

"వస్తాను," అన్నాడతను.

ఆదివారంనాడు సరిగ్గా ఆరున్నరకి అతడు ఆమె ఇంటికి ఆటోలో చేరుకున్నాడు. మెయిన్ గేటు బయట ఆటోను ఆపి అతడు దిగాడు. గేటు ముందు యిద్దరు గూర్ఖాలు వున్నారు. వాళ్ళ చేతుల్లో తుపాకీలు వున్నాయి.

రాము శేషగిరిరావు గేటు ముందు నిలబడి లోపలకు చూశాడు. దూరంలో మూడంతస్తుల మేడ కనిపిస్తోంది. ప్రఖ్యాత న్యూస్ పేపర్ మేగ్నెట్ నాగేశ్వరరావు యిల్లది.

అతడు లోపలకు వెళ్ళబోయాడు. ఒక గూర్ఖా అతడిని ఆపాడు.

"నా పేరు రామ్. రాణీ కోసం వెళ్తున్నాను," అన్నాడతను.

గూర్ఖా వెళ్ళమన్నాడు.

గూర్ఖాతో రాణీ చెప్పివుంటుంది!

అతడు లోపలకు నడిచాడు. వివిధ రకాల పూల

మెట్లను చూస్తూ అతడు అడుగులు వేశాడు.

వరండా మెట్లెక్కి ముందు హాలు గుమ్మంవైపు నడుస్తూంటే రాణీ బయటికొచ్చింది. ఆమెను చూడగానే ఆక్సిజన్ పీల్చినట్లు అనిపించిందతనికి.

ఖరీదైన కంజీవరం పట్టుచీరలో ఆమె రంభలావుంది.

"రామ్!" అందామె.

అతడు మాట్లాడలేదు. ఆమెవైపు చూస్తూ వుండి పోయాడు.

"లోపలకురా!"

ఆమె వెనకనే అతడు లోపలకు వెళ్ళాడు. హాలు రాజ దర్బారులా వుంది. హాల్లో 20 సోఫాలున్నాయి. గోడల మీద అనేక ఫోటోలు అమర్చబడ్డాయి.

నాగేశ్వరరావు ప్రధానమంత్రితో మాట్లాడు తున్నాడు ఒక ఫొటోలో. మరో ఫొటోలో భారత దేశం ప్రెసిడెంట్ నాగేశ్వరరావుతో కరచాలనం చేస్తు న్నాడు.

అనేక దేశాల నాయకులతో నాగేశ్వరరావు ఫోటో లున్నాయి. అవన్నీ చూస్తూంటే తనకీ రాణీకీ మధ్య పెద్ద అగాధం వుందనిపిస్తోంది.

ఇద్దరూ పెద్ద సోఫాలో పక్క పక్కనే కూర్చు న్నారు.

"రాణీ! ఆయనతో చెప్పావా?"

"చెప్పాను."

"ఏమన్నారాయన?"

"ఏమీ జవాబివ్వలేదు," అందామె.

"ఆయన వుద్దేశమేమై వుంటుంది?"

"చెప్పలేను. నాన్న మౌనంగా వున్నపుడు ఆయన

మెదడులో తిరిగే ఆలోచనలను మనం వూహించలేం",
అందామె.

ఎవరో వస్తూన్న చప్పుడైంది. ఆమె లేచింది. అతనూ లేచాడు.

నాగేశ్వరరావు హాల్లోకొచ్చాడు. మధ్యలోవున్న సోఫాలో కూర్చున్నాడు. రాణీతో రామ్ అతడి ముందుకు వెళ్ళాడు.

"నాన్నా," పిల్చిందామె.

తండ్రి చూపు ఆమె మీదనుంచి రామ్ మీదకు వెళ్ళింది.

"నేను చెప్పినతను యితనే, రామ్," అందామె.

"అమ్మాయి, నువ్వు పైకెళ్ళి డిన్నర్ అరేంజ్‌మెంట్లు చూడు, ఇతడి విషయం నేను చూస్తాను," అన్నాడు తండ్రి.

"ఇప్పుడే వస్తాను," అని రామ్‌వైపు చూసి ఆమె వెళ్ళిపోయింది.

నాగేశ్వరరావు గోల్డు కేసులోంచి సిగరెట్ తీసి వెలిగించాడు. రామ్ నిలబడే వున్నాడు. పొగ వదుల్తూ రామ్‌వైపు అతడు సూటిగా చూశాడు.

"నువ్వేనా రామ్?" ప్రశ్నించాడతను.

అతడు తలాడించాడు. అతడి గుండె దడదడలాడ్తోంది.

"నా కూతుర్ని ప్రేమిస్తున్నావా?"

రామ్ నవ్వుతూ అతడివైపు చూశాడు, మౌనంగా.

"నీ ప్రేమ ఎలావున్నా, నీ ధైర్యాన్ని మెచ్చుకోవాలి! నా పేరువింటే ఎవ్వరూ నా కూతురు పరిసరాలకు రారు!" అన్నాడతను

రామ్ అలాగే నిలబడ్డాడు, ఏదో చిన్న వుద్యోగానికి

వచ్చిన అభ్యర్థిలా.

"నువ్వేం చేస్తున్నావు?"

"మద్రాసు రబ్బరు ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాను."

"ఎంత జీతం?"

"వెయ్యిరూపాయలు వస్తుంది, సార్."

"నా దగ్గరుండే అల్సేషియన్ కుక్కల తిండికి నీ జీతానికి నాలుగురెట్లు ప్రతినెలా ఖర్చవుతుంది!" అన్నాడతను.

"కావచ్చు సార్. కుక్కలు తిండికోసమే జీవిస్తాయి," అన్నాడు రామ్.

"నువ్వు తిండికోసం జీవించడం లేదా?"

అతను నవ్వాడు.

"హోటలు భోజనం తిని బ్రతికే వాళ్ళెవరూ తిండికోసం జీవించరు!"

అతడు సూటిగా రామ్‌వైపు చూశాడు.

"ఏదేనా డబ్బు కూడబెట్టావా?"

"లేదు, సార్. ఇంకా ఎన్నేళ్ళ జీవితమో వుంది నాకు. తర్వాత కూడబెట్టొచ్చు."

నాగేశ్వరరావు నవ్వాడు.

"జేబులో చిల్లిగవ్వ లేకుండా, వెయ్యిరూపాయల జీతంతో బతికే నువ్వు నా కూతుర్ని ప్రేమించి పెళ్ళాడ వచ్చావా? కనీసం పది లక్షలు వుంటేగాని నా కూతుర్ని పెళ్ళాడగల్గిన మనిషిగా నిన్ను నేను భావించను,"

రామ్ అతడివైపు చూశాడు.

"పది లక్షలు సంపాదించగలను"

"సంపాదించి, రా, అప్పుడు చూద్దాం."

"అంతవరకూ రాణికి పెళ్ళి చేయనని మీరు హామీ

యిస్తారా?"

"పది లక్షలు గడించడానికి నీకు యీ జీవితకాలం పట్టొచ్చు. అంతవరకూ ఆమెను అలాగే వుండమంటావా?"

"జీవితకాలం అక్కరలేదు. రెండేళ్ళలో నేను పది లక్షలు సంపాదించి తెస్తాను."

నాగేశ్వరరావు గంభీరంగా నవ్వాడు.

"ఎక్కడేనా నీ తాతలు డబ్బు దాచిపెట్టారా?"

"వాళ్ళు దాచిపెట్టివుంటే రెండేళ్ళు ఎందుకు? వెంటనే తెచ్చి మీకు చూపించేవాడిని."

"ఆల్ రైట్, రెండేళ్ళు టైమ్ యిస్తున్నాను. పది లక్షలు పట్టుకురా!"

"అలాగే చేస్తాను."

"బై బై!" అన్నాడతను.

"వెళ్ళేముందు రాణీతో ఒకసారి మాట్లాడాలి," అన్నాడు రామ్.

"ఆమె బిజీగావుంది. డోంట్ డిస్టర్బ్ హార్? గెట్ లాస్ట్!" అన్నాడతను.

రామ్ అతడికి నమస్కరించి బయటకు వెళ్ళిపోయాడు.

## 2

టైము ఎనిమిది దాటింది. రామ్ హోటల్ డైమండ్ బార్రూమ్‌లో కూర్చొని బీర్ సేవిస్తూ ఆలోచిస్తున్నాడు. ఈ పాటికి అమెరికిన్ ఫామిలీ రాణీ యింటికి వచ్చి వుండాలి!

ఆమెతో మాట్లాడకుండా వచ్చేసినందుకు ఎంతో విచారించాడతను. తర్వాత ఫోన్ చేసి ఆమెతో మాట్లాడాలి!

దగ్గరకు వస్తున్న అహమ్మద్‌ను చూసి అతడు "హలో!" అన్నాడు.

"హలో, రామ్," అన్నాడు అహమ్మద్.

అహమ్మద్ వ్యాపారస్తుడు. బాగా డబ్బు సంపాదిస్తున్నాడు. ఇద్దరూ బీర్ తాగుతూ మాట్లాడసాగారు.

"రెండేళ్ళలో పదిలక్షలు గడించాలి. ఎలా?" ప్రశ్నించాడు రామ్.

"బిగ్ టార్గెట్! ముక్కు సూటిగా వెళ్ళి ఎవరూ అంత డబ్బు సంపాదించలేదు. స్మగ్లర్ కావాలి. ఏ బాంకినో రెయిడ్ చెయ్యాలి!" అన్నాడు అహమ్మద్.

"నువ్వు చేసే వ్యాపారం ఎలా సాగుతోంది?"

"ఫైన్. నాది హైడ్స్ బిజినెస్. జంతువుల చర్మాలను విదేశాలకు యెగుమతి చేస్తాం. మా తాత ఈ వ్యాపారం ప్రారంభించాడు. ఇప్పుడు జయప్రదంగా సాగుతోంది."

తొమ్మిదింటికి అహమ్మద్ వెళ్ళిపోయాడు. బిల్లు చెల్లించి రామ్ బార్రూంలోంచి బయటకు నడిచాడు. పుస్తకాల షాపుముందు ఆగి చూస్తూ వుండిపోయాడు.

ఎన్నో పుస్తకాలు, పత్రికలు! ఒక అమెరికన్ రాసిన పుస్తకాన్ని అతడు తీసి చూశాడు. "హవ్ టు మేక్ ఎ మిలియన్ డాలర్స్?" అన్న టైటిల్ అతడిని బాగా ఆకర్షించింది.

వెనుక పేజీమీద పబ్లిషర్ రాసినది అతడు చదివాడు. ఆ పుస్తకం మూలంగా రచయిత మిలీనియర్ అయ్యాడు. అది చదివిన వాళ్ళు కూడా మిలీనియర్లు కావచ్చు!

30 రూపాయలు చెల్లించి అతడు ఆ పుస్తకాన్ని

కొన్నాడు. టెలిఫోన్ బూత్ వైపు నడిచాడు. లోపలకు వెళ్ళి తలుపుమూశాడు. రిసీవరెత్తి ఒక నంబరుతిప్పాడు.

"హలో!" అందో యువతి కంఠం.

"రాణీ, నువ్వేనా?" అన్నాడతను.

"నేనే! నువ్వు ఫోన్ చేస్తావని యెదురుచూస్తూ ఉన్నాను. ఎందుకలా వెళ్ళిపోయావు?"

"మీ నాన్నగారు వెళ్ళిపొమన్నారు."

"బయట తోటలో వుండొచ్చుగా?"

"వెళ్ళమన్నాక వుంటే బాగోదనిపించింది."

"నీకోసం యెంతో వెతికాను. నాన్న నీతో యేమన్నాడు?"

"పదిలక్షలు గడించి అది పట్టుకొచ్చి ఆయనకు చూపించితర్వాత నీతో పెళ్ళివిషయం మాట్లాడమన్నాను" అన్నాడు రామ్.

"అయితే ఏం చేస్తున్నావు?"

"హౌ టు మేక్ ఎ మిలియన్ డాలర్స్, అనే అమెరికన్ రచయిత పుస్తకం యిప్పుడే కొన్నాను. అది చదివిచూడాలి."

"మన పెళ్ళి యిప్పట్లో అవదన్న మాట!"

"రెండేళ్ళలో పదిలక్షలు సంపాదించాలి. ఆ తర్వాత పెళ్ళి విషయం ఆయన నాతో మాట్లాడతారు."

"నాన్న ఒప్పుకుంటాడని నేననుకున్నాను. ఆయన ప్రచురించే వారపత్రికల్లో ఎన్నో సీరియల్ నవలలు ముద్రిస్తూ ఉంటారు. అన్నీ లవ్ స్టోరీలే. కోటీశ్వరుడి కూతుర్ని కారు మెకానిక్ ప్రేమించి పెళ్ళాడ్తాడు, ఒక కథలో."

"పాఠకుల్ని మేపడం కోసం అటువంటి కథలను

వేస్తున్నారు. ఆ కథల్లో జరిగినట్లు నీ జీవితాన్ని మీ నాన్న సాగనివ్వరు" అన్నాడు రామ్.

కొంతసేపు యిద్దరూ మౌనంగా వుండిపోయారు.

"అమెరికన్‌లు వచ్చారా?" అడిగాడతను.

"వచ్చారు. స్కాచ్ విస్కీ సేవిస్తున్నారు."

"నీకలవాటులేదా?" అన్నాడతను.

"నేనూ తాగాను కొంచెం. తప్పా?"

"తప్పనను. మొగాళ్ళు తాగితే తప్పు కానప్పుడు ఆడవాళ్ళు తాగితే పోయిందేమిటి?"

"యూ హేవ్ ఫైన్ ఐడియా! అందుకే ఐ లవ్ యు!" అందామె.

అతను ఏదో చెప్పబోయాడు.

"రామ్, వాళ్ళు పిలుస్తున్నారు. నేను వెళ్ళాలి. తర్వాత నా పెర్సనల్ నంబర్‌కి ఫోన్ చేయి. యెంతసేపైనా మాట్లాడొచ్చు."

"బై బై" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

## 3

ఆ రాత్రి రామ్ భోజనం చేయలేదు. ఉడిపీ హోటల్లో పూరీలూ, దోశలూ తిని కాఫీ తాగాడు.

పన్నెండింటికి రాణి పెర్సనల్ నంబర్‌కి అతడు ఫోన్ చేశాడు.

"హాలో!" అందామె.

"రాణీ, పార్టీ ఎలా సాగింది?" అన్నాడతను.

"అది నాన్న డిన్నర్ పార్టీ. నాకందులో ఇంట్రెస్టు లేదు. నేను నీ గురించే ఆలోచేస్తున్నాను. భోజనం చేశావా?"

"లేదు. బాగా టిఫిన్ తిన్నాను."

"నిన్ను పార్టీకి వుండమందామనుకున్నాను. ఎన్నో పదార్థాలు చేశారు. నువ్వు అలా వెళ్ళిపోడం వలన నాకు ఆకలి లేకుండా పోయింది" అందామె.

"రాణీ, నువ్వు బాగా తిని ఆరోగ్యంగా, బలంగా ఉండాలి. రెండేళ్ళపాటు డబ్బు ఆర్జించడంలో నేను నిమగ్నుడనై ఉండొచ్చు."

"రామ్, అలా అనకు! నాకు డబ్బొద్దు. నాకు కావల సింది నువ్వు! మనిద్దం వెళ్ళి పెళ్ళి చేసేసుకుందాం. నాన్న ఏం చేస్తాడో చూద్దాం!" అందామె.

"అది చాలా సులువైన పని. కాని నేను నీకోసం పాటుపడదల్చాను. రెండేళ్ళు కష్టపడి పదిలక్షలతో తిరిగొచ్చి నీ తండ్రి ఆశీర్వాదాల్తో నిన్ను పెళ్ళాడ్తాను."

"కాని అంత డబ్బు ఎలా సంపాదిస్తావు?"

"నేను కొన్న పుస్తకంలో కొన్ని పేజీలు చదివాను. అప్పుడే అనేక పద్ధతులు నా మెదడులో రూపం దాల్చుతున్నాయి. ఏం చేస్తానో నీకు ప్రస్తుతం నేను చెప్పలేను కాని నేను చాలా పట్టుదలగల మనిషిని. అది నీకు తెలుసు. ఐ లవ్ యు అని నీచేత అనిపించటానికి నీతో మూడేళ్ళు తిరిగాను. గుర్తుందా?"

"రామ్, నువ్వెక్కడ ఉన్నావు?"

"హోటల్ మిడ్ లాండ్ ఫోన్ బూత్ లో."

"ఎగిరొచ్చి నీముందు వాలాలనిపిస్తోంది!"

"రాణీ, పన్నెండు దాటింది. డిన్నర్ పార్టీలో చాలా అలసిపోయి ఉంటావు. రేపు కల్సుకుందాం, పడుకో!" అని రిసీవర్ పెట్టేశాడతను.

మర్నాడు సాయంత్రం యిద్దరూ సముద్ర పొడ్డున యిసుకలో కూర్చున్నారు.

చీకటి పడింది. కెరటాల హోరు వినపడ్తోంది. చంద్ర కాంతిలో చల్లగా వుంది.

"రామ్!" అని అతడి ఒళ్ళో తల వాల్చేసిందామె.

అతడామె బుగ్గల్ని నిమిరాడు. వెచ్చటి పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"రాణీ, నా వుద్యోగం వదిలేశాను. రేపు బొంబాయి వెళుతున్నాను. అక్కడ డబ్బు గడించడం సులువని విన్నాను."

"ఆ పట్నంలో ఏం చేస్తావు?"

"ఏం చేస్తానో నాకే తెలియదు."

"రామ్, పెద్దపెట్టున వ్యాపారం చేయడానికి పెట్టుబడి కావాలి. పెట్టుబడి లేకుండా ఏమీ చెయ్యలేవు!"

అతడు నవ్వాడు.

"రాణీ, నువ్వు నాగేశ్వరరావుగారి కూతురవి. నువ్వలా అనడం ఆశ్చర్యంగా వుంది. నీ తండ్రి జీవితం గురించి నువ్వు వినలేదా? జేబులో పైసా లేకుండా ఆయన మద్రాసు వచ్చారు. ఒక దినపత్రికలో చేరారు. సంవత్సరం తర్వాత మరో దినపత్రికకు ఆయన మేనేజర్ అయ్యారు. రెండేళ్ళ తర్వాత ఒక ధనవంతుడితో కలిసి ఆయన ది డెయిలీ సన్ అనే దినపత్రిక స్థాపించారు. కొన్నేళ్ళ తర్వాత ఆయన ఆ పత్రికకు పూర్తిగా అధిపతి అయ్యారు.

ఇప్పుడా దినపత్రిక మన దేశంలో 20 కేంద్రాల నుంచి ముద్రించబడి అమ్ముడవుతోంది. శ్రీలంకా, సింగపూర్, మలేషియాలో కూడా ఆ దినపత్రిక ముద్రించబడుతోంది. చేతులో యేమీ లేకుండా ఆయన యెంతో సాధించారు."

"నాన్న రోజులు వేరు, యీ రోజులు వేరు, రామ్. ఇప్పుడు కాంపిటీషన్ ఎక్కువ. నాన్న కాలంలో దిన పత్రికలు లేవు. ఇప్పుడు చాలా వున్నాయి. కొత్తగా పెట్టిన దినపత్రికలు ఆరునెలలు తిరిగేలోగా ఆగిపోతున్నాయి."

"అయితే నన్ను ఏం చేయమంటావు?"

"నా బాంకి అకౌంటులో కొంత డబ్బుంది. నా పేర కొన్ని ఫిక్సెడ్ డిపాజిట్లు, షేర్లు ఉన్నాయి. అదంతా కలిపితే రెండు మూడు లక్షలు రొక్కంగా మనచేతికొస్తుంది. ఆ డబ్బుతో నువ్వు వ్యాపారం చేస్తే బాగుంటుంది."

"ఏమీ లేకుండా చెయ్యాలని నా ఉద్దేశం. నా దగ్గర ఐదారు వేలుంటై. అది చాలు నాకు" అన్నాడతను.

ఆమె లేచి కూర్చుంది. అతడిని చేతులతో చుట్టేసింది.

"నువ్వు బొంబాయి వెళ్ళొద్దు. నాకు దూరంగా పోవద్దు. నేను ఉండలేను."

"బొంబాయి దూరంగా లేదు — ప్లేన్లో నువ్వు రావచ్చు. మనం కల్సుకోవచ్చు."

"తరచుగా నేను బొంబాయి వస్తే నాన్న ఎందుకని అడుగుతాడు. అప్పుడు నిజం చెప్పాలి" అందామె.

"ఆ బాధ నీకు లేకుండా ఉండేందుకు నేనే ఇక్కడికొచ్చి నిన్ను కల్సుకుంటాను. చాలా?" అన్నాడతను.

"ఆ మాటమీద నువ్వు నిలబడాలి!"

"రాణీ, ఏది యేమైనా నీ తండ్రి బలవంతంగా మరొకరితో నీ పెళ్ళి చేయకుండా నువ్వు చూడాలి."

"నాన్న అలా చేయడు! నిన్ను మనసారా ప్రేమి

న్నావనీ, నిన్ను తప్ప మరెవరినీ పెళ్ళాడననీ నేను నాన్నతో చెప్పాను. నాకు నచ్చని పెళ్ళి నాన్న చేయడు!" అందామె.

అతడామెను కౌగలించుకున్నాడు. ఆమెవైపు చూశాడు.

"రాణీ, నేను లేని సమయంలో నీ మనసు మారదుగా!"

"మారితే మారొచ్చు!" అందామె కొంటెగా.

"అయితే నీకు దూరంగా వెళ్ళడం ప్రమాదకరమే!"

"నువ్వు నా దగ్గరలో వున్నా నా మనసు మారొచ్చు" అందామె నవ్వుతూ.

అతడామెను ముద్దెట్టుకున్నాడు.

"రాణీ, నీ హృదయం ఎటువంటిదో నాకు తెలుసు. ఐ లవ్ యూ!" అన్నాడతను.

## 4

కె.కె. రావు హాట్ కాఫీ తాగుతూ దినపత్రిక పేజీలు తిప్పుతున్నాడు. ఒక ప్రకటనను అతను పదే పదే చదివాడు.

"గల్ఫ్ దేశాల్లో వుద్యోగాలకు అభ్యర్థులను ఎంపిక చేసే కంపెనీకి ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ కావాలి. కనీసం ఐదేళ్ళ అనుభవం ఉండాలి. ఎమ్.ఎ. పాసయి వుండాలి. కాండిడేట్లు వెంటనే వారి అప్లికేషన్‌లను పంపొచ్చు. బాక్సు 88,
ఇండియన్ ఎక్స్‌ప్రెస్,
మద్రాసు - 2."

అతడు భార్యను పిలిచాడు.

"రమా!"

రమాదేవి అతడి పక్కకు వచ్చింది.

"ఏమిటండీ?"

"ఈ జాబ్‌కి అప్లికేషన్ పంపనా?"

"పంపి చూడండి" అందామె, పత్రిక చూసి.

అతడు పనిచేసే ఫాక్టరీ స్ట్రయిక్‌లో వుంది. ఆరు నెలలనుంచి జీతం రాడంలేదు. యూనియన్ నాయకులు ఫాక్టరీ అధిపతులతో చర్చలు సాగిస్తున్నారు. కాని ఏదీ ఫలించలేదు.

అదే రోజున కొండలరావు అప్లికేషన్ టైపు చేయించి పోస్టు చేశాడు.

వారం రోజుల్లో జవాబు వచ్చింది. షేక్ సులైమాన్ అనే అరబ్ దేశస్థుడు తన లెటర్ హెడ్ మీద జవాబిచ్చాడు.

తను ప్రస్తుతం బొంబాయిలో ఉన్నట్లు షేక్ సులైమాన్ రాశాడు. వెంటనే వచ్చి తనని కల్సుకోమన్నాడు. హోటల్ హెవన్‌లో అతని గది నంబరు యివ్వబడింది. యింటర్వ్యూకి వచ్చినపుడు యీ ఉత్తరాన్ని కూడా పట్టావాలని సులైమన్ హెచ్చరించాడు.

ఆ జవాబు చూడగానే కొండలరావు సంతోషించాడు.

"రమా, వెంటనే బొంబాయి వెళ్ళాలి. కనీసం వెయ్యి రూపాయిలు కావాలి" అన్నాడు కొండలరావు.

మెళ్ళోని గొలుసునితీసి ఆమె అతడికి యిచ్చింది.

"ఏ పాన్ షాపులోనో పెట్టి వెళ్ళిరండి" అందామె.

కొండలరావుకు భార్య చెప్పింది వేదం. ఆమె వెళ్ళమంటే పని జరుగుతుందని అతడి విశ్వాసం.

మర్నాడు అతడు బొంబాయికి వెళ్ళాడు. ఒక

హోటల్లో గదితీసుకున్నాడు. స్నానం ముగించి, దుస్తులు ధరించి కొండలరావు యింటర్వ్యూకి హాజరయ్యాడు.

గదిలో షేక్ సులైమన్ మాత్రం వున్నాడు. అతడు అరబ్ దుస్తుల్లో ఉన్నాడు. కొండలరావు అతడివైపు వినయంగా చూసి నమస్కరించాడు.

"కూర్చోండి! లెటర్ ప్లీజ్" అన్నాడతను.

కొండలరావు తనకు వచ్చిన ఉత్తరాన్ని అతడికిచ్చాడు.

"గుడ్, యూ ఆర్ కె.కె. రావు!" అన్నాడతను.

"యస్సార్" అన్నాడతను.

"మీ బయోడాటా చూశాను. బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు పట్నాలకు మీరు వెళ్ళి అనేకమంది అభ్యర్థులను యింటర్వ్యూ చేసి అందులో మనకు పనికి వచ్చే వాళ్ళ లిస్టును నాకు చూపించాలి. ఆ లిస్టు చూసి నేను ఫైనల్ గా మీకు చెప్తాను."

"అలాగే, సార్."

"ఇండియాలో మాకు కంపెనీలేదు. మీ పేరు కె.కె. రావుగా! మీరు కె.కె. కార్పొరేషన్ అని ఒక కంపెనీని సోల్ ప్రొప్రయిటర్ గా రిజిష్టర్ చేయండి."

"మీరు ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ కావాలన్నారు!"

"మీరు పెట్టే కంపెనీకి ప్రొప్రయిటర్, ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ మీరే! మీరుచేసే సర్వీస్ కు మేం మీకు డబ్బిస్తాం."

"ఎంతిస్తారు?"

"నెలకు పదివేలు. మీ కంపెనీకి అయ్యే ఖర్చంతా మేము భరిస్తాం. మీ ఖర్చులన్నీ మావే. ఒక్కపైసా మీరు ఖర్చుపెట్టనక్కర లేదు."

"గుడ్."

"పదివేలు మీకు ప్రతినెలా మీ సర్వీస్‌కు ముట్టుతుంది."

"పదివేలమీద యిన్‌కమ్‌టాక్స్ చాలా పోతుంది. ఈ దేశంలో టాక్స్ ఎక్కువ."

"అందుకే ఒకలా చేస్తాను. మీ సర్వీస్‌కు రెండు వేలు వైట్‌లో ఇస్తాం. తతిమ్మాది బ్లాక్‌లో యిస్తాం."

"థాంక్స్ సార్, నన్ను రక్షించారు" అన్నాడు కొండలరావు వుషారుగా.

తన భార్య వెళ్ళమంది. ఆమె వెళ్ళమనడం అఖండంగా ఫలించింది. నెలకు పదివేలు! అంత జీతంతో తను రాజాలా జీవించవచ్చు!

షేక్ సులైమన్ రెండు గ్లాసుల్లో స్కాచ్ విస్కీ పోశాడు. కొండలరావు సోడా కలిపాడు.

"టు ది సక్సెస్ ఆఫ్ అవర్ కంపెనీ!" అంటూ యిదరూ తాగారు.

"భారతదేశంనుంచి ఎందరో మా దేశాలకు వస్తున్నారు. అనేకమంది ఇక్కడ మోసపోతున్నారు. అలా జరగకూడదని నేనే స్వయంగా యిక్కడికొచ్చి మీ చేత కంపెనీ పెట్టిస్తున్నాను. నేను గల్ఫ్ దేశాల్లో ఉద్యోగాలు యిప్పిస్తాను. మాకు కావలసినవారిని మీరు ఎంపిక చేసి లిస్టు నాకిస్తారు. సింపుల్!" అన్నాడు సులైమన్.

కొండలరావు అతడివైపు నవ్వుతూ చూశాడు. షేక్ సులైమన్ తెల్లటి గౌను కప్పుకున్నాడు. నల్లటి గడ్డం. డార్క్ గ్లాసెస్ ధరించాడు.

"మిష్టర్ కె. కె. రావు, ప్రతి కాండిడేటూ మీకు పదివేలు చెల్లించాలి. అంతకుమించి వాళ్ళు ఏమీ యివ్వనక్కరలేదు. ఒకవేళ యేదేనా అడ్డంకులవల్ల 10 వేలు

చెల్లించని కాండిడేట్సు ఉద్యోగం మేం ఇప్పించలేక పోతే మూడు నెలలలోపల పదివేలూ తిరిగి యిచ్చేస్తాం. ఉద్యోగం వస్తే నెలకు 8 వేలు వాళ్ళు గడిస్తారు. రాక పోతే కట్టిన డిపాజిట్ వాళ్ళకు తిరిగి వచ్చేస్తుంది."

"చాలా బాగుంది" అన్నాడు కొండలరావు.

"కాండిడేట్లనుంచి మీరు మీ కంపెనీ పేర డ్రాఫ్టు డి.డిలు తీసుకోవాలి. అవి కాష్ అవగానే కాష్ నాకి చ్చేయాలి."

"కంపెనీ ఖర్చులకూ, నా సర్వీస్‌కూ మీరు యెలా యిస్తారు?"

మళ్ళా గ్లాసుల్లో విస్కీ పోశాడు కొండలరావు. సోడా కలిపాడు.

"మేం యివ్వనవసరంలేదు. కాండిడేట్లు యిచ్చిన డబ్బు మీ అకౌంటులో పది లక్షలుందనుకోండి. రెండు లక్షలు మీరు ఉంచుకుని, ఎనిమిది లక్షలు నాకివ్వచ్చు."

"ఫైన్!" అన్నాడు కొండలరావు.

అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. చాలా డబ్బు తన చేతిలో ఉంటుంది. తనోక వి.ఐ.పి. అయిపోతాడు.

"అంతా బాగుంది. మీరు చెప్పిన ప్రకారం చేస్తాను" అన్నాడు కొండలరావు.

"మిష్టర్ కె.కె. రావు మీకు రెండు రోజులు ట్రెయి నింగ్ ఇచ్చి నేను దుబాయి పోతాను. పదిహేను రోజుల తర్వాత వస్తాను. అప్పటికి మీ పని ప్రారంభం అవు తుంది" అన్నాడు షేక్ సులైమన్.

"అలాగే సార్" అన్నాడు కొండలరావు.

# 5

కలకత్తా!

హోటల్ గ్రాండ్ లో కొండలరావు సోఫాలో కూర్చుని ఉన్నాడు. పక్కనే ఒక యువతి వుంది. ఆమె అతడి పెర్సనల్ సెక్రటరీ మనోరమ.

అతడామె వంక నవ్వుతూ చూశాడు.

"బయట ఎంతమంది ఉన్నారు?"

"300 మంది."

అతడు ఆశ్చర్యంగా ఆమెవైపు చూశాడు.

"అవకాశం దొరికితే మన దేశంలోని వాళ్ళందరూ గల్ఫ దేశాలకు పోతారేమో!" అన్నాడతను.

ఆమె కిలకిల నవ్వింది. నవ్వుతూన్న ఆమెవైపు అతను ఆనందంగా చూశాడు. అతడికి పెళ్ళయి ఆరేళ్ళయింది. భార్య రమను దేవతలా చూశాడతను.

పరాయి స్త్రీతో అతడికి యెన్నడూ సంబంధంలేదు. కాని కె. కె. కార్పొరేషన్ ప్రారంభించాక, అతడిలో మార్పు వచ్చింది. అతడి దృష్టి మనోరమ మీదకు వెళ్ళ సాగింది.

మనోరమ చాలా అందమైన యువతి. బి.ఎ. పాస య్యింది. టైపింగ్ బాగా తెలుసు. సెక్రటేరియల్ కోర్సు చదివింది. ఇంట్లో గడవక ఆమె ఉద్యోగంలో చేరింది.

కొండలరావు టైము చూశాడు. 8 అయింది.

"ఇంటర్వ్యూలు తొందరగా ముగించాలి" అన్నాడతను.

"స్టార్టు చేద్దామా, సార్? మొదటి కాండిడేట్ను లవనా?"

"కాల్ హిమ్."

హోటల్ గదిలోంచి ఆమె బయటకు వెళ్ళింది. నడవలో వేసిన కుర్చీలో కూర్చున్న వాళ్ళవైపు ఆమే చూసింది. మరి కొందరు వచ్చారు. వాళ్ళకు నంబర్ కార్డ్సు యిచ్చింది.

"నంబర్ ఒన్, గో యిన్!" అందామె.

పొట్టిగా లావుగా వున్నతను లోపలకు వెళ్ళాడు. వెనకనే ఆమె వెళ్ళింది.

"నెంబర్ ఒన్ కె.బి. మీనన్" అందామె.

అతడి అప్లికేషన్ని కొండలరావు ముందు పెట్టింది. వేగంగా అంతా చూశాడతను. మీనన్తో కరచాలనం చేసి కూర్చోమన్నాడు.

"మిష్టర్ మీనన్, మిమ్మల్ని సెలక్టు చేస్తే మీరు వెంటనే రాగలరా?"

"వెంటనే వస్తాను, సార్."

"పాస్‌పోర్టు విషయం మీరు రాయలేదు!"

"ఈ మధ్యనే పాస్‌పోర్టు వచ్చింది,"

"గుడ్" అన్నాడు కొండలరావు.

కొండలరావు బెన్‌సన్ సిగరెట్ వెలిగించాడు.

"మీ క్వాలిఫికేషన్స్‌తో వచ్చే ఉద్యోగానికి కనీసం నెలకు పదివేలు జీతం ఉంటుంది. మీరు మాకు పదివేలు కట్టాలి."

"బిగ్ అమౌంట్" అన్నాడు మీనన్.

"ఈ దేశంలో పదివేలు పెద్ద మొత్తమే. కాని గల్ఫ దేశాల్లో అది మీకొచ్చే ఒక నెల జీతం!"

"అఫ్‌కోర్స్, సార్."

"పదివేలు కట్టగలరా?"

"కడాను."

"ఆల్ రైట్ వెళ్ళండి."

"నాకు ఉద్యోగం వచ్చినట్లేనా?"

"దాన్ని గురించి మేం త్వరలో మీకు రాస్తాం."

"ప్లీజ్ నాకు ఉద్యోగం వచ్చేటట్లు చూడండి" అన్నాడు మీనన్.

"నంబరు 2ని లోపలకు రమ్మని చెప్పండి, ప్లీజ్" అంది మనోరమ.

మీనన్ బయటకు వెళ్ళిపోయాడు. కాస్సేపట్లో నంబరు 2 లోపలకు వచ్చాడు.

"నంబరు 2 మిష్టర్ సి.కె. నంబియార్" అంది మనోరమ.

కొండలరావు అతనితో కరచాలనం చేసి కూర్చొమన్నాడు.

మిష్టర్ నంబియార్, మీ అకాడమిక్ క్వాలిఫికేషన్స్ మాకు నచ్చాయి. మీకు పెద్ద జాబ్ వచ్చే అవకాశం వుంది. మీరు 10 వేలు డిపాజిట్ గా కట్టాలి."

"కడాను. అక్కడ నాకెంత రావచ్చు?"

"నెలకు 12 వేలు. అక్కడ మీరు యిన్ కమ్ టాక్స్ కట్టనక్కరలేదు. మీకు ఫర్నిష్డ్ ఫ్లాట్, ఏర్ కండిషండ్ కారు యిస్తారు."

"ఫైన్! డిపాజిట్ యిప్పుడే కట్టేస్తాను."

"నో, ప్లీజ్. త్వరలో మీకు మే రాస్తాం. డిడి ద్వారా డిపాజిట్ పంపండి."

"ఉద్యోగం రాకపోతే నా డిపాజిట్ యేమవుతుంది?"

"90 రోజుల్లోపల మీకు మా కంపెనీ వాపసు

చేస్తుంది."

"అయితే బెంగలేదు" అన్నాడు నంబియార్.

"మీరు నంబరు 3ని లోపలకు రమ్మనండి ప్లీజ్" అంది మనోరమ.

నంబియార్ వెళ్ళిపోయాడు.

"నంబర్ 3 ఎవరు?"

"మిష్టర్ కరుణాకరన్."

"మరో మళయాళీ సోదరుడు. కలకత్తానుంచి గల్ఫ్ కు వెళ్ళే వాళ్ళందరూ వీళ్ళే!" అన్నాడు కొండలరావు ఆశ్చర్యంగా.

"ఎక్కడికి వెళ్ళాలన్నా మళయాళీలు వెనుదీయరు. ధైర్యంగా వెళ్తారు, జయిస్తారు" అంది మనోరమ.

## 6

రాణీ రిసీవర్ ఎత్తింది.

"హలో!" అంది.

"రాణీ, నేను!" అన్నాడతను.

"రామ్, ఎలా వున్నావు?"

"ఫైన్."

"వెళ్ళి పదిహేను రోజులైనా నీనుంచి ఫోన్ కాల్ లేక పోయేసరికి నన్ను మర్చిపోయావనుకున్నాను" అందామె.

"అది సాధ్యమా?"

"ఏమో, నీకే తెలియాలి! ఎందుకింతకాలం ఫోన్ చెయ్యలేదు?"

"నేను అనేకచోట్ల తిరుగుతున్నాను."

"ఇప్పుడెక్కడున్నావు?"

"బొంబాయిలో."

"నీ పని ఎలా సాగుతుంది?"

"అఖండంగా! మీ నాన్న నాకు రెండేళ్ళు టైమిచ్చాడు. కాని ఆరు నెలల్లోపలే పని పూర్తయే సూచనలు కనిపిస్తున్నాయి."

"యూ ఆర్ జీనియస్!" అందామె.

"కాకపోతే నన్ను ప్రేమించేదానివా?"

ఆమె నవ్వింది.

"జీనియస్‌గా కనిపించేముందే నిన్ను ప్రేమించాను!"

"డోంట్ బాదర్, ఎలా వున్నావు?"

"బాగానే వున్నాను. నిన్ను చూడాలనిపిస్తోంది. ఎప్పుడొస్తావు?"

"నన్ను చూడకుండా నువ్వు ఉండలేనప్పుడు!"

"ఇప్పుడు అదే స్థితిలో ఉన్నాను."

"రేపు ఫ్లయిట్‌లో వస్తాను, హోటల్ చోలాలో వుంటాను. సాయంత్రం ఐదు తర్వాత నన్ను కల్సుకో!"

"ఐయామ్ హేపీ!" అందామె.

రిసీవర్ పెట్టేసి ఆమె పరుపుమీద వాలిపోయింది. రామ్‌ని గురించి కలలుకంటూ ఉండిపోయింది.

మర్నాడు సాయంత్రం రాణీ తన కారును హోటలు చోలా కాంపౌండులో ఆపి దిగింది. రామ్ తనకోసం బయటకొచ్చి నిలబడి ఉంటాడనుకుంది. కాని అతను రాలేదు. రిసెప్షన్ కౌంటరు ముందుకు వెళ్ళి ఆమె రామ్ గది నంబరు కనుక్కుంది.

"ఆయన ఇప్పుడే వచ్చి గది తీసుకున్నారు" అన్నాడు హోటల్ గుమస్తా.

అతడి రూమ్‌వైపు ఆమె వెళ్ళింది. తలుపును మెల్లిగా

తట్టింది. వెంటనే తలుపుతీసి అతడామెను లోపలకు లాక్కెళ్ళాడు. అమాంతంగా ఆమెను కౌగలించుకొని మౌనంగా ఉండిపోయాడు.

ఆమె ఉద్రేకంతో, ఆనందంతో అతడిని ముద్దెట్టుకుంది.

"రామ్, రామ్!" అంది.

"రాణీ, రాణీ!" అన్నాడతను.

ఇద్దరూ పెద్ద సోఫాలా పక్క-పక్కనే కూర్చున్నారు. కళ్ళతో కొంతసేపు మాట్లాడుకున్నారు.

రాణీ అతడివైపు పరీక్షగా చూసింది.

అతడు నూటులో ఉన్నాడు. గడ్డం పెరిగింది.

"రామ్ ఏమిటీ వేషం?" అందామె.

"పని పూర్తయినదాకా గడ్డం గీయకూడదని నిశ్చయించుకున్నాను" అన్నాడతను.

"గడ్డానికీ, నీ గెలుపుకూ ఏదేనా సంబంధం వుందా?" అడిగిందామె నవ్వుతూ.

"లేకపోవచ్చు! ఒక పనిమీద దృష్టి కేంద్రీకృతం అయినప్పుడు ఎన్నో యితర పనుల గురించి నిర్లక్ష్యం చేస్తాం."

"రామ్, ఇంతవరకూ ఎంత సంపాదించావు?"

"చేతిలోకి పైసా రాలేదు. నా దగ్గర వుండే ఐదారు వేలు ఎగిరిపోయాయి."

"బొంబాయిలో నువ్వు పెట్టిన కంపెనీ పేరేమిటి?"

"నేనింకా ఏ కంపెనీ పెట్టలేదు!"

"ఇంకా కంపెనీ పెట్టలేదు. ఉన్న డబ్బు అయిపోయింది. పది లక్షలు ఎలా వస్తుంది?"

ఆమె కళ్ళలోకి ఆప్యాయంగా చూశాడతను.

"రాణీ, డబ్బు రావడానికి డబ్బు అక్కరలేదు. వందలాది ప్రజలను ఆకర్షించే ఐడియా కావాలి. నువ్వు చెప్పేది వాళ్ళకు నచ్చితే డబ్బుతో ప్రజలు నీ దగ్గర కొస్తారు" అన్నాడు రామ్.

"నువ్వు చెప్పేది నాకర్థం కావడంలేదు!"

"రాణీ, నేను రేపు మార్నింగ్ ఫ్లయిట్ లో బొంబాయి పోతాను. బిజినెస్ విషయాలు మాట్లాడ్డం కోసం నేనిక్కడకు రాలేదు. ఇటుపైన మనం బిజినెస్ మాట్లాడొద్దు. మనిద్దరం కలిసి కూర్చుని లోకాన్ని మర్చిపోవాలి" అన్నాడతను.

ఆమె మరే ప్రశ్నలూ వేయలేదు. అతడి ఒళ్ళో నవ్వుతూ వాలిపోయింది.

## 7

వినాయకరావు యువకుడు. అతడు ఎల్. సి. ఇ. పాసయి ఒక కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాడు. నెలకు వెయ్యిరూపాయిల ఆదాయం వస్తోంది.

తలిదండ్రులు, ఆఖరి చెల్లెలు అతడి జీతం మీద సుఖంగా జీవిస్తున్నారు.

తండ్రి హార్ట్ పేషెంట్. ఒకసారి హార్టు యటాక్ వచ్చి బతికాడు. వినాయకరావు మంచి అవకాశాల కోసం ఎదురు చూస్తున్నాడు. ఆ సమయింలో కె.కె. కార్పొరేషన్ ప్రకటన అతడు ఒక దిన పత్రికలో చూశాడు.

తలిదండ్రులకు చెప్పకుండా అప్లికేషన్ పంపాడు. గల్ఫ్ దేశాలకు పోతే పెద్దపెట్టున జీతం వస్తుంది. చెల్లెలు పెళ్ళి చేయొచ్చు అని అతని ఉద్దేశం.

కొన్ని రోజుల తర్వాత యింటర్వ్యూకి రమ్మని

ఉత్తరం వచ్చింది. మద్రాసులో ఉన్న తాజ్ కోరొమండల్ హోటల్ కి వెళ్ళాడతను.

తన నంబరు పిలవగానే అతడు లోపలకు వెళ్ళాడు. గదిలో కె. కె. రావు, అతని సెక్రటరీ మనోరమ ఉన్నారు.

కొండలరావు అతడితో కరచాలనం చేసి కుర్చీలో కూర్చోమన్నాడు.

"మీరు అప్లికేషన్ లో అన్ని వివరాలూ యివ్వలేదు. మీకు పాస్ పోర్టు వుందా?"

"లేదు, సార్."

"వారం రోజుల్లో మేం యిప్పించగలం. మీ క్వాలిఫికేషన్ వాళ్ళకు అక్కడ నెలకు 8000 వస్తుంది. తర్వాత అది పెరగొచ్చు" అన్నాడు కె. కె. రావు.

వినాయకరావు హృదయం ఆనందంతో పొంగి పొంగింది. తనకిప్పుడు వచ్చేదానికి ఎనిమిది రెట్లు! తన ఫ్రెండు విక్టర్ గుర్తొచ్చాడు. అతడు తనతో ఎల్. సి.యి. చదివాడు. తర్వాత యెలాగో ఆరేబియా పోయాడు. విక్టర్ లక్షాధికారి అయ్యాడు.

"మిస్టర్ వినాయకరావు, అక్కడ బాచ్ లర్ గా నివసించడానికి ఒక గది కంపెనీ మీకిస్తుంది."

"నేనింకా బాచ్ లర్ నే."

"మీరు మాకు డిపాజిట్ గా పదివేలు కట్టాలి."

"ఎప్పుడు కట్టాలి?"

"నెలరోజుల్లో కట్టాలి."

"ఉద్యోగం రాకపోతే?"

"అది మీకు మేం వాపసు చేస్తాం, 90 రోజుల్లోపల."

వినాయకరావు మౌనంగా ఉండిపోయాడు.

"కట్టలేరా?"

"నాది పేదకుటుంబం."

క.క. రావు నవ్వాడు.

"ఆ పేదరికానికి గుడ్ బై చెప్పాలనేగా మీరు గల్ఫ దేశాలకు వెళ్ళడం?"

"అవును, సార్. ఇక్కడ ఎంతొచ్చినా ఏమీ మిగలదు. పదేళ్ళు పని చేసినా పాతిక వేలు దాచలేం."

"డిపాజిట్ కట్టలేని వాళ్ళకు అక్కడకు వెళ్ళే అవకాశం వుండదు."

"కట్టడానికి ప్రయత్నిస్తాను."

"మీరు సెలక్టయితే మీకు రాస్తాం. వెంటనే డిపాజిట్ కట్టండి. తర్వాత మీరు యెప్పుడు డ్యూటీలో చేరవలసిందీ రాస్తాం."

"సార్, ఒక చిన్న విన్నపం. నాకు గల్ఫలో యే దేశంలో ఉద్యోగం వస్తుంది?"

"ప్రస్తుతం చెప్పలేను. అరేబియా, కువేట్, మాస్కట్, దుబాయి, కాటార్ అక్కడెక్కడేనా మీకు రావచ్చు."

"దుబాయిలో వస్తే సంతోషిస్తాను. అక్కడ మా చుట్టం వున్నాడు."

"ఆల్ రైట్" అన్నాడు కొండలరావు.

కొండలరావు అప్లికేషన్ పక్కనే "దుబాయి ప్రిఫర్డు" అని రాసుకున్నాడు.

"మిస్టర్ వినాయకరావు, మీరు బయటకెళ్ళినపుడు 93ని లోపలకు రమ్మనండి, ప్లీజ్" అంది మనోరమ.

"ఎట్ యువర్ సర్వీస్!" అని అతను వెళ్ళిపోయాడు.

మరో వ్యక్తి లోపలకొచ్చాడు.

"నంబర్ 9౯, మిష్టర్ ఎమ్. నటరాజన్" అంది మనోరమ.

బయట కాస్సేపు నిలబడి అక్కడ కూర్చున్న కాండిడేట్సువైపు చూశాడు వినాయకరావు. రెండువందల మంది వున్నారు.

వాళ్ళందరూ సెలక్టు కారేమో! కొందర్ని ఇంటర్వ్యూ చేసి యింటికి పొమ్మనొచ్చు. ఈ విదేశీ జాబ్‌కి తను సెలక్టు అవుతాడా? వాళ్ళ ఉత్తరం వచ్చిందాకా తెలియదు.

వారం రోజుల్లో బొంబాయినుంచి అతడికి ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరాన్ని అతడు పదిసార్లు చదువుకున్నాడు.

"దుబాయిలో వుండే ఫరూక్ సివిల్ యింజనీర్స్ కంపెనీలో మీకు ఉద్యోగం లభించింది. మీకు వాళ్ళు నెలకు 10 వేలు యిస్తారు. మీరు వెంటనే డిపాజిట్‌గా 10 వేలు మాకు కట్టండి. మీరు వెంటనే పాస్‌పోర్టుకు అక్కడ అప్లికేషన్ పెట్టండి. అది మీకు తొందరగా వచ్చేటట్లు మేం చూస్తాం. ఒకవేళ యీ ఉద్యోగం మీకు అక్కరలేకపోతే మాకు వెంటనే రాయండి. మరో కాండిడేట్‌కి ఉపయోగపడుంది" అని ఆ ఉత్తరంలో రాసివుంది.

తల్లి తెచ్చిన కాఫీ తాగి వినాయకరావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. తను అదృష్టవంతుడే. అందుకే ఆ ఉద్యోగం వచ్చింది. కాని పదివేలు ఎలా కట్టడం?

అమ్మ మెళ్ళో నగలు లేవు. ఇంట్లో కాష్ ఎక్కువగా లేదు. తను ఏం చేయడం?

వినాయకరావు ఆలోచిస్తున్నాడు.

తన తండ్రి యిప్పుడెలా వున్నా ఒకప్పుడు బాగా బ్రతికాడు. అతడికి మంచి స్నేహితులు వున్నారు. నాన్నతో యీ ఉద్యోగం గురించి చెప్పడం మంచి దేమో!

వినాయకరావు తండ్రి కూర్చున్న హాల్లోకి వెళ్ళాడు. తనకొచ్చిన వుత్తరం తండ్రి కిచ్చాడు.

రామారావు వుత్తరాన్ని మెల్లిగా చదివాడు. ఆశ్చ ర్యంగా కొడుకువైపు చూశాడు.

"ఏమిట్రాయిది? నీకు పదివేలు జీతమా? ఇదేదో మోసంలావుంది," అన్నాడు తండ్రి.

"ఇది మోసంకాదు నాన్నా. గల్ఫదేశాల్లో జీతాలు అలాగే వుంటాయి."

"అంత జీతం వాళ్ళు ఎలా యిస్తారు?"

"నాన్నా,ఆ దేశాలను గురించి నీకు బాగా తెలియదు. అక్కడ దొరికే పెట్రోలు ప్రపంచమంతటా అమ్ముడవు తుంది. ఆ దేశాలకు విశేషమైన ఆదాయం వుంది పెట్రోలు వలన అక్కడ మంచి నీళ్ళు కొనుక్కోవాలి. ఏమీ అక్కడ పండదు. ఈ లోకానికి అత్యవసరమైన పెట్రోలు మాత్రం దొరుకుతుంది. పెట్రోలు మూలంగా ఆ దేశాలు ఎంతో డబ్బును సంపాదిస్తున్నాయి."

"మోసం లేదంటావు!"

"లేదునాన్నా. నా ఫ్రెండు ఒకడు అరేబియావెళ్ళి లక్షాధికారి అయ్యాడు. ఆ వుద్యోగంలో నేను చేరితే చెల్లి పెళ్ళి చేయొచ్చు. నేను మాస మాసం మీకు డబ్బు పంపుతాను"

"ఇదంతా బాగానేవుంది. కాని వాళ్ళకు పదివేలు కట్టాలి. ఎలా కడ్తాం?" అడిగాడు తండ్రి.

"అందుకే ఆ వుత్తరం మీకు చూపించాను," అన్నాడు వినాయకరావు.

రామారావు కాస్సేపు ఆలోచించి కుర్చీలోంచి లేచాడు. కొడుకువైపు చూశాడు.

"ఒరే అబ్బిగా, అలా రామ్మూర్తియింటికి వెళ్ళి వస్తాను. అతను యీ మధ్యనే రిటైరయ్యాడు. అతడి దగ్గర యాభైవేలు రొక్కంగా వుందని చెప్పాడు. ఏం చేస్తే బాగుంటుందో చెప్పమని నన్ను అడిగాడు."

"రియల్ లక్ నాన్నా! ఆ వుద్యోగంలో చేరాక రెండు నెలల్లో ఆయన అప్పు తీర్చేయవచ్చు," అన్నాడు వినాయకరావు.

రామారావు గొడుగు తీసుకుని బయటకు వెళ్ళాడు. గుమ్మం బయట నిలబడి వినాయకరావు మెల్లిగా నడుస్తూన్న తండ్రివైపు చూస్తూ వుండిపోయాడు.

గంటలో తండ్రి తిరిగొచ్చాడు. ఒక కవర్ను కొడుక్కి యిచ్చాడు.

"రామ్మూర్తి దేవుడిలా నీకు పదివేలు యిచ్చాడు. ఆ డబ్బు కవర్లో వుంది. ఒరే అబ్బిగా, రెండు నెలల్లో అది అతడి అడ్రెసుకే పంపించు. ఈ వుత్తరం చూసి రామ్మూర్తి చాలా సంతోషించాడు. నిన్ను తప్పక దుబాయి వెళ్ళమన్నాడు," అన్నాడు తండ్రి.

వినాయకరావు తండ్రివైపు చూశాడు.

"నాన్నా, తప్పక రామూర్తిగారి అప్పు తీర్చేస్తాను. ఆయనకు వడ్డీరూపంలో కొంత ఎక్కువ యిస్తాను," అన్నాడు వినాయకరావు.

"రామ్మూర్తి వడ్డీకోసం యివ్వలేదు. అయినా నువ్వు సంతోషంగా ఎక్కువ యివ్వొచ్చు," అన్నాడు తండ్రి.

"నాన్నా, రేపు పొద్దుటే డి.డి. ద్వారా యీ డబ్బు ఆ కంపెనీకి పంపేస్తాను. మరో విషయం నాన్నా. ప్రస్తుతం నేను చేసే జాబ్ రిజైన్ చేసేస్తాను."

రామారావు కొడుకువైపు చూశాడు.

"ఒరేయి, రిజైన్ చేయడం ఎందుకురా? సెలవు పెట్టు. దుబాయి వెళ్ళి వుద్యోగంలో చేరు. అది నీకు నచ్చకపోతే వెనక్కి వచ్చేయొచ్చు. చేతిలోవున్న వుద్యోగంలో చేరొచ్చు."

"అలాగే చేస్తాను, నాన్నా!"

ఆనాటి రాత్రి వినాయకరావు నిద్రపోలేదు. మర్నాడు పొద్దుటే డి.డి. తీసుకుని అతడు బొంబాయి కంపెనీకి పంపించాడు. పాస్‌పోర్టు కోసం ప్రయత్నాలు సాగించాడు.

అనేక పనులు చేసి వినాయకరావు రాత్రి పదింటికి యింటికొచ్చాడు. తల్లి అతడికి ఎదురయ్యింది.

"నాన్న పడుకున్నాడా?"

ఆమె తలాడించింది.

"ఈ సంవత్సరంలో చెల్లి పెళ్ళి వైభవంగా జరుగుతుందమ్మా," అన్నాడతను.

తల్లి ఆనందంగా అతడి వైపు చూసింది.

## 8

కె.కె. కార్పొరేషన్ ఆఫీసులో ఏర్‌కండిషండ్ గదిలో షేక్ సులైమన్ అతడి కెదురుగా కూర్చున్నాడు. బయట హాల్లో మనోరమ, టైపిస్టు, నౌఖరు మాత్రం వున్నారు.

సులైమన్ నవ్వుతూ కొండలరావువైపు చూశాడు.

"మిస్టర్ కె.కె. రావు, యూ ఆర్ డూయింగ్

ఫైన్!"

"థాంక్స్, సార్," అన్నాడు కొండలరావు.

"ఈ కార్పొరేషన్ జయప్రదంగా సాగుతోంది. నేను రేపు దుబాయివెళ్తున్నాను. ఫుల్ రిపోర్టు యివ్వండి."

కొండలరావు ఫైలు తెచ్చాడు. పెద్ద లిస్టును అతడి కిచ్చాడు.

"ఈ లిస్టులో వున్నవాళ్ళందర్నీ నేను సెలక్టు చేశాను. వాళ్ళకు వుత్తరాలు పంపాను," అన్నాడతను.

లిస్టులో 275 మంది పేర్లు వున్నాయి. వాటిని సులైమన్ పరీక్షగా చూశాడు.

"ఎంతమంది డిపాజిట్ కట్టారు?"

మరో లిస్టును కొండలరావు అతడికిచ్చాడు. అందులో 100 మంది పేర్లువున్నాయి.

"వాళ్ళు కట్టింది మొత్తం 10 లక్షలు. పత్రికల్లో ప్రకటనలకూ, ఆఫీసు ఖర్చులకూ, ప్లేను ఖర్చులు వగైరాలకు, స్టాఫ్ జీతాలకూ లక్షా యిరవై వేలు అయింది. తతిమ్మా డబ్బు బాంకిలో వుంది."

"తతిమా వాళ్ళు డిపాజిట్ కడ్తారనే నమ్మకం మీ కుందా?" అడిగాడు సులైమన్.

"మరో 100 మంది కడ్తారని నా నమ్మకం."

"ఫైన్. ఎనభై వేలు మీరు బాంకిలో వుంచుకుని 8 లక్షలు డ్రా చేసి రేపు పొద్దుట నాకు రొక్కంగా యివ్వండి. అది నేను నాతో తీసుకు వెళ్తాను."

"అలాగే, సార్."

"మరో పదిహేను రోజుల్లో నేను దుబాయినుంచి తిరిగి వస్తాను. అప్పుడు మీ రిపోర్టు వింటాను."

"యస్సార్."

అతడు మరో లిస్టుతీసి యిచ్చాడు.

"వీళ్ళకు పాస్‌పోర్టులు లేవు. అప్లయి చేశారు. అవి తొందరగా వచ్చేటట్లు మనం చూడాలి" అన్నాడు కొండలరావు.

"ఈజీ జాబ్. అది నేను చూస్తాను" అన్నాడు సులైమన్.

సులైమన్ కుర్చీలోంచి లేచాడు.

అతడివైపు నవ్వుతూ చూశాడు.

"కీప్ కాష్ రెడీ బై టెన్. నేను వచ్చి తీసుకుంటాను."

"సిద్ధంగా వుంటుంది."

"మీరే స్వయంగా వెళ్ళి కాష్ తీసుకోండి. ఎవర్నీ పంపొద్దు."

"పెద్ద మొత్తాలు డ్రా చేయడానికి నేనే స్వయంగా వెళ్తాను" అన్నాడు కొండలరావు.

అతడితో కరచాలనం చేసి సులైమన్ వెళ్ళిపోయాడు.

మర్నాడు పదింటికి సులైమన్ ఆఫీసుకు వచ్చాడు. వినయంగా కొండలరావు అతడికి 8 లక్షలు రొక్కంగా అందజేశాడు.

"మిస్టర్ రావు, డిపాజిట్ కట్టినవాళ్ళ లిస్టు కాపీ కావాలి" అన్నాడు సులైమన్.

ఫైలులోంచి లిస్టు కాపీని కొండలరావు యిచ్చాడు. సులైమన్ నోట్ల కట్టలను తన లెదర్ బాగ్‌లో సర్దుకుని, లిస్టును లోపల పడేశాడు.

"నుళ్ళా పత్రికల్లో పబ్లిసిటీ యివ్వాలని అనుకుంటున్నాను" అన్నాడు కొండలరావు.

"నాట్‌నౌ! నేను తిరిగొచ్చాక చెప్తాను. ఇంతవరకూ

మీరు సెలక్టు చేసిన వాళ్ళను గల్ఫ్ దేశాలకు పంపి, వాళ్ళు ఉద్యోగాల్లో చేరాక పబ్లిసిటీ ఇవ్వడం మంచిది" అన్నాడు సులైమన్.

"అదీ మంచిదే" అన్నాడు కొండలరావు.

"అర్జంటుగా మీతో మాట్లాడాలంటే యేం చెయ్యాలి?" అడిగాడు కొండలరావు.

"దుబాయికి ఫోన్ చేయొద్దు. టైమ్స్ ఆఫ్ ఇండియా దినపత్రికలో 'విజిట్ నీడెడ్' అని ప్రకటన యివ్వండి. నేను వెంటనే వస్తాను" అన్నాడు సులైమన్.

"అలాగే చేస్తాను" అన్నాడు కొండలరావు.

అతడితో కరచాలనం చేసి సులైమన్ తన బాగ్‌తో బయటకు వెళ్ళిపోయాడు.

## 9

రాణి రిసీవర్ తీసి "హలో!" అంది.

"రామ్ ఫ్రమ్ ఢిల్లీ" అన్నాడతను.

"రామ్, ఎలా వున్నావు? నిన్ను చూసి రెండు నెలలు దాటింది!" అందామె.

"త్వరలో నీతో శాశ్వతంగా వుంటాను."

"ఎంత పోగు చేశావు?"

"ఇంకా ఏదీ చేతికి రాలేదు."

"ఢిల్లీలో ఏం చేస్తున్నావు?"

"ఇండియాకు రాజధాని ఢిల్లీగా! మంత్రులతో పనుండి యిక్కడికొచ్చాను."

"ఏం చేస్తున్నావో ఏమో అంతా నాకు అగమ్యగోచరంగా వుంది. నాన్నను నేను కన్విన్స్ చేసి మన పెళ్ళికి ఒప్పిస్తాను. పది లక్షలకోసం వేటాడ్డం మాని వెంటనే మద్రాసు వచ్చేయి" అందామె.

"ఓడిపోయి వెనక్కి రమ్మంటావా? నువ్వే ఆలో చించు. నేను నీకాబోయే భర్తను."

"నాన్న ఏమీ అనుకోడు! నాన్న దగ్గర వల్లమాలి నంత డబ్బుంది."

"రాణీ, నన్ను క్షమించు. డబ్బుతో త్వరలో వస్తాను. అది చూసి నువ్వు ఆనందిస్తావు" అన్నాడతను.

మరి కొంత సేపు మాట్లాడి రామ్ రిసీవర్ పెట్టేశాడు.

* * *

రెండు వారాలు దొర్లిపోయాయి.

టైమ్స్ ఆఫ్ ఇండియాలో యిచ్చిన ప్రకటన చూసి షేక్ సులైమన్ బొంబాయి వచ్చి, కొండలరావును కలుసు కున్నాడు.

కొండలరావు గాభరాగా వున్నాడు.

"రిపోర్టు ప్లీస్" అన్నాడు సులైమన్

"ఒక విషయం మీకు మొదట చెప్పాలి. మద్రా సులో పి. రామచంద్రన్ అనే వ్యక్తిని యింటర్వ్యూ చేసి సెలక్టు చేశాను. పదివేలు డిపోజిట్ కట్టమని అతడికి రాశాను. అతడు వచ్చి నన్ను కలుసుకున్నాడు."

"గో ఆన్!" అన్నాడు సులైమన్.

"అతడు ఒక సి.బి.ఐ. ఆఫీసరు. నాకు కార్డు కూడా చూపించాడు. ఒక రోజు నాలుగ్గంటలపాటు నా ప్రాణాలు తీశాడు. ఈ కంపెనీకి మినిస్ట్రీ ఆఫ్ లేబర్ నుంచి లైసెన్స్ లేదన్నాడు. పదివేలు డిపోజిట్ కట్ట మనడం నేరం అన్నాడు. ఎంత కలక్టు అయిందన్నాడు. నాకు భయం వేసింది. మీరు వచ్చాక మీతో మాట్లాడ మన్నాను. మళ్ళా వస్తానని అతను వెళ్ళిపోయాడు."

"డోంట్ వర్రీ! అతడి విషయం నేను చూసు

కుంటాను" అన్నాడు సులైమన్.

"నాకిప్పుడు ధైర్యంగా వుంది."

"ఎంతమంది డిపాజిట్ కట్టారు?"

"మరో నూరుమంది కట్టారు. బాంకిలో పది లక్షలు అలాగే వుంది."

"మిష్టర్ రావు. మీరు వెంటనే వెళ్ళి 8 లక్షలు డ్రా చేసి తీసుకు రండి" అన్నాడు సులైమన్.

కె.కె. రావు వెంటనే బయటకు పరుగెత్తాడు.

షేక్ సులైమన్ కొంచెం స్కాచ్ విస్కీ తాగి సిగరెట్ వెలిగించాడు.

కాస్సేపట్లో కొండలరావు తిరిగి వచ్చాడు. నోట్లకట్టలను అతడికిచ్చాడు. డబ్బును సులైమన్ తన బాగ్‌లో పెట్టుకున్నాడు. డిపాజిట్ కట్టిన వాళ్ళ లిస్టు తీసుకున్నాడు.

రెండు గ్లాసుల్లో అతడు విస్కీ పోసి సోడా కలిపాడు.

"మిస్టర్ కె.కె. రావు, డ్రింకిట్!" అన్నాడు.

ఇద్దరూ తాగుతూ కూర్చున్నారు.

సులైమన్ అతడివైపు సూటిగా చూశాడు.

"మిస్టర్ కె.కె. రావు, మీరు నాతో ఎంతకాలం పనిచేశారు?"

"ఆరు నెలలు, సార్."

"మీ బాంకి అకౌంటులో మొత్తం నాలుగు లక్షలు నేను వదిలిపెట్టాను. రైట్"

"మొదటి రెండూ, యిప్పుడు రెండూ నాలుగైంది, సార్."

"పి. రామచంద్రన్ మూలంగా మీరు కష్టాల్లో యిరుక్కోవడం నా కిష్టంలేదు. అతడు డేంజరస్ మేన్.

బ్యాంకిలో వున్నదంతా తీసుకుని, స్టాఫ్‌కి జీతాలు ఇచ్చేసి, మీరు వెంటనే ఎక్కడికేనా పారిపొండి. మీ దగ్గరున్న డబ్బుతో, మారు పేరుతో సుఖంగా జీవించవచ్చు!"

గ్లాసులోని విస్కీని కొండలరావు అమాంతంగా తాగేశాడు.

"పారిపోక తప్పదా?"

"డబ్బుకోసం ఏదో కంపెనీ పెట్టి నాటకమాడం. ఈ కంపెనీ మీ పేరులో వుంది. పోలీసులు మిమ్మల్నే పట్టుకుంటారు. అందువలన ముందుగా పారిపోవడం మంచిది."

"ఐ రన్! వెంటనే పారిపోతాను," అన్నాడు కొండలరావు.

"రేపు యీ పాటికి యిక్కడ ఆఫీసు వుండకూడదు. అంతా రహస్యంగా జరగాలి," అన్నాడు సులైమన్.

"అలాగే చేస్తాను సార్," అన్నాడు కొండలరావు.

సులైమన్ అతడికి గుడ్‌బై చెప్పి బయటకు వెళ్ళి పోయాడు.

## 10

హాల్లో కొచ్చిన రామ్ వైపు నాగేశ్వరరావు, అతడి కూతురు ఆశ్చర్యంగా చూశారు.

"నువ్వా!" అన్నాడు నాగేశ్వరరావు.

"రామ్," అంది రాణీ.

అతడు లెదర్ బాగ్‌ను నాగేశ్వరరావు ముందు వుంచాడు.

"రెండేళ్ళ లోపల 10 లక్షలు సంపాదించి వచ్చి మీకు చూపిస్తానన్నాను. ఆరు నెలల్లోనే తిరిగి వచ్చాను. ఆ బాగ్‌లో 16 లక్షలు వుంది. చూసుకోండి!"

బాగ్‌లోని నోట్లకట్టలను నాగేశ్వరరావు లెక్కపెట్టి

చూశాడు. ఆశ్చర్యంతో అతడు రామ్‌వైపు తిరిగాడు.

"రామ్, నాకు సరైన అల్లుడివి నువ్వు!" అన్నాడు.

"మా పెళ్ళికి ముహూర్తం పెట్టించండి. ఈ పెళ్ళి సమయంలో నాకు బహుమతిగా కొంత డబ్బివ్వాలి. అప్పుడే రాణీని పెళ్ళాడ్తాను!" అన్నాడు రామ్ నవ్వుతూ.

"ఎంత కావాలో చెప్పు!"

"నాలుగు లక్షలు!"

నాగేశ్వరరావు కూతురి వైపు చూశాడు.

"అమ్మాయి, ఇనప్పెట్టెలోంచి నాల్గు లక్షలు తీసి అతడికియ్యి," అన్నాడు నాగేశ్వరరావు.

"థాంక్స్, సార్," అన్నాడు రామ్.

"రామ్, థాంక్స్‌తో తృప్తిచెందను. నా ఆరోగ్యం బాగాలేదు. ఇటుపైన నువ్వూ, రాణీ నా కంపెనీలను నడపాలి. ఆ బాధ్యత మీదే!" అన్నాడు నాగేశ్వరరావు.

"పెద్ద బరువు నాకిస్తున్నారు!" అన్నాడు రామ్.

నాగేశ్వరరావు నవ్వుతూ అతడివైపు చూశాడు.

"ఆరునెలల్లో 16 లక్షలు గడించిన వ్యక్తి చేతుల్లో నా కంపెనీలు బాగా అభివృద్ధి చెందుతాయనే విశ్వాసం నాకుంది," అన్నాడతను.

"ఆ నమ్మకం వున్నందుకు సంతోషం," అని రామ్ రాణీ వైపు నడిచాడు.

"ఈ బాగ్ నీది," అన్నాడు నాగేశ్వరరావు.

లెదర్ బాగ్ తీసుకొని రామ్ ఆమెతో మేడమీదున్న పడగ్గదిలోకి వెళ్ళాడు.

రాణీ అతడిని ఆప్యాయంగా కౌగలించుకుంది.

"రామ్, యింతడబ్బు ఎలా సంపాదించావు?" అడిగిం దామె.

"షేక్ సులేమన్ పేరుతో యీ డబ్బు పోగు చేశాను. ఇది పోగు చేయడానికి సాత నాలుగు లక్షలు ఖర్చయింది. నువ్వు 4 లక్షలు యిస్తే నా దగ్గర ఇరవై లక్షలు వుంటుంది. ఈ యిరవై లక్షలూ డిపాజిట్లు కట్టిన వాళ్ళకు వెంటనే రేపు వాపసు చేయ్యాలి! గల్ఫ్ దేశాల్లో పెద్ద వుద్యోగాలు ఆశించి వాళ్ళు యీ డబ్బు నా కిచ్చారు. వాళ్ళు నష్టపోకుండా చూసే బాధ్యత నాది," అన్నాడు రామ్.

"రేపే వాళ్ళకు పంపేద్దాం!" అంది రాణీ.

—:అయిపోయింది:—

సీరియల్




(గత సంచిక తరువాయి)

అది అంత తేలికైన పనికాదేమో! మనతో మాట్లాడిన కళ్యాణస్వామి అనుచరుడు దుర్గం రెండో ద్వారం దగ్గర కదా మనల్ని ఎదురుచూడమన్నాడు! అక్కడ రాళ్ళ గుట్టలు ఏవో వుంటాయని, వాటి వెనక దాక్కొని వుండమని చెప్పాడుకదా, పోయి చూద్దామా?"

"మరి మిస్ దీప్తి అరుపులు....?" హిమవంత్ మాటతో తక్కిన యిద్దరు సాభిప్రాయంగా మాశారతని వంక.

"ఎందుకో మళ్ళీ వినిపించలేదు. నాకు చాలా ఆందోళనగానే వుంది ఆమె కేమయిందోనని! కాని చూస్తూ చూస్తూ పులి బోనులో తలపెట్టబోతున్నాం. ముందు జాగ్రత్త తీసుకోవటం చాలా అవసరం...." అన్నాడు కార్తీక్.

అశ్విని వెంటనే, "ఇంతదాకా వచ్చాక మనం ఏమయి

పోయినా ఫరవాలేదు! ఓ పక్క మిస్ దీప్తి ఆపదలో వుంది. మరోపక్క వర్మ అభిలాష్ వీళ్ళకు చిక్కివుండొచ్చు నని నిరాధారణగా తెలుస్తోంది. ఇంకా ఉపేక్షించటం దేనికి? మన ముగ్గురి ప్రాణాలకోసమా?" అన్నాడు ఆవేశంగా.

కార్తీక్ హిమవంత్ కూడా అతని మాటలకు బాగా ఉత్తేజితులయ్యారు.

కార్తీక్ తుపాకీని ఫర్మ్‌గా పట్టుకున్నాడు. అశ్విని అప్పటికే ముఖద్వారానికున్న చిన్న గేటు ద్వారా లోపలికి అడుగుపెట్టబోయినవాడల్లా చటుక్కున తలతిప్పి స్నేహితులిద్దరివంకా చూసి, "ఎవరో యిటే వస్తూన్నారు. వాళ్ళ చేతుల్లో శూలాలున్నాయి. ఎటాక్ చేద్దామా?" అన్నాడు.

కార్తీక్ వెంటనే, "వద్దు, వద్దు! వాళ్ళ కళ్ళబడటం మంచిది కాదు! వాళ్ళని పోనివ్వు. మనం తర్వాత లోపలికి వెళ్దాం. మన ఉనికి శత్రువులకి తెలిసిపోతే మనవాళ్ళు మనకి దక్కరు!" అన్నాడు.

అశ్విని అప్పటికే గేటు బయటికి వచ్చేశాడు.

ముగ్గురు చకచక దుర్గం రెండో ద్వారం దగ్గరికి హడావిడిగా పరుగెత్తి, చిదానందుడు చెప్పిన రాళ్ళ గుట్ట వెనక దాక్కున్నారు.

కాసేపటికి నలుగురు అనుచరులు అటుగా రావటం వాళ్ళకు కనిపించింది. నలుగురి చేతుల్లోనూ శూలాలున్నాయి! ఎవరికోసమో వెతుకుతున్నట్టుగా వున్నాయి వాళ్ళ చూపులు! జాగ్రత్తగా అడుగులో అడుగేసుకుంటూ వస్తున్నారు.

"వీళ్ళు నలుగురు వేరే వ్యక్తులు మనతో మాట్లాడిన

వాళ్ళు కాదు! అంటే కళ్యాణస్వామికి నమ్మినబంటులు, మనకు నూటికి నూరుపాళ్ళు శత్రువులు అన్నమాట!" అన్నాడు కార్తీక్.

అశ్వని, హిమవంత్ ఏదో అనాలని నోళ్ళు తెరవబోయి, ఆ అనుచరులు రాళ్ళగుట్ట దగ్గరగా రావటంతో మౌనం వహించాడు. అనుచరులు కొద్దిక్షణాలు రాళ్ళగుట్ట దగ్గరే నిల్చున్నారు.

"చిదానందుడు చెప్పింది నిజమే నేమో, ఆ వ్యక్తులు అతనికి కనిపించలేదేమో .." అన్నాడో వ్యక్తి వరదుడితో.

వరదుడు కోపంగా చూశాడతనివంక. "నీకేం తెలుసు చిదానందుడి సంగతి? ఎన్నాళ్ళుగానో, మన కళ్యాణస్వామిని మట్టుబెట్టి, నిధి స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. కాని పన్నెండేళ్ళుగా మన గురువుగారికి తెలియని నిధి రహస్యం తనకేం తెలుస్తుందని సంకోచించాడిన్నాళ్ళు స్వామీజీ నిధి దగ్గరకు పోవటానికి దారి కానక యిన్నాళ్ళుగా దేవిని ఉపాసిస్తున్నా ఫలితం కనిపించలేదు. కాని ఎవరో ఊరు పేరు తెలీని యీ మనుషులికి ఆ రేకు కనపడటం చాలా చిత్రంగా వుంది!....ఆ రేకుకోసమే శత్రువులతో చిదానందుడు లాలూచీపడి ఉంటాడని నా గట్టి నమ్మకం!" అన్నాడు.

వింటున్న ముగ్గురు ఉలిక్కిపడి ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"కాని, స్వామిజీ అంత ఘోరంగా అతన్ని చంపేస్తారని మనమెవరమూ ఊహించలేకపోయాం!" అన్నాడొక అనుచరుడు.

కార్తీక్, అశ్వని, హిమవంత్ త్రుళ్ళిపడ్డారు. అంటే

ఆ వ్యక్తి — చిదానందుడు — కళ్యాణస్వామి చేతిలో చచ్చిపోయాడా? యేమిటి కారణం? తమతో అతను, అతని సహచరులు మాట్లాడుతుండగా ఎవరు చూశారు? ఈ నలుగురిలోను ఎవరో చూసి వుండాలి!

వరదుడు విచారం సూచించే స్వరంతో, "నేనూ అనుకోలేదు. అనవసరంగా గురువుగారిమీద తిరుగుబాటు చేశాడు. అందుకే కళ్యాణస్వామికి కోపమొచ్చి తల నరికేశాడు. ద్రోహానికి ఫలితం అనుభవించక తప్పదు కదా!" అన్నాడు.

"స్వామీజీ పన్నెండేళ్ళుగా యీ కళ్యాణదుర్గంలో అన్వేషిస్తున్నారు కదా, ఆ రాగిపలక విషయం ఆ మాత్రం తెలుసుకోలేకపోయారా?"

"అదే విచిత్రం! ఆయన యిదివరలో నిధి తవ్వటం కోసం ఎంతో ప్రయత్నించారట. కాని కళ్యాణదుర్గం అంతా తవ్వినా నిధి దొరకలేదట! అప్పట్నుంచి దేవీ ఉపాసన మొదలెట్టారు. క్షుద్రశక్తుల్ని వశపరచుకున్నారు. వాటి సాయంతో నిధి దారి కనుక్కోవాలని ఆయన ప్రయత్నం...." వరదుడు అన్నాడు.

"మరి దారి కనుక్కోలేక పోయారెందుకని?"

"క్షుద్ర దేవతలు తమకి కన్నెపిల్ల రక్తంతో తర్పణ చెయ్యమని అడిగారుట. అందుకే ఆ పిల్లని గుట్టుచప్పుడు కాకుండా తెచ్చారు గురువుగారు!"

"మరి బలిచ్చేస్తే దేవి నిధికి దారిచూపిస్తుందికదా, యిక ఆ రాగి రేకుతో పనేమిటి?"

"రాగి రేకుతో నిధి దాచిన స్థలం, అది చేరటానికి దారి, గుర్తులతోసహా చక్కగా చూపించబడి వుంటుందట! అది దొరికివుంటే, అసలు మన కళ్యాణస్వామి

యీ దేవి ఉపాసనలు, బలుల గొడవకే పోయేవాడు కాదు...."

"మరి యిన్నాళ్ళుగా, యింత దగ్గర్లో ఉన్న ఆ నిధి రహస్యం చెప్పే రాగిరేకను ఎందుకు వెతుక్కో లేరు?"

వరదుడు నవ్వి, "అది చిదంబర రహస్యం! అక్కడ పర్ణశాలలో వున్నది నిజంగా తపస్సు చేసుకునే మునీశ్వరు డెవరో అనుకున్నాం కదా యిన్నాళ్ళు!" ఓ క్షణం ఆగాడు.

తక్కిన ముగ్గురు చెవులప్పగించి వింటున్నారు. కార్తీక్ బృందం కూడా చాలా ఆసక్తిగా వింటున్నారు.

"ఈ దుర్గాధిపతి కళ్యాణవర్మ ఓసారి బలవంతుడైన శత్రువు నెదుర్కొలసి వచ్చిందట! అయితే దురదృష్ట వశాత్తు ఓడిపోవటం జరిగిందట. ఆడవాళ్ళు ప్రాణ త్యాగం చేసేశారట! అప్పటికి రాజవంశానికి ఒకేఒక వారసుడు మిగిలాడట! ఈ ఆస్తి యావత్తు తన కొడుకుకే చెందాలని కళ్యాణవర్మ అనుకున్నాడట. అందుకే బంగా రాన్నంతా ఓచోట పాతిపెట్టి, ఆ నిధికి దారి, తక్కిన ముఖ్యమైన వివరాలు సంస్కృతంలో ఓ రాగి పలకమీద వివరంగా రాసి, దాన్ని తన నమ్మినబంటు కెవరికో యిచ్చాడట. ఆ తర్వాత కళ్యాణవర్మ శత్రువులతో వీరో చితంగా పోరాడి, వీరస్వర్గం పొందాడని చెప్పుకుంటారు.

పర్ణశాలలో తపస్సు చేసుకునే సిద్ధుడ్ని చూశారు కదా! అతనక్కడ యెందుకున్నాడో ఎన్నాళ్ళుగా వున్నాడో తెలుసుకోవాలని మన కళ్యాణస్వామి ప్రయ త్నించారు. కాని అతను నిత్యం ధ్యాన సమాధిలో వుండి మన గురువుగారికేమీ సమాధానం చెప్పలేదు. అతను కళ్ళే తెరిచేవాడు కాదు. అతనివల్ల మనకేలాంటి

ప్రమాదం లేదని గ్రహించిన గురువుగారు అతని జోలి కెన్నడూ పోలేదు.

కాని రాగిపలక సిద్ధుడి దగ్గరే దొరకటం, అదీ ఎవరో పరాయివాళ్ళకు దొరకటం—మన గురువుగారికి ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగించింది. వెంటనే రాగిఫలకం తెమ్మని మనందర్నీ అజ్ఞాపించాడు-ఇదీ విషయం!"

తక్కిన అనుచరులతో బాటు శాస్త్రీక్ బృందం నోళ్ళు తెరుచుకొని విన్నారు. రాగిఫలకం వెనక యింత కథ దాగున్నదంటే చాలా అద్భుతమనిపించింది వాళ్ళకు!

అనుచరుల్లో ఒకడు అడిగేడు కూడా. "మరి రాగిఫలకం దొరికితే, ఆ అమ్మాయిని క్షుద్ర దేవతలకు బలివ్వవలసిన పని లేదు కదా....!" అన్నాడు.

"ప్రస్తుతం కళ్యాణస్వామి ఆ ప్రయత్నం విరమించుకున్నట్టే! కాని ఆ పిల్లను మాత్రం ఆయన వదిలిపెట్టడు. ఓ రహస్యం చెప్పనా....ఆ పిల్లను మన స్వామీజీ వరించారు. నిధి దొరకగానే ఎక్కడికో దూరదేశాలకు ఆ పిల్లను తీసుకుపోదామని ఆయన ఉద్దేశ్యం!"

శాస్త్రీక్ గుప్పిళ్ళు బిగుసుకున్నాయి. అతని దవడ కండరం ఉబ్బింది. ఆవేశంతో ఛాతీ పొంగింది. ఉఛ్వాస నిశ్వాసాలు బరువయ్యాయి.

"సరే యిప్పుడు జరగబోయేది ఆలోచించు. ఆ వ్యక్తులేమయ్యారో జాడలేదు. మాళిగలోకి వెళ్ళి చూద్దామా?" అన్నాడొకడు.

"ఒకవేళ మాళిగలోపల అసిపంజరాల నాట్యం చూశాక వెనక్కు తిరిగి టైగర్ హిల్స్‌కి పారిపోయారేమో...."

"ఆసమయంలో వెళ్ళటం జరిగే పని కాదు. సారంగంలో

కన్నుచించుకున్నా ఏం కనిపించలేదు! నా ఊహే నిజమయితే వాళ్ళపాటికి ఈ దుర్గం చుట్టుపక్కలే ఎక్కడో దొరకవచ్చు!"

"చిదానందుడు మనవాళ్ళను వెంట తీసుకువెళ్తూ నాలుగు కాగడాలు పట్టుకెళ్లాడుకదా! వచ్చినపుడు రెండే వున్నాయి. అంటే తక్కిన రెండూ యేమయి నట్టు....?"

వరదుడు అతనివంక ప్రశంసాపూర్వకంగా చూసి, "బాగా కనిపెట్టావే! అవి రెండూ శత్రువులకిచ్చి ఉండాలి మనవాళ్ళు! అంటే శత్రువులతో చిదానందుడు ఎంత గాఢంగా స్నేహం చేశాడో అర్థమయిందను కుంటాను....!" అన్నాడు.

"అయితే యింకా ఆలస్యమెందుకు? దుర్గానికి యీ పక్కనుంచి యిద్దరం, ఆ పక్కనుంచి యిద్దరం వెతుకు దాం!"

"అలాగే, పదండి పోదాం!"

అప్పటికప్పుడు రెండు జట్లుగా ఏర్పడినవాళ్ళు అటు యిటు చెదిరిపోయారు.

*　　*　　*

"వాళ్ళు కాసేపట్లో మన ఉనికి కనిపెట్టడం ఖాయం! ఎటుపోయి దాక్కోగలం?" అన్నాడు హిమవంత్.

"వాళ్ళు యిద్దరు చొప్పున కదా వెతుకుతున్నారు?! వాళ్ళు రెండు బేచ్‌లుగా దుర్గం మొదటి ద్వారం దగ్గ ర్నుంచి రెండు పక్కలకు విడిపోగానే, మనం ముఖ ద్వారం దగ్గరకు చేరుకొని, లోపలకు ప్రవేశించాలి!" అన్నాడు కార్తీక్.

"నాకో ఆలోచన వస్తోంది" అన్నాడు అశ్విని

యింతలోనే.

"ఏమిటది?" కార్తీక్ అడిగాడు.

"మరేంలేదు, ఇద్దరు చొప్పున వాళ్ళు యీ పక్కనుంచి ఆ పక్కకు తిరిగే లోపల మనం వాళ్ళని చంపేస్తే....?"

"పొరపాటున తప్పించుకొని ఒక్కడు పారిపో గలిగినా మన సంగతి తెలిసిపోదా?"

"అదీ నిజమే!"

"అదీకాక మన దగ్గర వున్న తూటాలు యిప్పుడే ఖర్చయిపోతే శర్మగారిని, అభిలాష్‌ని, దీప్తిని ఎలా రక్షించుకోగలుగుతాం? మన ఆత్మరక్షణ యెలా చేసు కుంటాం?"

కార్తీక్ చెప్పింది సబబుగానే అనిపించింది.

నలుగురు అనుచరులు విడివిడిగా బయల్దేరి ముఖద్వారం మీదుగా అటు యిటు వెతకటానికి, విడిపోగానే ముగ్గురు రాళ్ళగుట్ట వెనకనుంచి చకచక దుర్గం ద్వారం దగ్గరకు చేరిపోయారు. చిన్న ద్వారం తెరిచే ఉన్నది!

ముగ్గురు ఒకరివెంట మరొకరు లోపలికి ప్రవేశించారు. కార్తీక్, అశ్వని తుపాకీలు జాగ్రత్తగా పట్టుకొని చుట్టూ పరీక్షగా చూసి అడుగులు ముందుకు వేశారు. హిమవంత్ చెవులొగ్గి ఎంత చిన్న శబ్దమయినా శ్రద్ధగా ఆలకిస్తూ వాళ్ళతో అడుగులు వేశాడు.

"అదిగో, కుడివైపు ఏవో రాతి గదుల్లాంటివి కనిపిస్తూ న్నాయి, అటుపోదాం పదండి!" అన్నాడు కార్తీక్. అశ్వని, హిమవంత్ అతనితోపాటు చురుగ్గా అడుగులు వేశారు.

కార్తీక్ చటుక్కున ఆగిపోయాడు. పక్క నుంచి ఎవరో నడచివస్తున్న అడుగుల సవ్వడి స్పష్టంగా విని

పిస్తోంది. హిమవంత్, అశ్వని కూడా విన్నారు.

"అశ్వనీ, తొందరపడి కాల్చకు. ముందు ఆ వచ్చే వెవరో కన్ఫర్మ్ చేసుకో" అన్నాడు కార్తీక్ హెచ్చరికగా.

అకస్మాత్తుగా వారిముందు ఓ విచిత్ర వ్యక్తి వచ్చి నిలుచున్నాడు. అతన్నిదివరకు ఎక్కడా వాళ్ళు చూసి వుండలేదు. దాదాపు ఏడడుగుల పొడవున్నాడు. గడ్డాలు మీసాలు బారుగా పెరిగిపోయున్నాయి. జుట్టంతా తెల్లబడిపోయి వున్నది. జడలుకట్టి ఎర్రరంగుకి మారిపోయి వుంది. ఒంటిమీద చీలికలైపోయిన గావంచా మాత్రం వున్నది. అతని చేతుల, కాళ్ళ గోళ్ళు బాగా పొడవుగా పెరిగి వున్నాయి. వయస్సు ఎనభైకిపైగా వుండచ్చు.

అయితే అతని ఆకారం ఎంత భయంకరంగా వున్నదో అతనంత శాంత గంభీరంగా వున్నాడు.

అశ్వని, కార్తీక్ అతనికి తుపాకీలు గురిచేసి అలాగే నించున్నారు కాల్చాలా మానాలా అని!

అతను వీళ్ళవంక చూసి మందహాసం చేశాడు.

"నాయనా!—మీ ఆయుధాలు నన్నేం చెయ్యలేవు, వాటిని దించండి!" అన్నాడు మెల్లిగానే అయినా చాలా స్పష్టంగా.

కార్తీక్, అశ్వని అతని మాటలకు మంత్రముగ్ధుల్లా తుపాకీలు కిందికి దించేసి పట్టుకున్నారు.

"మీరు వచ్చిన పనేమిటో నాకు తెలుసు! మీ స్నేహితురాలు ఆపదలో వున్నది. ఓ మాంత్రికుడి చెరలో వుంది. ఆమెతోపాటు మీ మరో యిద్దరు స్నేహితులు కూడా మాంత్రికుడికి బందీగా వున్నారు. ఆ మాంత్రికుడి

పేరు కళ్యాణస్వామి. అవునా....?" అన్నాడు అతను.

ఆ మనిషిని చూస్తుంటే కార్తీక్ బృందానికి భయం కలగటంలేదిప్పుడు. ఆసక్తి, ఆశ్చర్యం కలిగాయి.

"మీరెవరు? కళ్యాణస్వామితో మీకేమిటి సంబంధం? ఈ సంగతులన్నీ మీకెలా తెలుసు?" అన్నాడు కార్తీక్.

"నాకు యింకా చాలా సంగతులు తెలుసు. మీకు దోవలో ఓ రాగిఫలకం దొరికింది. దానిలో నిధికి సంబంధించిన రహస్య సమాచారం లిఖింపబడి వుంది. ఆ నిధి కొన్ని వేలకోట్ల రూపాయిల విలువగల బంగారం. ఇదే కళ్యాణ దుర్గంలో ఎక్కడో పాతిపెట్టబడివుంది. దాని కోసమే స్వామి పన్నెండేళ్ళుగా యిక్కడ అజ్ఞాతవాసం చేస్తున్నాడు. చాలా, యింకా వివరాలు కావాలా?" అన్నాడతను అదే చిరునవ్వులే.

కార్తీక్, అశ్విని, హిమవంత్ చేష్టలుడిగి అతన్నే చూస్తున్నారు.

"ఇంతకీ మీరెవరో చెప్పలేదు...."

"ఆ వివరాలన్నీ తర్వాత చెపుతాను. మీకు హితుడ్నే. నామీద నమ్మకముంటే మారు మాట్లాడకుండా నాతో రండి!" అన్నాడతను.

"మా స్నేహితులు ఎక్కడ బంధింపబడ్డారు?"

"అదిగో, ఆ కనబడే రాతి గదిలో—అదే కళ్యాణ స్వామి నివాసం!"

"ముందు వాళ్ళను ఆపదనుంచి తప్పించవలసిన అవసరముంది...."

"అది మీ చేతకాదు."

"ఏమిటి మీర నేది?

"కళ్యాణస్వామికి ఎదురుతిరిగిన మనిషి బతికి బట్ట కట్టడం యింతదాకా జరగలేదు. మిమ్మల్ని ప్రాణాలతో విడిచిపెట్టడు యిలాగే వెళ్తే!"

"మరి....?"

"అతన్నెలా జయించాలో నేను చెపుతాను!"

"ఈలోపల మా వాళ్ళకు తనేమయినా ఆపద తల పెడితే....?"

"రాగిఫలకం అతనికి దొరికేవరకు మీ వాళ్ళ ప్రాణాల కేలాంటి ప్రమాదం లేదు!"

"కాని అతనికి రాగిఫలకం యీపాటికి దొరికిపోయి ఉంటుంది. అది మా స్నేహితుల్లో ఒకరి దగ్గర వున్నది!"

అతను ముగ్ధమోహనంగా నవ్వాడు. ఇప్పుడు అతని చేతుల్లో నల్లటి రంగుమారిన రాగిఫలకం — ప్రత్యక్ష మయింది.

"ఇదే రాగిరేకు. మీ స్నేహితుడి దగ్గర్నుంచి నాకిది వరకే చేరిపోయింది!" అన్నాడతను.

ముగ్గురు అతనివంక, అతని చేతిలోని రాగిరేకువంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఆ పచ్చటి వెలుగ్లో రాగి రేకు స్పష్టంగా కనిపిస్తోంది. అది తాము సిదుడిలాంటి ముసలాయన దగ్గర్నుంచి తీసుకున్న రాగిరేకే అనటానికేం సందేహంలేదు. దానిమీది గుర్తులు, మాటలు, సంకే తాలు కార్తీక్ బాగానే గుర్తుపెట్టుకున్నాడు!

"ఇది దొరికేవరకు మీవాళ్ళ ప్రాణాలకు ప్రమాదం లేదు! ఈలోపల కళ్యాణస్వామిని ఎలా మట్టుబెట్టాలో ఆ సులభోపాయాలన్నీ నేను చెపుతాను. మీ స్నేహితుల కేలాంటి ప్రమాదం రాకుండా నే చూస్తాను, నాదే హామీ!" అన్నాడతను.

అతన్ని ఇంకా అనుమానించటం అమానుషమనిపించు తుంటుందనిపించింది ముగ్గురికీ. అతను చెప్పిన విషయాలన్నీ చాలా వాస్తవంగా ఉన్నాయి. కళ్యాణస్వామిని తాము ఎదుర్కొని పోరాడటం సాధ్యమయ్యే విషయంకాదు!

వర్మ, అభిలాష్, దీప్తి యిప్పటికే బందీలుగా అతనికి చిక్కిపోయారు. తెలివిగా వాళ్ళని రక్షించటమేకాక, తమ ప్రాణాలు కూడా కాపాడుకోవాలి. ఏ క్షణంలో నైనా తమని వెతకటానికి వెళ్ళిన అనుచరులు తిరిగి రావచ్చు. ఇంకా తాము యిక్కడే నిల్చునివుంటే తమ ఉనికి తామే బయట పెట్టుకున్నట్టే అవుతుంది.

కార్తీక్, అశ్విని, హిమవంత్ అతని వెంట నిస్సంకోచంగా బయల్దేరారు.

కళ్యాణదుర్గానికి ఎడమవైపుగా వున్న సన్నటి ఇరుకు బాటవెంట అతను ముందు నడుస్తున్నాడు. కార్తీక్ బృందం అతన్ని అనుసరించి వెళ్తున్నారు.

• • •

"నా పేరు వసంతవర్మ" అన్నాడతను.

ఓ సన్నటి బిలంగుండా వాళ్ళను యెక్కడికో తీసుకు వెళ్లాడతను. అక్కడికి యెడమపక్కగా మరో ముఖ ద్వారం ఉన్నది. తలెత్తి పైకి చూస్తూనేగాని అదెంత ఎత్తున్నదో అంచనా కట్టడం సాధ్యంకాలేదు వాళ్ళకి! ముమ్మూర్తులా తాము లోనికి ప్రవేశించిన ముఖద్వారాన్ని పోలి వున్నది! ఆ ద్వారం పక్కగా కుడిపక్కకు మరో చిన్న బాటద్వారా బిలానికున్న రాతిని తొలగించి, లోనికి దారితీశాడతను.

కార్తీక్ బృందాన్ని చిరునవ్వుతో చూసి, "ఇదే, నా నివాసం, లోపలికి రండి!" అన్నాడు.

ఆ బిలం లోపల ఓ కాగడా వెలుగుతోంది! ఆ కాగడా వెలుగులో ఆ బిలంలో వున్న సామగ్రి వాళ్ళ కంటబడింది.

ఓ ఎత్తయిన నునుపుదేరిన బండమీద దర్భాసనం పరచబడి ఉన్నది! దానిమీద అతను కూచుని, వాళ్ళు ముగ్గుర్నీ కూచోమని ఆదేశించాడు. నేలమీద దర్భ పుల్లలతో చేసిన చింకి చాపలున్నాయి.

కార్తీక్, అశ్విని, హిమవంత్ వాటిమీద కూచున్నారు. సొరకాయ డొప్పవంటి ఓ డొప్పతో మంచినీరు కొన్ని పళ్ళు వాళ్ళముందు పెట్టాడతను.

"వీటిని తీసుకోని సేద తీర్చుకోండి! నా దగ్గర ఇంతకు మించి ఆహారమేం లేదు!" అన్నాడతను.

వాళ్ళు ముగ్గురు అతని ఆతిథ్యానికి చాలా సంతోషించారు. నిజానికి ఆకలితో వాళ్ళ కడుపులు నకనకలాడుతున్నాయి. అతనిచ్చిన పళ్ళు తీసుకొని ఆకలిబాధ తీర్చుకున్నారు.

ఆ బిలంలో అంతకుమించి సామగ్రి మరేం కనిపించలేదు వాళ్ళకు!

వాళ్ళ ముఖాల్లో కొట్టొచ్చినట్టు కనిపిస్తూన్న ఆశ్చర్యాన్ని అతను గమనించి చల్లగా నవ్వాడు.

"నా గురించి చెప్పకోకుండా మిమ్మల్ని యిక్కడికి తీసుకురావటం మీకు ఆశ్చర్యం కలిగిస్తోంది కదూ!" అన్నాడు.

కార్తీక్ "అవును తాతగారూ! మీరెవరైనా, మాకు హితులని ముందే చెప్పారు. మీ గురించిన వివరాలు మీ అంతగా మీరే చెప్తారని మాకు తెలుసు, అందుకే తొందరపడి అడగలేదు!" అన్నాడు.

"నా పేరు వసంతవర్మ!" అన్నాడతను.

ముగ్గురు తలలూపారు.

"మీరు దారిలో చూసిన మునిలాంటి వ్యక్తి నా అన్న మాణిక్యవర్మ" అన్నాడు వసంతవర్మ

సిద్ధుడి రూపం ముగ్గురి కళ్ళలోను మెదిలింది.

"మీకు మరింత ఆశ్చర్యం కలిగించే మరో విషయం విషయం—యీ కళ్యాణదుర్గాన్ని నిర్మించిన కళ్యాణవర్మ ఆస్థానంలో ప్రధానామాత్యులుగా పనిచేసిన ప్రసేనవర్మ మా ముత్తాతగారు" అన్నాడు వసంతవర్మ.

"అంటే....?"

"కళ్యాణవర్మ ప్రభువులు చనిపోయేముందు తను నిధి యెక్కడ నిక్షిప్తం చేసినదీ ఓ రాగిరేకుమీద వివరంగా రాసిపెట్టి దాన్ని మా ముత్తాతగారికిచ్చి, దాన్ని తమ కుమారుడు, కళ్యాణదుర్గానికి ఒకే ఒక వారసులు అయిన రాజకుమారులు ప్రశాంతవర్మకు అందచెయ్యమని మా ముత్తాతగారిని ఆదేశించారు. కాని ప్రశాంతవర్మగారి జాడ తెలియలేదు.

మా ముత్తాతగారు చనిపోతూ ఆ రాగిరేకును మా తాతగారికి ఆయన మా తండ్రిగారికి, అలా ఆయనన్నుంచి ఆ రాగిఫలకం అన్నదమ్ములైన మా యిద్దరికీ అందజేయ బడింది. మా వంశం రాజభక్తికి అంకితమయినది కావటం వల్ల, ఆ రాగి ఫలకాన్ని యీనాటివరకు మా వద్ద పదిల పరిచాం.

మా అన్నగారు నేను కూడా బ్రహ్మచారులమే కావ టంతో మా తదుపరి ఈ రాగిరేకు నందచేయటానికి మాకు వారసులు లేరు! అయినా ఏనాటికైనా రాచ

వంశ వారసులు వస్తే మేమే అందచెయ్యాలని యీ రాగి ఫలకాన్ని మాతో పదిలపరిచాం.

మా అన్నగారికి యోగ విద్య తెలుసు! ఆయన తన యోగమాయతో రాగిఫలకాన్ని తన శరీరంలో ఒక భాగమన్నట్టుగా పదిలంగా దాచిపెట్టారు. అది యీ రోజు మీ కళ్ళబడిందంటే, మా అన్నగారు శాశ్వతంగా తనువు చలించారని నాకు తెలిసింది. మీ స్నేహితుడి నుంచి నేనే యీ రాగిఫలగాన్ని అతనికి కూడా తెలీకుండా వశపరుచుకున్నాను. అది యింకా తనలోనే వున్నదని అతననుకుంటూ వుండొచ్చు!" అంటూ ముగించాడు వసంతవర్మ.

అతను చెప్పిన విషయాలు ఊపిరి పీల్చటం కూడా మరచిపోయి శ్రద్ధగా విన్నారు.

వసంతవర్మ, మాణిక్యవర్మల్లాంటి స్వామిభక్తి పరాయణులు యింకా ఈ భూమ్మీద మిగిలివుండటం వాళ్ళకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

"అయితే మధ్యలో యీ కళ్యాణస్వామి ఎవరు? అతనిక్కడ పన్నెండేళ్ళుగా నివాసమేర్పరచుకొని యీ నిధిని వశపర్చుకోవటానికి యిన్ని ప్రయత్నాలు పన్నుతుంటే మీరెందుకు అతన్ని యథేచ్ఛగా వదిలేశారు? అతను యింతమంది అనుచరులతో యిక్కడ యిన్ని అకృత్యాలు చేస్తుంటే ఎలా సహించి వూరుకున్నారు?" అడిగాడు శ్రీకర్.

"మాకు అతనివల్ల యిప్పటిదాకా యెలాంటి ప్రమాదమూ వాటిల్లలేదు. అయినా మా లక్ష్యం వేరు! రాజవంశ వారసుడికి యీ నిధినప్పగించాలి. లేదా యీ నిధి యెవరికీ దక్కకుండా శాశ్వతంగా సమాధి అయి

పోవాలి. అంతే! నిధి రహస్యం తెలిసిన వాళ్ళం మా సోదరులిద్దరమే!

మా సోదరుడివద్ద అతిభద్రంగా యిన్నాళ్ళు దాచబడిన యీ రాగిరేకు యిప్పుడు నాచేతికొచ్చింది. మా ప్రభువులకోసం నేనిలా నా శరీరంలో ప్రాణమున్నంత వరకు ఎదురుచూస్తూనే వుంటాను. నా అవసానకాలం సమీపించగానే దీన్ని నాశనంచేసి నా ప్రాణం విడుస్తాను. నాకిప్పుడు తొంభై ఎనిమిదేళ్ళు! మరో పదేళ్ళు ఖచ్చితంగా బతుకుతాను!" అన్నాడు వసంతవర్మ.

శ్రోతలు ముగ్గురు ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచారు. నూరు సంవత్సరాలు నిండబోతున్న వసంతవర్మలో వృద్ధాప్య ఛాయలు అంతగా కనిపించటంలేదు.

"అయితే — యీనాటివరకు కళ్యాణదుర్గంలోనికి ఎవరూ బయటవ్యక్తులు ప్రవేశించలేదా? ఒకవేళ వచ్చినా వాళ్ళను కళ్యాణస్వామిచేత నియమించబడ్డ మాంత్రికుడు చంపించి వుంటాడు, అవునా?" అడిగాడు అశ్విని.

"ఇంతదాకా కళ్యాణదుర్గాన్ని ఎవరూ చూసినవాళ్ళు లేరు! కళ్యాణస్వామి, అతని ఎనమండుగురు అనుచరులు, అతనిచేత పాతాళ మాళిగలో నియమించబడిన యింకో మాంత్రికుడు, అతని అనుచరులూ మాత్రమే చూసి వున్నారు. కళ్యాణ దుర్గాన్ని చూసిన మొట్ట మొదటి నాగరికులు మీరే! అంటే మీ ఆరుగురు మాత్రమే!" అన్నాడు వసంతవర్మ.

వాళ్ళు ముగ్గురికీ యీ అనుభవం థ్రిల్లింగా వుంది. యేనాటి కళ్యాణవర్మ? యెప్పటి రాజవంశం? ఆ నాటి రాజుకి యింకా వారసులు మిగిలివున్నారా? వున్నా,

తమ తండ్రి యీ దుర్గంలో అపారమైన నిధి నిక్షేపాలు దాచిపెట్టి చనిపోయాడని కళ్యాణవర్మ కొడుక్కి తెలియకపోయి వుండొచ్చు.

కళ్యాణవర్మ మునిమనములు యెవరైనా వుండివుంటే వాళ్ళు ఈనాటికి వసంతవర్మ వయసువాళ్ళు అయివుంటారు! వసంతవర్మకే పెళ్ళయివుంటే అతనిక్కూడా ఈపాటికి మునిమనమలుండి వుండేవాళ్ళు! ఈ లెక్కన ఆలోచించుకుంటూపోతే కళ్యాణవర్మ వారసుడికి ఎన్ని తరాల చరిత్ర పూర్తయిందో యిప్పటికి!

కార్తీక్‌తో పాటు అశ్విని, హిమవంత్ యిదే ఆలోచనలో వున్నారు.

వసంతవర్మ వాళ్ళ మనోగతాభిప్రాయం గ్రహించినట్టుగా చిన్నగా మందహాసం చేసి "రాజవంశానికి వారసుడింకా మిగిలివుంటాడా అని మీలో మీరు నవ్వుకుంటున్నారు కదూ! మూఢభక్తితో యిన్నాళ్ళుగా మా వంశంవాళ్ళు ఈ నిధిని కాపాడుకొంటూ వస్తున్నామని మామీద మీరు ఎలాంటి భావం ఏర్పరచుకున్నారో నేనర్థం చేసుకోగలను! కాని మా రాజభక్తి అలాంటిది! మీ నాగరీకులు దాన్ని అర్థంచేసుకోవటం కష్టం!" అన్నాడు.

వాళ్ళు ముగ్గురు తలలు అడ్డంగా తిప్పి, "మీ రాజభక్తిని శంకించేటంత సాహాసం చేయటంలేదు! మనసారా మీ స్వామి భక్తికి జోహార్లర్పిస్తున్నాం. మేం ఆలోచిస్తున్న విషయం అదికాదు—

ఈ స్వార్థపరుడైన కళ్యాణస్వామి, నిధికోసం ఇంతకాలంగా ప్రయత్నిస్తూంటే అతని ప్రయత్నాలని అదిలోనే మీరెందుకు తుంచలేదు?....అతను పన్నెండేళ్ళుగా

ప్రయత్నించినా నిధి ఎందుకు దొరకలేదు? ఈ దుర్గాన్ని నేలమట్టంచేసి గుల్లగా తవ్వి మరీ నిధి దక్కించుకోవటానికి పన్నెండేళ్ళ కాలం తక్కువదేం కాదని మా నమ్మకం!" అన్నాడు కార్తీక్. తక్కిన యిద్దరిలోనూ అదే సందేహం!

వసంతవర్మ మందహాసంచేసి, "కళ్యాణస్వామి చెయ్యని ప్రయత్నం లేదు! అతను కాళికా ఉపాసకుడు! ఆ ఉపాసనా శక్తితోనే ఇక్కడ, కళ్యాణదుర్గంలో అపారమైన కోట్ల రూపాయిల విలువచేసే నిధి వున్న సంగతి గ్రహించి, సరాసరి వచ్చి యిక్కడ నివాసం ఏర్పరచుకున్నాడు.

అయితే అదృష్టవశాత్తు అతనుపాసించే క్షుద్రదేవతలు బహుశా అన్న దగ్గర యోగమాయలో భద్రపరచి వున్న రాగిపలక గురించిన సమాచారం చెప్పలేక పోయి వుంటాయి. అందుకే కొన్నాళ్ళపాటు ఈ దుర్గంలోని ప్రతిచోటా అనుమానంమీద తవ్వి గోతులుచేసి పెట్టాడు. అయితే అతని కోరిక ఫలించలేదు! అయినా ప్రయత్నం వదల్లేదు.

ఇంతలో రాగిఫలకం మీకు దొరికిన ఉదంతము యెలాగో అతనికి చేరిపోయింది. ఇక నేం నిధి దొరికిపోయిందనుకుని ఆనందపడిపోతూ, మీ వాళ్ళని ఆ రాగిరేకు కోసం హింసిస్తూ ఉన్నాడు. మీరు రంగంలోకి దిగవలసిన సమయం ఆసన్నమవుతోంది. అతన్నెలా యెదుర్కోవాలో నేను చెపుతాను...." అన్నాడు.

* * *

"ఏరి, వీళ్ళేరీ?" అన్నాడు కళ్యాణస్వామి తిరిగొచ్చిన వరదుడ్ని, అనుచరులనీ చూసి.

"అదే అర్థం కావటంలేదు స్వామీజీ! రెండు సారంగా ల్లోనూ పూర్తిగా వెతికి వస్తున్నాం. కాని వాళ్ళ జాడ మాత్రం ఎక్కడా కనిపించలేదు!" అన్నాడు వరదుడు.

కళ్యాణస్వామి నమ్మలేనట్టు చూశాడు. "అదేమిటి, మీరు నలుగురు యిదివరకు వాళ్ళను చూసి, అస్థిపంజ రాలతో భయపెట్టినప్పుడే ఆ రాగిఫలకాన్ని వశం చేసుకొని వుండాల్సింది!....అయినా, వీళ్ళ స్నేహితురాలి కోసం ఖచ్చితంగా వాళ్ళిక్కడికి వస్తారని అనుకున్నాను. అందుకే యీ మెను ప్రేరేపించి, కేకలు పెట్టించాను. అయినా వాళ్ళు రాలేదంటే—నాకెందుకో నమ్మబుద్ధి కావటంలేదు!"

"వాళ్ళు భయపడి వెనక్కి టైగర్ హిల్స్‌వైపు పారిపోయి వుంటారనుకొంటున్నాం స్వామీజీ!" అన్నాడు వరదుడు.

వర్మ విరగబడి నవ్వాడు, వాళ్ళ కంగారు, ఆందోళన చూసి పడిపడి నవ్వాడు. అభిలాష్ భయంగా చూశాడతనివంక.

కళ్యాణస్వామి ఆగ్రహంతో పెడబొబ్బ పెట్టాడు. "ఎందుకలా నవ్వుతావు, నోర్మూయ్యి!" అన్నాడు. వర్మ నవ్వాపలేదు.

కళ్యాణస్వామి, వర్మ రెండు చెంపలు ఛెళ్ళుఛెళ్ళున వాయించాడు.

"మిమ్మల్నిక ప్రాణాలతో విడిచిపెట్టకూడదు! ఆ రాగిఫలకం తీసుకొని మీ స్నేహితులు పారిపోయారని నాకర్థమయ్యింది. కాని వాళ్ళు యిక్కడికి వచ్చితీరా ల్సిందే. నిధి వున్నది ఇక్కడేనని వాళ్ళకి తెలిసిపోయింది. ఈ దుర్గం రహస్యం తెలిసినవాడు అంత తేలికగా

ప్రాణాలతో ఈ సొరంగంనించి బయటపడలేదు. పడనివ్వను! ఈ క్షణమే యెక్కడివాళ్ళక్కడ స్తంభించి పోయేలా చేస్తాను...." అంటూ దేవీ విగ్రహం కాళ్ళ దగ్గరున్న పొడవాటి చేతి ఎముకనుతీసి గాల్లో ఊపి, మనసులో ఏదో స్మరించాడు.

గాల్లో యేదో గుర్తు తెలియని ధ్వనులు వినిపించ సాగాయి' గాలిలో విపరీతమైన వేగం వచ్చింది. అంత వరకు లేని భేదం వాతావరణంలో ఉన్నట్టుండి యెలా వచ్చిందో వర్మకు గాని అభిలాష్‌కి గాని అర్థంకాలేదు. దీప్తికి స్పృహ పోయేలా వున్నది. చిదానందుడ్ని స్వామి నరకటం కళ్ళారా చూసిన దీప్తి బాగా భయపడి పోయింది.

అభిలాష్ సాభిప్రాయంగా వర్మవంక చూశాడు. వర్మకి ఆ చూపుల కర్థం తెలుసు. తొందరపడి కళ్యాణ స్వామితో వాగ్వివాదం పెట్టుకోవద్దనే హెచ్చరిక వుందా చూపులో.

కాని, వర్మ ఆ సలహా లెక్కచెయ్యలేదు. కార్తీక్ వాళ్ళని యెక్కడివాళ్ళ నక్కడ స్తంభింపచెయ్యాలని కళ్యాణస్వామి క్షుద్రశక్తుల్ని ఆహ్వానిస్తున్నాడని అతనికి తెలుసు! కళ్యాణస్వామి ప్రయత్నం ఫలించనివ్వకూడదు! కార్తీక్, అశ్వని, హేమవంత్ కూడా తమలాగే బంధింప బడితే తమని రక్షించే వాళ్ళుండరు!

వర్మ అరిచి చెప్పాడు, "స్వామీజీ, ఆ రాగిఫలకం వాళ్ళదగ్గర లేదు!" అని.

స్వామికి ధ్యానభంగమయింది. కళ్ళు విప్పి వర్మవంక చూశాడు. "ఏమిటి నువ్వనేది?" అన్నాడు.

"రాగిఫలకం మా తక్కిన స్నేహితుల దగ్గర లేదు'

నీ నమ్మినబంటు వరదుడి దగ్గరుంది!" అన్నాడు వర్మ.

వరదుడితోపాటు కళ్యాణస్వామి. తక్కిన అను చరులు ఉలిక్కిపడ్డారు.

వరదుడు ఆగ్రహంతో వర్మ దగ్గరకు వెళ్ళి అతని మూతిమీద కొట్టాడు. "అసందర్భ ప్రేలాపనలు చెయ్యకు. ఆ తామ్ర ఫలకం నా దగ్గరెందుకుంటుంది?" అన్నాడు.

వర్మ తొణక్కుండా చెప్పాడు. "మా యిద్దర్నీ దుర్గం ముఖద్వారం దగ్గర బంధించినప్పుడు నా దుస్తుల్లో నుంచి నువ్వు ఆ రాగిఫలకాన్ని తీసుకున్నావు కదా!"

"అబద్ధం! మీ యిద్దరి దుస్తుల్లోనూ కూడా మాకు ఆ ఫలకం దొరకలేదు. మీ జట్టు విడిపోకముందు ఆ రాగిఫలకం మేము నీ చేతుల్లో ఉండటం చూశాం. ఈ మనిషిని ఆ రేకులోని భాషను అర్థం నువ్వడగటం కూడా మేం చూశాం. ఆ వెంటనే ఆ విషయం మా గురువు గారికి చెప్పటానికి మేం వచ్చేశాం. అదే మా పొరపాటు! అక్కడే ఆ రేకును స్వాధీనం చేసుకొని మిమ్మల్ని చంపి పారేస్తే యింతవరకు వచ్చేదికాదు పరిస్థితి!" అన్నాడు వరదుడు ఆవేశపడిపోతూ.

వర్మ—కళ్యాణస్వామిలో తలెత్తిన అనుమాన బీజానికి తన మాటలతో మరింత బలాన్ని చేకూర్చాడు. "స్వామీజీ, అతన్ని నమ్మకండి! అతని మాటలు నమ్మి పాపం, ఏ పాపమూ ఎరగని చిదానందుడ్ని చంపేశారు. కాని అసలు ద్రోహి ఈ వరదుడే!"

కళ్యాణస్వామి, వరదుడి వంక తీవ్రంగా చూసి, "వీడు చెప్పుతున్నది నిజమేనా? నువ్వు నాకే ద్రోహం తలపెట్టాలని చూస్తున్నావా? నా సంగతి తెలిసే యీ

సాహసానికి ఒడికట్టారా?" అన్నాడు కోపంగా.

"స్వామీజీ, వీడి మాటలు నమ్మకండి! మనమధ్య పొరపొచ్చాలు లేవదీసి మనలో మనం కలహించుకొని నశిస్తే చూడాలని వీడి పన్నాగం! కావాలంటే నాతో ఉన్న మనవాళ్ళను అడగండి" అన్నాడు.

వరదుడితో పాటు ఉండిన ముగ్గురు సహచరులు "అవును స్వామీజీ! వీడు చెప్పేది నిజంకాదు. మన వరదుడు అబద్ధం చెప్పటంలేదు. మేం ముగ్గురమూ కూడా వీళ్ళిద్దరినీ సోదాచేశాం. రాగి ఫలకం వీళ్ళవద్ద లేదు. వరదుడు దాన్ని తీసుకున్నాడనటం నిజంకాదు" అన్నారు.

అయినా కళ్యాణస్వామి ముఖంలో అనుమాన వీచికలు తొలగిపోలేదు. డబ్బుకోసం యెంతటివాడైనా నీచానికి తలొగ్గక మానడు! అందునా వేలకోట్ల రూపాయిల నిధి కోసం తనవాళ్ళనుకున్నవాళ్ళే చేజిక్కించుకోరని నమ్మేదెలా?

చిదానందుడు, వరదుడు తాను నమ్ముకున్న ముఖ్యమైన అనుచరులు! చిదానందుడిమీద ఆరోపణ తెచ్చిన వరదుడు, తాను మాత్రం ఆ అవకాశాన్ని వదులుకుంటాడని ఎలా నమ్మేది? నిజంగానే వరదుడు, తక్కినవాళ్ళలో కుట్ర చేసి రాగిరేకును తాను కాజేసి యెక్కడో దాచిపెట్టి వుంటాడు!

స్వామి మనసులో చెలరేగుతున్న అలజడిని, అతని అనుమానపు చూపుల్ని గ్రహించాడు వరదుడు.

"నామాట నమ్మండి స్వామీజీ! వీడు మీలో లేని పోని అనుమానాల్ని పుట్టించాడు!" అన్నాడు ప్రాధేయ పడుతూ.

వర్మ అవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నాడు.

"వాడి కల్లిబొల్లి మాటలకు కరిగిపోవద్దు స్వామీజీ! వీళ్ళందరు కుట్రపన్ని మిమ్మల్ని అంతం చెయ్యాలనికూడా అనుకోవటం మేము విన్నాం. అసలు ఆ రాగిరేకులో ఏమున్నదో కూడా మాకు తెలయదు. మాకెవరికీ ఆ భాష తెలియదు. మీరు చెప్పేవరకు యిక్కడ ఏదో నిధివున్న విషయం కూడా మాకు తెలియదు. మాకు ఆ రాగిరేకువల్ల ఎలాంటి ఉపయోగమూ లేదు. మాకు ధనాశ లేదు.

ఉద్యోగరీత్యా టైగర్ హిల్స్‌కి వచ్చిన మమ్మల్ని యెవడో మాంత్రికుడు యీ సొరంగంలో బంధించాడు. తప్పించుకొని పోవటానికి మార్గం తెలియక వస్తుంటే ఏదో మునిపర్ణశాలవంటిది కనిపించింది. మా స్నేహితురాలి జాడ కనుక్కోవటానికి ఆయనను అడగాలని వెళ్తే యీ రాగిరేకు కనిపించింది. అది వూరకే మాతో పట్టుకొస్తుండగా మీ అనుచరులు పట్టి బంధించారు.

అంతకుమించి ఇక్కడి నిధినిక్షేపాల గురించి మాకేం తెలియవు. మీరు మమ్మల్ని వదిలిపెట్టేస్తే మా తోవన మేం పోతాం" అన్నాడు గుక్కతిప్పుకోకుండా.

కళ్యాణస్వామి ఏం మాట్లాడలేదు. వర్మ మాటలు అతనిలో అనుకోని మార్పు తీసుకొచ్చాయని అభిలాష్, వర్మ కూడా గ్రహించారు. వరదుడు తక్కిన అనుచరులు వర్మ వంక గుర్రుగాను, గురువు వంక టెన్షన్‌తోను చూస్తున్నారు.

స్వామి ఆ రాతిగదిలో అశాంతితో అటు యిటు పచార్లు చేస్తున్నాడు. అతనేం చేయబోతున్నాడో తక్కిన వాళ్ళకు అనూహ్యంగా వున్నది! అతని వంకనే కళ్ళప్పగించి చూస్తున్నారు.

* * *

వసంతవర్మతో మాట్లాడుతున్న కార్తీక్‌కి, అశ్వనికి, హిమవంత్‌కి కొద్దిక్షణాలు తమ అవయవాలు స్తంభించి పోతున్నట్టు, రక్తప్రసరణ ఆగిపోతున్నట్టు, నోటమాట రానట్టు, నాలిక పొడారిపోతున్నట్టు అనుభూతి కలిగింది. కొద్దిక్షణాలు చేష్టలుడిగిపోయినట్టు అలాగే కూచుండి పోయారు.

వసంతవర్మ కంగారుపడి యేదో అడగబోయేంతలో వాళ్ళలో చలనం వచ్చింది.

"ఏమిటి తాతగారూ, మాలో అనుకోకుండా ఏదో మార్పు వచ్చింది.... అది మా ఊహకి అందటంలేదు!" అన్నారు ముగ్గురూ ఒకేసారి.

వసంతవర్మకు అర్థమయ్యింది. ఆయన తల వూపి, "అదంతా క్షుద్రశక్తుల ప్రభావం! కళ్యాణస్వామి మీ ఉనికి తెలుసుకోవటం కోసం ప్రయత్నించి వుంటాడు. మీరు వెనుతిరిగి పారిపోతుండవచ్చనే ఊహతో మిమ్మల్ని కదలకుండా స్తంభింపచెయ్యాలని ప్రయత్నించి వుంటాడు! ఈలోపల అతని ప్రయత్నానికి ఎవరో అవరోధం కల్పించి వుంటారు!" అన్నాడు.

"అయితే అతనికి మేమిక్కడ వున్నట్టు తెలిసిం దంటారా?" అడిగాడు కార్తీక్.

"బహుశా తెలియకపోవచ్చు! అతని దుష్టశక్తుల ప్రభావం మా సోదరులమీద ఫలించకుండా మా అన్న గారి యోగవిద్య ఉపయోగపడింది. అందుకే ఆ రాగి ఫలకం మా అన్నగారు కూచునే ఆసనంకింద దాచివున్న సంగతి యిన్నాళ్ళు కళ్యాణస్వామి తెలుసుకోలేక పోయాడు.

మా అన్నగారు సమాధిలో లీనమయిపోగానే ఆ

రాగిఫలకం మీ కళ్ళబడటం, తద్వారా పర్ణశాల దాటిన మరుక్షణం అది స్వామి అనుచరుల కళ్ళబడటం, అతనికి సమాచారం చేరిపోవటం జరిగింది! ఇన్నాళ్ళుగా వాళ్ళకు నా స్థావరం కూడా తెలియకుండా అన్ని జాగ్రత్తలు తీసుకున్నాను! కాని ఇప్పుడు ముఖాముఖి ఎదురుకోవలసిన సమయం ఆసన్నమయింది.

మీకు మొదట అతని కార్యకలాపాల గురించి ఉపాసన గురించి, అతను వశపరచుకున్న దుష్టశక్తుల్ని గురించి అన్ని వివరాలు చెపుతాను. ఆ తర్వాత కళ్యాణ స్వామిని ఎలా నాశనం చెయ్యాలో పథకాన్ని రూపొందిస్తాను. నిగ్రహంతో వ్యవహరిస్తే అతన్ని, అతని అనుచరుల్ని మట్టుపెట్టడం కష్టంకాదని నా నమ్మకం! ఆ రాగిఫలకం గురించి, అతను మీ వాళ్ళను తొందరపడి ఏం చెయ్యడని ఖచ్చితంగా చెప్పగలను." అన్నాడు వసంతవర్మ అందరివంకా పరిశీలనగా చూస్తూ.

"మీరేం చెపితే అది చెయ్యటానికి సిద్ధంగావున్నాం. ఎంత తొందరగా యిక్కడినుంచి బయటపడి మా ఊరు చేరుకోగలమా అని చాలా ఆత్రుతగా వున్నది! ఈ నిధి రహస్యం యిక్కడితోనే వదిలేసి మా దారిన మేం పోతాం! ముందు ఆ కళ్యాణస్వామి చెరనుంచి మా వాళ్ళను విడిపించుకోగలిగితే అదే పదివేలు!" అన్నాడు కార్తీక్.

వసంతవర్మ మందహాసం చేశాడు.

* * *

కార్తీక్, అశ్విని తుపాకులు చేతపట్టుకున్నారు.

అప్పటికే బాగా తెల్లవారిపోయినట్టుంది. వెలుతురు సన్నగా యెక్కడినుంచో పడుతోంది.

ముందుగా వసంతవర్మ నడుస్తున్నాడు. "నేను ముందుగా స్వామి స్థావరంవద్ద ఏ పక్కనుండి లోనికి ప్రవేశించటానికి అనుకూలంగా వుంటుందో చూసి మీకు సైగచేస్తాను. మీరు సరాసరి ముందు అతని పూజా గృహాన్ని, పూజా ద్రవ్యాల్ని. నాశనం చేసెయ్యాలి. మంత్ర శక్తి వున్న ఎముక స్వామికి అందుబాటులో లేకుండా నేను చూస్తాను.

సమయం చూసి స్వామిని అతని యిద్దరు అనుచరుల్ని తుపాకుల్తో కాల్చెయ్యండి. బయటినుంచి తక్కిన అయిదు గురు వస్తున్నారేమో నేను చూసి, మీకు సంకేతం అందిస్తాను. ఈలోపల బందీలుగా వున్న మీ స్నేహితుల్ని కూడా బంధనాలు తొలగిస్తే మీకు సాయంగా వుంటారు! నేను ఖాళీగా వుంటాననుకోకండి. నా వంతు నేనూ శత్రువుల్ని వేటాడతాను. ఇదిగో నా వేట కత్తి!" అన్నాడు పొడవాటి కత్తిని చేత ధరించిన వసంతవర్మ.

అందరూ మౌనంగా నడుస్తున్నారు.

వసంతవర్మ అటు యిటు చాలా పరీక్షగా చూస్తున్నాడు. అతనివి పాము చెవులు. ఎక్కడ ఎంత చిన్న అలికిడి అయినా చెవులు నిక్కబొడుచుకొని వింటున్నాడు.

కళ్యాణస్వామి వుంటున్న రాతిగదిని సమీపించారు.

వసంతవర్మ గుమ్మం దగ్గరకు మెల్లిగా చేరుకొని లోనికి చూశాడు. లోపల కళ్యాణస్వామి అసహనంగా అటు ఇటు తిరుగుతూ బోనులోపడ్డ పులిలా హుంకరిస్తున్నాడు. అతడి పక్కనే వరదుడు చేతులు కట్టుకొని నిల్చున్నాడు. ఇద్దరు అనుచరులు ఓ పక్కగా నిల్చొని వున్నారు. వాళ్ళ చేతుల్లో శూలాలున్నాయి.

"అయితే నిజం చెప్పదలచుకోలేదన్నమాట. అయితే అనుభవించు" అని శూలాలుపట్టుకున్న అనుచరులవంక చూసి, "వీడ్ని మీ శూలాలతో తూట్లు పొడిచి పారెయ్యండి! నాకే ద్రోహం తలపెట్టాడు!" అన్నాడు.

అనుచరులిద్దరు శూలాలతో వరదుడ్ని సమీపించారు. వరదుడు చలించలేదు.

"స్వామీజీ! మీ నమ్మకం పోగొట్టుకున్నాక నేను బతికినా ఒకటే, చచ్చినా ఒకటే! వాళ్ళ చేతుల్లో చచ్చేకన్నా, మీ చేతుల్లో చావటమే నాకు సంతోషంగా వుంటుంది. చిదానందుడ్ని సంహరించిన మీ కత్తితోనే నన్ను నరికెయ్యండి" అన్నాడు నిశ్చలంగా.

కళ్యాణస్వామి చేతి సైగతో అనుచరులు ఆగిపోయారు.

కళ్యాణస్వామి తల విదిలించాడు. వరదుడ్ని యెలా అర్థంచేసుకోవాలో అర్థంకానట్టు నిలిచిపోయాడు.

సరిగ్గా ఆదే సమయంలో వరదుడి చూపు వసంతవర్మ మీద పడింది. ఉలిక్కిపడ్డాడు వరదుడు.

"స్వామీజీ, ఆపద ముంచుకొస్తోంది. ఎవరో శత్రువులు...." అని వరదుడు అంటుండగానే అశ్విని, హిమవంత్ పూజ గదిలోకి చొచ్చుకొని వచ్చేశారు. అక్కడి పూజా ద్రవ్యాల్ని, విగ్రహాలనీ క్షణంలో నేలమట్టం చేసేశారు.

ఈ లోపల వరదుడు, వసంతవర్మ మీదికి ఓ శూలంతో దూసుకొచ్చేశాడు.

కళ్యాణస్వామి విగ్రహం కాళ్ళచెంతనున్న మంత్రశక్తిగల ఎముకను, పొడవాటి వేటకత్తిని రెండు చేతుల్లోకి తీసుకున్నాడు.

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

కార్తీక్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా కళ్యాణస్వామి చేతికి గురిచూసి కాల్చేశాడు. అతని చేతిలోని ఎముక దూరంగా యెగిరిపడింది. కాని యింతలోనే శూలాలు ధరించిన యిద్దరు అనుచరులు కార్తీక్ మీదికొచ్చేశారు.

ఈలోపల తనమీదికి దూసుకొచ్చిన వరదుడ్ని నేల కూల్చి కళ్యాణస్వామిమీదికి లంఘించాడు వసంతవర్మ. మరుక్షణం స్వామి చేతిలోని కత్తిని తన కత్తితో ఎగరగొట్టేసి అతని తల నరకబోయేంతలో వరదుడు దిగ్గున లేచి శూలంతో వసంతవర్మ చేతిలోని కత్తిని ఎగరగొట్టేశాడు.

అశ్విని గురిచూసి కళ్యాణస్వామిని కాల్చేశాడు. కాని వరదుడు అమాంతం స్వామికి అడ్డొచ్చేసి గుండు దెబ్బకు తను బలై పోయాడు. "స్వామీజీ, పరిస్థితి విషమించింది. నేను మీకేవిధంగానూ సాయపడలేక పోతున్నా....ను" అంటూ ప్రాణాలు వదిలాడు.

ఈలోపల హిమవంత్ కిందపడిన కత్తిని వసంతవర్మకు అందించాడు. ఓ శూలాన్ని కార్తీక్ మీదికి దాడిచేసిన అనుచరుల మీదికి గురిచూసి విసిరాడు. ఓ అనుచరుడు నేలకూలాడు. రెండోవాడ్ని కార్తీక్ తుపాకీతో కాల్చేశాడు.

వసంతవర్మ కత్తితో స్వామి మీదికి వెళ్ళేంతలో చాలా చిత్రంగా కళ్యాణస్వామి అక్కడినుంచి అంతర్ధానమయి పోయాడు. అతను ఎటుపోయాడో, ఎలా మిస్సయ్యాడో ఎవరికీ అర్థంకాలేదు.

సరిగ్గా అదే సమయంలో బయట వెతకడానికిపోయిన నలుగురు అనుచరులు అక్కడికొచ్చారు. వాళ్ళకి పరిస్థితి

తెల్సుకోవటానికి కూడా సమయం లేకపోయింది.

వసంతవర్మ యిద్దర్ని ఊచకోత కోసేంతలో కార్తీక్, అశ్విని తక్కిన యిద్దర్నీ కాల్చి చంపేశారు.

ఈలోపల హిమవంత్, వర్మను, అభిలాష్‌ని, దీప్తిని బంధవిముక్తుల్ని చేశాడు.

దీప్తి ఒక్కసారిగా వచ్చి కార్తీక్‌ని బలంగా కావలించుకుని అతని గుండెలమీద తలవాల్చి భోరున ఏడ్చేసింది. అంతదాకా ఆమె అణచిపెట్టి దాచుకున్న దుఃఖం ఒక్కసారిగా లావాలా తోసుకొని వచ్చేసింది.

కార్తీక్ ఆమె వెన్ను నిమిరి ఓదార్చాడు. "కాస్త ఓపికపట్టు! ఈ మాంత్రికుడు ఎటో తప్పించుకుపోయాడు. వాడి సంగతి చూస్తే, యిక మనకు శత్రుశేషం లేనట్టే! హాయిగా తిరిగి మన ఊరు వెళ్ళిపోవచ్చు!" అన్నాడు.

ఈలోపల అశ్విని, హిమవంత్, అభిలాష్, వర్మ, వసంతవర్మ చుట్టుపక్కల కళ్యాణస్వామి కోసం తీవ్రంగా గాలించి నిరాశగా అక్కడకు చేరుకున్నారు.

"చాలా చిత్రంగా వుంది. మన కళ్ళముందే కళ్యాణ స్వామి తప్పించుకు పారిపోవటం చాలా వింతగా వుంది!" అన్నాడు వసంతవర్మ. కత్తి ధరించి అతను శత్రువుల్ని చీల్చి చెండాడుతుంటే అతను వయోవృద్ధుడన్న విషయమే ఎవరికీ గుర్తురాలేదు!

నేలమీద చిదానందుడు వరదుడితోపాటు తక్కిన ఆరుగురు స్వామి అనుచరులు శవాల రూపంలో రక్తపు మడుగుల్లో తేలుతున్న దృశ్యం చాలా భయంకరంగా కనిపిస్తోంది.

(సశేషం)

